



# చతుర

జూన్ 2010
రూ. 10/-

అస్సామీ
మణిపూస.. 128



తమిళం :
రాజేష్‌కుమార్
అనువాదం :
జిల్లెళ్ళ బాలాజీ
ఓ వర్షం కురిసిన
రాత్రి... 18

సంపుటి -33
సంచిక - 5
జూన్ 2010
389వ సంచిక

# చతుర



'జర్నలిస్ట్ నిషా కోసం వచ్చావా? బ్యాడ్‌లక్ నువ్వింక ఇక్కడినుంచి బయటపడలేవు' అన్నాడు డాక్టర్ చతుర్వేది. 'ప్రయోగాలు చేయడానికి మా ల్యాబ్‌కు దొరికిన రెండో ఎలుకవి నువ్వు' అంది ఆయన అసిస్టెంట్ ఆర్యా. 'సా..సార్.. నేనేమీ దొంగని కాను. ప్లీజ్ నన్ను వదిలేయండి' భయం భయంగా అన్నాడాయువకుడు. 'నువ్వొక దొంగవైతే నిజంగానే వదిలేసేవాళ్లం. నిషాకోసం వచ్చి తప్పు చేశావు' అన్నాడు డాక్టర్. ఇంతకీ ఆ ల్యాబ్‌లో చేసే ప్రయోగాల కథాకమామిషు ఏమిటి? ఆ యువకుడు తప్పించుకున్నాడా? ఆద్యంతం ఉత్కంఠతో సాగే **రాజేష్‌కుమార్** తమిళ నవలకు **జిల్లేళ్ళ బాలాజీ** తెలుగు అనువాదం **ఓ వర్షం కురిసిన రాత్రి** 18వ పేజీలో..

బొమ్మలు : భాస్కర్



# దొడ్ల రామారావు టూర్స్ & ట్రావెల్స్




(ఆలిండియా యాత్రా ఆర్గనైజర్స్ & పిలిగ్రిమ్స్ వెల్ఫేర్ అసోసియేషన్ సభ్యత్వ సంస్థ)
జాతీయ, అంతర్జాతీయ తీర్థ యాత్రికుల సహకార సంస్థ
ప్రొప్రయిటర్స్ & ఆర్గనైజర్స్ దొడ్ల హేమంతరాయ విజయనాగార్జునకుమార్‌దొర, B.Com., జగదీష్ చంద్ర చక్రవర్తి
షాపు నెం. NB 39, కాశేశ్వరరావు మార్కెట్, వస్త్రలత ఎదురు, విజయవాడ-520 001
ఫోన్స్: S.T.D. 0866 - (O) 2424145, (R) 2562825, Cell: 94400 30939, 98481 24759, 99490 04499
E-mail: dodla_travels@yahoo.com, Fax: 0866 - 2420459


**తీర్థయాత్రల వలన ఆరోగ్యము చేకూరి ఆయుష్షు పెరుగుతుంది.**

గత 49 సంవత్సరముల నుండి యాత్రా సంస్థలకు మార్గదర్శకం గాను, లక్షలాది ప్రజల ప్రసంశలతో దిగ్విజయంగా యాత్రలు సాగిస్తున్న ఏకైక అగ్రశ్రేణి సంస్థ నిర్వహణలలో మీ ప్రయాణం సుఖతరంగా వుండి ఆనందమైన అనుభూతులు కలిగిస్తుంది.



## ఈ దిగువ యాత్రలకు వెంటనే సంప్రదించగలరు

15 రోజులు - 14 క్షేత్రములు - 6,000 కి.మీ.

విజయవాడ నుండి హరిద్వార్, ఋషీకేశ్, హనుమాన్ చెట్టి, యమునోత్రి, ఉత్తరకాశి, గంగోత్రి, గౌరికుండ్, కేదార్‌నాథ్, బదరినాథ్, బ్రహ్మకపాలం, ఢిల్లీలతో

## ఉత్తరఖండ్ - ఛారుధామ్ యాత్ర

మొదటి యాత్ర : ది. 6-6-2010, రెండవ యాత్ర : ది. 3-7-2010 తేదీలలో బయలుదేరును.

టిక్కెట్టు 1కి 13,329/- లు.

---

అమర్‌నాథ్ దర్శన్‌కు స్పెషల్ యాత్రలు : 16 రోజులు - 13 క్షేత్రములు - 6000 కి.మీ.

ఢిల్లీ, అమృతసర్, జమ్మూ, శ్రీనగర్, బాల్‌తాల్, అమర్‌నాథ్, కాట్రా వైష్ణవీ దేవి, కాంగడా వజ్రేశ్వరి దేవి, జ్వాలాముఖి దుర్గా దేవి, చింతాపూర్ణి, చాముండి దేవి, నైనాదేవి, బాక్రా-నంగల్ డ్యాములు, చండీఘర్, రాక్‌గార్డెన్, గల్ఫ్‌లేక్, కురుక్షేత్రములతో...



## అమర్‌నాథ్ - కాశ్మీర యాత్ర

మొదటి యాత్ర : ది. 27-6-2010, రెండవ యాత్ర : ది. 12-7-2010 తేదీలలో బయలుదేరును. టిక్కెటు 1కి రూ. 13,445/-లు మాత్రమే.

---

జులై 17, ఆగష్టు 19, సెప్టెంబర్ 9 తేదీలలో విజయవాడ నుండి పోను రాను 20 రోజులు

గోరఖ్‌పూర్, ఖాట్మండు, న్యాలం, సాగా, పర్యాంగ్, దెహరాఫన్, డొల్మాలా పాస్‌లతో...

## కైలాస్ - మానససరోవర్ యాత్ర

మొదటి యాత్ర : ది. 17-7-2010 శనివారం బయలుదేరును. టిక్కెట్టు 1కి రూ. 97,299/-

---

32 రోజులు - 35 క్షేత్రములు - 14000 కి.మీ. - 12 జ్యోతిర్లింగములతో కూడినపూరిజగన్నాథ్, కోణార్క్, భువనేశ్వర్, బుద్ధగయ, గయ, వారణాశి, ప్రయాగ, అయోధ్య, హరిద్వార్, ఋషీకేశ్, బదరినాథ్, బ్రహ్మకపాలం, ఎల్లోరా, షిర్డి, నాసిక్, ఔరంగాబాద్, ఎల్లోరా, పండరీపురం, చెన్నైలతో...

## భారత సందర్శన యాత్ర

ది. 20-9-2010 సోమవారం విజయవాడ నుండి స్పెషల్ స్లీపర్ క్లాస్ రైలు బోగీలు బయలుదేరును.

స్లీపర్ క్లాస్ రైలులో (పూర్తి బెర్తు) ఉదయం పూట కాఫీ, టిఫిన్, 2పూటలా శాకాహార భోజనం బదరీ-కేదార్ బస్సు ఛార్జీలు, సత్రములు, లాడ్జింగుల ఛార్జీలతో సహా టి.1కి రూ. 37,575/- లు వెంటనే టి. 1కి రూ. 5,000/- లు అడ్వాన్సు కట్టి రిజర్వు చేసుకొనగోర్తాము.

---

"హిమాలయ పర్వతశ్రేణుల్లో విమానయానం" : 16 రోజులు - 14 క్షేత్రములు - 7500 కి.మీ

లక్నో, నైమిశారణ్యం, గోరఖ్‌పూర్, లుంబిని, పోక్రా, మన్‌కామనాదేవి, ముక్తినాథ్, పశుపతినాథ్, నేపాల్, ఖాట్మండు, వారణాశి, కాశి, సారనాథ్, వ్యాసకాశి మొ॥వాటితో...

## నేపాల్ - ముక్తినాథ్ యాత్ర

ది. 9-9-2010 న బయలుదేరును. టిక్కెట్టు 1కి రూ. 25,666/-

---

15 రోజులు - 22 క్షేత్రములు - 5500 కి.మీ.

అహ్మదాబాద్, స్వామి నారాయణ, తులాభారం ద్వారక, సోమనాథ్ (జ్యోతిర్లింగము) వీరావల్, పోరుబందరు, సుదామపురి, ఓఖా పోర్టు, గోమతి ద్వారక, బేట్‌ద్వారక, గోపీతలావ్, నాగనాథ్, (జ్యోతిర్లింగము) జైపూర్, అజ్మీర్, పుష్కరరాజ్, మౌంటుఅబూ, ఉదయపూర్, ఏకలింగజీ, శ్రీనాథ్ ద్వారక, క్రాంకోలి ద్వారక, ఉజ్జయిని (జ్యోతిర్లింగము) ఓంకారేశ్వర్ (జ్యోతిర్లింగము) మొదలగు వాటితో

## పంచ ద్వారకలు - చతుర్జ్యోతిర్లింగముల యాత్ర

మొదటి యాత్ర : ది. 23-7-2010, రెండవ యాత్ర : ది. 24-9-2010 తేదీలలో బయలుదేరును. టిక్కెట్టు 1కి రూ. 13,329/-లు మాత్రమే.

---

ది. 6-12-2010 న ప్రారంభమయ్యే ప్రాణహిత నది పుష్కరములకు

## ప్రాణహితనది పుష్కర యాత్ర

మొదటి యాత్ర : ది. 8-12-2010 న విజయవాడనుండి బయలుదేరును

**గమనిక :** నవంబరు, డిసెంబరు, జనవరి నెలల్లో శబరిమలై యాత్రలు, అలాగే డిసెంబర్‌లో పుష్కర యాత్రలు జరగడం వల్ల బస్సులకు డిమాండు ఎక్కువగా వుంటుంది. ముందుగానే తమ టిక్కెట్లు బుక్ చేసుకొనవలసిందిగా కోరుచున్నాము.

అపార్ట్‌మెంటాలజీ 29

# పిచ్చికుక్కలకు స్వాగతం



యర్రంశెట్టి శాయి

"హైదరాబాద్ మహానగరం ఎప్పుడూ ఏదో న్యూస్‌తో టాప్ పొజిషన్‌లో ఉంటుంది. చాలా గ్రేట్ సిటీ మనది" అన్నాడు విజయ్‌యాదవ్. మా కమిటీ వాళ్లలో కొంతమంది ఒప్పుకోలేదు.

"ఏవో న్యూస్‌తో టాప్ పొజిషన్‌వే ఉంటాయ్‌గానీ - ఫర్ రాంగ్ రీజన్స్" అన్నాడు హమీద్‌మియా.

మా అపార్ట్‌మెంట్ సొసైటీ ప్రెసిడెంట్ ఆ డెసిషన్ ఇచ్చాక కొంతమంది అతన్ని సపోర్ట్ చేశారు.

ఇంకొంతమంది వ్యతిరేకించారు.

"అవ్! వరల్డ్‌ల ట్రాఫిక్ రూల్స్ ఒక్కడు కూడా పాటించని నగరం మనదే" అన్నాడు మొహిందర్.

"మందు కొట్టటంలో మన సిటీ ఇండియాలో నెంబర్ వన్" అన్నాడు శంకరమూర్తి.

"కోతుల బెడదలో కూడా మన హైదరాబాద్ నెంబర్‌వన్" అన్నాడు బోసు.

ఇలా అందరూ మాట్లాడుతుండగానే కుక్క అరుపులూ, దాని వెనుకే ఒక స్త్రీ కేకలూ వినిపించాయ్. అందరం వెనుక బ్లాక్ వేపు పరుగెత్తాం.

అప్పటికే ఆ కుక్క మెట్లు దిగుతున్న ఆ లేడీ కాలు కొరికేసింది.

వెంటనే విజయ్, జగన్ ఆ కుక్కని తరమబోయారుగానీ అది ఆంధ్రప్రదేశ్‌లో పుట్టి పెరగటం చేత ఏ మాత్రం లెక్క చేయకుండా ఎదురు తిరిగింది. వాళ్లను ఎటాక్ చేయబోయింది.

దాంతో వాళ్లిద్దరూ ముందు ఎవడ్ని వాడు రక్షించుకోడానికి మా అపార్ట్‌మెంట్స్ వదలి మెయిన్‌రోడ్ మీదకు పరుగెత్తారు. అలా అంతమంది జనం రోడ్‌మీదకు పరుగెత్తుకు రావటం ఏ మాత్రం ఇష్టపడని ఆ ఏరియా కుక్కలు తమ అసమ్మతిని పెద్ద ఎత్తున తెలియజేయడానికని దొరికిన కాలుని దొరికినట్టుగా చీల్చి చెండాడినయ్.

ఆ గొడవంతా చూసి హైదరాబాద్‌లో ఎప్పుడే అవాంతరం జరుగుతుందోనని గుండెలు చేత్తో పట్టుకుని వ్యాపారాలు చేసుకునే షాపులవాళ్లు కమ్యూనల్ రైట్సో లేక పొలిటికల్ పార్టీవాళ్ల వీరంగమో తెలీక ఎందుకయినా మంచిదని అర్జంటుగా షట్టర్స్ మూసేసి మల్టీప్లెక్స్‌లకు

రిజిష్టర్ నెం. 160/2002 జై కరుణామయి

# శ్రీ విజయేశ్వరి వృద్ధాశ్రమము

మరియు

# శ్రీ కరుణామయి విశ్వశాంతి ప్రచారసేవా సంస్థ



ఈశ్వరరెడ్డినగర్, ప్రొద్దుటూరు, కడప జిల్లా.

ప్రతి మనిషికి

తల్లిదండ్రులు ప్రత్యక్ష దైవస్వరూపులు ఆరాధ్యదేవతలు, తల్లిదండ్రులను గౌరవించ గలుగు తనయులు సమాజమునకు ఆదర్శ ప్రాయులు. తల్లిదండ్రుల సేవే ప్రత్యక్ష పరమాత్మ సేవ. అవసానదశలో వున్న తల్లిదండ్రులను సేవించవలసిన, ఆదరించవలసిన గురుతర బాధ్యత తనయులపైనే వున్నది. నేటి సమాజంలో కొందరు తనయులు అవసాన దశలో వున్న తమ తల్లిదండ్రుల పట్ల తమకున్న గురుతర బాధ్యతను విస్మరిస్తున్న కారణంగా.. ఎందరో వృద్ధులు వీధుల పాలౌతున్నారు. అట్టి వృద్ధులను చేరదీసి ఆదుకొను నిమిత్తం అక్కడక్కడ స్థాపించ బడుతున్న అనేక వృద్ధాశ్రమాలలో **"శ్రీ విజయేశ్వరి వృద్ధాశ్రమం"** ఒకటి. 2001 సం॥లో స్థాపించబడిన ఈ వృద్ధా శ్రమంలో 135 వృద్ధులకు నివాసవసతి కల్పించబడినది. దాతల సహకారంతో నిర్వహించబడుతున్న ఈ వృద్ధాశ్రమాన్ని సందర్శించాలని పాఠకులను ఆహ్వానిస్తున్నాం.



# ఆత్మశ్రీ ధర్మతేజ

వ్యవస్థాపక అధ్యక్షులు.



పరుగెత్తారు. దాంతో ట్రాఫిక్ జామ్‌లయ్యాయ్. ఏ గొడవ జరిగినా ముందు బస్సులు తగలబెట్టడం అలవాటున్న స్ట్రీట్ రౌడీలు కొంతమంది వెనువెంటనే నాలుగు బస్సులకు అద్దాలు పగులగొట్టి నిప్పంటించారు. ఆ పరిస్థితంతా సద్దుమణగటానికి రెండు గంటలు పట్టింది.

కుక్కలు కరిచిన వాళ్లందరం కలిసి- మరోసారి కుక్కలు అటాక్ చేయకుండా నాలుగు కర్రలు పట్టుకుని అడ్డుపడిన ప్రతి కుక్కతో ఫైటింగ్ చేసుకుంటూ మా అపార్ట్‌మెంట్స్‌కి చేరుకున్నాం! అప్పటికే అపార్ట్‌మెంట్స్‌లో వాళ్లంతా ఎవరిళ్లల్లో వాళ్లు దూరి తలుపులేసుకుని బాల్కనీల్లో నుంచీ, కిటికీల్లో నుంచీ కిందకు చూస్తున్నారు.

అపార్ట్‌మెంట్స్ గేట్లపైన ఇంకొంత మంది వేలాడుతున్నారు. మమ్మల్ని చూసి వాళ్ళందరూ గాబరాపడ్డారు.

"లోపలకు రాకండి! ఆ పిచ్చికుక్క మన అపార్ట్‌మెంట్స్‌లోనే ఎక్కడో దాక్కుంది" అన్నారు వాళ్ళు.

"మా దగ్గర కర్రలున్నయ్- ఏం ఫరవా లేదు- మీరంతా కూడా కర్రలు తీసుకుని ఆ కుక్క ఎక్కడుందో వెతకండి!" అంటూ అరిచాడు విజయ్‌యాదవ్!

దాంతో అందరికీ ధైర్యం వచ్చింది.

చేతికి దొరికిన ఆయుధం తీసుకుని కిందకు దిగారు. ఒక్కొక్క బ్లాకూ వాటి సెల్లార్లూ, టెర్రేస్‌లూ అన్నీ వెతకటం మొదలుపెట్టాం! చాలా సేపటి తర్వాత చిన్నపిల్లలకు కనిపించిందా పిచ్చికుక్క.

"అంకుల్! అదిగో.. ఆ కారు కింద ఉంది" అంటూ అరిచాడా కుర్రాడు. వెంటనే అందరూ కర్రలు తీసుకుని ఆ కారుని చుట్టుముట్టాం! అంతమందిని చూసేసరికి మళ్ళీ తిక్కరేగినట్లుంది.

సడెన్‌గా అది బయటికొచ్చి ఇంకో ఇద్దరిని ఎటాక్ చేసి మా మధ్యనుంచే మరో బిల్డింగ్ కిందకుపోయి ఓ మూల నక్కింది. అందరం మళ్ళీ అదున్న చోటుని చుట్టుముట్టాం!

సరిగ్గా అప్పుడే సైరన్ పెద్దగా మోగిస్తూ పోలీస్ జీప్ వచ్చి మా అపార్ట్‌మెంట్స్ ముందు ఆగింది.

దానివెనుకే మామూలుగానే తుగ్లక్ టీవీ చానెల్ వాన్ ఉంది.

ఇటు పోలీస్ ఇన్‌స్పెక్టర్.. అటు చానెల్ కెమెరామెన్, జర్నలిస్టూ- హడావిడిగా దిగి మా దగ్గరకొచ్చారు.

మా అందరి చేతుల్లో రకరకాల ఆయుధాలుండటం గమనించాడు ఇన్‌స్పెక్టర్.

"ఏంటి.. ఏం జరుగుతోందిక్కడ?" అన్నాడు దబాయింపుగా.

"ఒక్క పిచ్చికుక్క దాక్కుంది" చెప్పాడు మొహిందర్‌సింగ్.

ఇన్‌స్పెక్టర్ మమ్మల్నందర్నీ హంతకులను చూసినట్లు చూశాడు.

"ఏంటి.. కుక్కని చంపుతున్నారా? కుక్కని చంపుతున్నారా, కుక్కను చంపుతున్నారా?" అంటూ రిపీట్ కొశ్చెన్ కొట్టాడు.

"అవును, అందులో పెద్ద రిపీట్

చేసేంత సీనెక్కడుంది? " అన్నాడు మా కల్చరల్ శెక్రటరీ శంకరమూర్తి.

"హలో మిస్టర్! మీరంతా రాతియుగం జనాల్లా ఉన్నారు! ముందా ట్రైబల్ మెంటల్ ఫ్రేమ్ నుంచి బయటకు రండి. జంతువులను వేటాడడం, చంపటం, తినటం- ఇవన్నీ గతానికి చెందినవి. ఇప్పుడలాంటి పనులు చేస్తే పర్మనెంటుగా బుక్కయిపోతారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అందరం షాకయ్యాం.

"ఏంటి.. ఆ పిచ్చికుక్కని చంపుతే జైల్లో వేస్తారా? "

"జైల్లో వేయటమే కాదు. మీ అందరి మెడలో- నేను నోరులేని అమాయక, సాధు జంతువులను చంపిన హంతకుడిని, క్రూరుడిని! నన్ను చూసి అసహ్యించుకోండి!- అన్న బోర్డులు తగిలించి హైద్రాబాద్‌లో అన్ని వీధుల్లో ఊరేగిస్తాం" అన్నాడు ఎస్.ఐ కాస్త ఓవర్‌గానే.

మాకు మతిపోయినట్లయింది.

"అలా ఊరేగించాలని కూడా మీ ఇండియన్ పీనల్‌కోడ్‌లో ఉందా? " అడిగాడు మొహిందర్.

"అలాంటివి అందులో ఉండవ్"

"మరెక్కడుంటయ్? "

"పి.పి.సి.లో ఉంటాయ్"

"పి.పి.సి. అంటే? "

"పోలీస్ పీనల్ కోడ్ అని మాకింకో రూల్ బుక్కుంది లే"

"అయితే ఏమంటావ్ నువ్వు? మా అపార్ట్‌మెంట్స్‌లో ఎనిమిది మందిని కరిచిన పిచ్చికుక్కని చంపకుండా ముద్దు పెట్టుకోమంటావా? " అడిగింది సీతా వరదరాజన్ ఇంగ్లీష్‌లో.

"అయినా ఆ కుక్కని పట్టుకుని నోరు లేని జంతువు అనడానికి నీకు నోరెలా వచ్చిందయ్యా! ఇప్పటివరకూ అది దాన్నోటితోనే ఎనిమిదిమందిని కండలు ఊడబీకింది"

"అయితే ఆ సంగతి మీరు మున్సిపల్ కార్పొరేషన్ వాళ్ళకు చెప్పాలిగానీ చట్టాన్ని మీ చేతుల్లోకి తీసుకోకూడదు"

"హలో! జిహెచ్ఎంసి వాళ్ళకు రెండేళ్ళ నుంచీ ఇంతవరకూ తొంభయ్ ఆరుసార్లు కంప్లెయింట్ చేశాం. మా వీధిలో, మా అపార్ట్‌మెంట్స్‌లో కుక్కల బెడద ఎక్కువయిందనీ, మా ఏరియాలో ఉదయం వాకింగ్‌వెళ్తున్న సీనియర్ సిటిజెన్స్ పదహారుమందిని అవి కరిచాయనీ, స్కూలు కెళ్ళే చిన్నపిల్లలను ముగ్గురినీ వీధి కుక్కల సమూహాలు కరిచాయనీ న్యూస్ పేపర్స్‌లో -లెటర్స్ టుది ఎడిటర్-కాలమ్‌కు కూడా రాశాం! అయినా ఇంతవరకూ ఒక్కనాకొడుకు కూడా పట్టించుకోలేదు" అరిచాడు జగన్.

దాంతో పోలీస్ అధికారికి కోపం వచ్చింది.

"చూడు మిస్టర్.. జిహెచ్ఎంసి అఫీషియల్స్‌ని 'నాకొడుకు' అంటూ వల్గర్ లాంగ్వేజ్ ఉపయోగించి తిడుతున్నందుకు నిన్ను నేను అరెస్ట్ చేయవచ్చు. ఎరుకనా? "

"మాలూమ్‌హై!" అన్నాడు మా ప్రెసిడెంట్ హమీద్‌మియా జోష్‌గా.

"హమ్‌కో సబ్‌కుచ్ మాలూమ్ హై! మేము అంగూఠా చాప్‌లు లేవ్.. హమ్ సబ్ ఎడ్యుకేటెడ్ ఉన్నయ్. అరెస్ట్ చేస్తయ్ అంటే చేసెయ్. ఈమాటే పదిసార్లంటాం" అని మావేపు తిరిగాడు.

"బోలోజీ - జిహెచ్ఎంసి"

"లఫంగ్‌హై.. చోర్‌హై" అంటూ అరిచాం అందరం.

"పోలీస్‌వాలే-"

"ఫ్రాడ్ హై"

"ఏ.పి. గవర్నమెంట్"

"నాలాయక్"



"ముఖ్యమంత్రీ.."
"సోతా హై"
"మంత్రివర్గం"
"లుటేరే హై"
ఎస్.ఐ కి కోపం ఆగలేదు.
"ఆపండి" అన్నాడు ఆవేశంగా.
"మేము ఆపం! ఇండియన్ డెమొక్రసీ కైసే హై? "
"బ్రోతల్ హౌస్ జైసే హై!"
"ఇంతమంది ఇన్ని తిట్లు తిట్టాం కదా? ఏదీ.. మా అందర్నీ అరెస్ట్ చెయ్" అన్నాడు బోస్.
ఎస్.ఐకు ఏం చేయాలో అర్థం కాలేదు. మమ్మల్నందర్నీ అరెస్ట్ చేసినా ఒక్క పైసా రాలదని అతనికి తెలుసు.
"ఇగో.. ఈ కిరికిరంతా ఎందుకురా భాయ్! మీరు ఆ కుక్కని చంపకండ్రి! జంతువులన్నిటిని సంరక్షించడానికి చట్టా లున్నాయ్"
"మాలూమ్ హై! మనిషి సంరక్షణకు ఏ చట్టం లేవ్! కానీ జంతువుల సంరక్షణకి చాలా చట్టం ఉన్నయ్- హైన? "

అతని కొశ్చెన్‌కి ఎస్.ఐ సమాధానం చెప్పలేదు.
సడన్‌గా తుగ్లక్ చానెల్ న్యూస్‌లో మేమంతా కనిపించేసరికి అందరం తుగ్లక్ చానెల్ కెమెరా చుట్టూ మూగాం.
మా అపార్ట్‌మెంట్స్‌ను చూడగానే న్యూస్ రిపోర్టర్ విజృంభించింది.
"జంటనగరాల్లో నిత్యం సాధు జంతువు లయిన కుక్కలు, పిల్లులు, కోతులను కిరాతక ప్రజలు చిత్రహింసలు పెట్టడం మనం దరం చూస్తూనే ఉన్నాం. ఎంతోమంది ఎడ్యుకేటెడ్ కూడా జంతువులపట్ల ప్రేమను ప్రదర్శించకుండా, వాటిని ఎన్నో హింసలకు గురిచేయటం మీ అభిమాన తుగ్లక్ చానెల్ ద్వారా మీరు చూశారు. ఇప్పుడు ఆ కిరాతకులతోనే మాట్లాడి వారి గురించి వివరాలందించడానికి మన తుగ్లక్ చానెల్ రిపోర్టర్ రాజు సిద్ధంగా ఉన్నాడు."
"రాజు ఇప్పుడక్కడ పరిస్థితేంటి? ఏం జరుగుతోంది? "
"వెంగమాంబా! ఈ అపార్ట్‌మెంట్స్ వాళ్ళందరూ కలసి రాక్షసుల్లా ప్రవర్తిస్తున్నారు. వాళ్ల చేతుల్లో ఉన్న అనేకరకాల ఆయుధాలు మనం చూస్తూనే ఉన్నాం. వీరంతా కలసి పాపం ఒక చిన్నారి కుక్కను దారుణంగా హత్య చేయాలని పథకం పన్నినట్లు పోలీసులు చెప్తున్నారు! ఒక నోరులేని మూగజీవాన్ని పోలీసులొచ్చినా కూడా హత్య చేయాలని వీళ్ళంతా ప్రయత్నించటం నిజంగా మానవత్వానికే పెను సవాల్ వెంగమాంబా.. ఈ నర రూప రాక్షసులతో మాట్లాడి వీళ్ళెందుకిలా హింసావాదులుగా మారారో మనం తెలుసుకుందాం వెంగమాంబా.."
"చెప్పండి సార్! మీ అపార్ట్‌మెంట్ వాళ్ళందరూ కలసి 'ప్రివెన్షన్ ఆఫ్ క్రూయెల్టీ టూవర్డ్స్ యానిమల్స్' అన్న చట్టం ఉన్నా కూడా ఒక దిక్కు దివాణం



లేని వీధి కుక్కని దారుణాతిదారుణంగా కొట్టి చంపాలని అనుకోవడానికి కారణం ఏమిటి? మీలో మానవత్వం మంటగలిసిందా? "

మా విజయ్‌యాదవ్‌కి కోపం ముంచుకొచ్చింది.

"నీయవ్వ- నువ్వేం పాగల్ గాడివా? నీ పెళ్ళాంబిడ్డల్ని పిచ్చికుక్క కరుస్తే- ఆళ్ళు చస్తే చావనీ అని, ఆ పిచ్చి కుక్కని వన్ జీరోఎయిట్‌లో వెటర్నరీ హాస్పిటల్‌కి తోల్కపోతావ్‌లే? "

"ఇంతవరకూ అది మా అపార్టుమెంట్స్‌లో ఎనిమిది మందిని కరిచిందిరా నంగా బాడుకవ్! మీ చానెలోళ్ళు, పోలీసోళ్ళు కలసి సమాజానికి కుక్కల బెడద లేకుండా చూడాలిగానీ.. మమ్మల్నే కొచ్చెన్ చేస్తున్నారు! ఇంత దేడ్ దమాక్‌గాళ్ళేరా మీరు? " అన్నాడు బోస్.

దాంతో రిపోర్టర్‌కి కోపం వచ్చింది.

"ఇగో సార్! మాటలు మంచిగా రానీండి! ప్రెస్సోళ్ళను ఏమైనా అంటే... అందరూ లోపటవుతారు!" అన్నాడు ఆవేశంగా.

"అంటే? ప్రెస్సోళ్ళు మనుషులు గాదేరా? ఆస్మాన్‌కెళ్ళి దిగొచ్చిన్రా!" అడిగాడు మొహిందర్.

దాంతో ఆ చానెల్ న్యూస్ రీడర్‌తో రిపోర్టర్ మాట్లాడాడు.

"వెంగమాంబా.. ఈ అపార్టుమెంట్ వాళ్ళు చేస్తున్న ఈ దారుణాన్ని మనం విజయవంతంగా అడ్డుకుంటున్నందుకు నామీదా, మన కెమెరా మీద ఎటాక్ చేస్తున్నారు. కెమెరా ధ్వంసం చేయడానికి కూడా వీళ్ళు పథక రచన చేసినట్లు తెలుస్తోంది వెంగమాంబా!"

"మరి అక్కడున్న పోలీసులు ఈ పరిస్థితిని ఎలా పరిష్కరించబోతున్నారు? ప్రజాస్వామ్యానికి అతి కీలకమయిన ప్రెస్ మీద అలా దాడి జరుగుతుంటే వాళ్ళు ప్రేక్షకపాత్ర వహిస్తున్నారా? "

ఈ గొడవంతా చూసి ఎస్.ఐ మా మధ్యకొచ్చి కెమెరాలో మంచి యాంగిల్లో కనబడే విధంగా నిలబడ్డాడు.

"ఇదిగో! చూడండి మిస్టర్! ఎవడుబడితే వాడు చట్టాన్ని చేతిలోకి తీసుకుంటూంటే చూస్తూ ఊరుకోడానికి మేమేం చేతకాని వాళ్ళం కాదు" అన్నాడు సీరియస్‌గా.

"మరి మనకు స్వాతంత్ర్యం వచ్చిన దగ్గర్నుంచీ మీరు చేస్తోందేమిటి? మీరు చూస్తూండగా మీ కళ్ళెదురుగ్గానే ఎన్ని బస్సులు, ఎన్ని రైళ్ళు, ఎన్ని దుకాణాలు, ఎన్ని ఇళ్లను అల్లరిమూకలు తగలబెట్ట లేదు? అప్పుడు చేసిందేమిటి? " అన్నాడు శంకరమూర్తి.

"ఇదిగో అనవసరమైన డైలాగులొద్దు! మర్యాదగా ఆ కుక్కని వదిలేసి మీ దారిన మీరు పోండి"

ఎస్ఐ మాటతో నాకు తిక్కరేగింది.

"మాట్లాడితే.. కుక్కను వదిలెయ్- కుక్కను ప్రేమించు- కుక్కను పూజించు- అంటున్నారుగానీ ఈ కుక్క కరచిన



# శ్రీ విఘ్నేశ్వరస్వామి వారి దేవస్థానం

అయినవిల్లి, అయినవిల్లి(మండలం)- 533 211, తూ॥గో॥ జిల్లా (ఆంధ్రప్రదేశ్)

STD: 08856 - Ph: 225812 , Visit : www.ainavillivighneswara.com

## స్థలపురాణము

పుణ్యక్షేత్ర సమీపంలోను. నదీతీరంలోను. సముద్రతీరంలోను, నదీసంగమ ప్రదేశంలోను, పర్వాతాగ్రం లోను, ఉద్యానవనములందును ఆలయ నిర్మాణం శ్రేష్ఠమని వాస్తుశాస్త్రం చెప్పింది.
పవిత్ర గోదావరీమాత హస్తముల మధ్య నమరిన కోనసీమలో అడుగడుగునా పై నుదహరించిన స్థలాలు గోచరిస్తాయి. అట్టి పవిత్రమైన కోనసీమలో **"అయినవిల్లి"**లో స్వయంభూవుగా నెలకొనియున్నది **"శ్రీ విఘ్నేశ్వరస్వామివారి దేవాలయము"** దక్షప్రజాపతి దక్షయజ్ఞం నిర్వర్తించేముందు విఘ్నవినాయకుడైన ఈ వినాయకుని పూజించి, పునీతుడైనట్లు క్షేత్ర పురాణం తెలుపుతోంది. వ్యాసమహర్షి దక్షిణ దేశయాత్ర ప్రారంభంలో పార్వతీ తనయుణ్ణి ప్రతిష్ఠించినాడని మరొక కథ వ్యాప్తిలో ఉన్నది. అతిపురాతనుడైన **"ఈసిద్ధి"** ప్రియుడు కోర్కెలన్నీ తీర్చే **"సిద్ధివినాయకుడుగా"** పేరుగాంచిన.

### శ్రీ స్వామివారి నిత్యాన్నదాన పథకంలో చేరండి, శ్రీ స్వామివారి కృపకు పాత్రులు కండి

అన్నం పరబ్రహ్మస్వరూపం. అన్ని దానములకన్నా అన్నదానం మిన్న. అన్నదానము వలన విష్ణులోకం ప్రాప్తించును.(ఇట్టి దానఫలములు దేవీభాగవతమందు చెప్పబడెను.) కావున భక్తులు ఈ సదవకాశమును వినియోగించుకుని తరించగోరుచున్నాము.

రూ.1116/-లు తక్కువ కాకుండా చెల్లించి అన్నదాన పథకములో చేరిన భక్తులు వారు కోరిన ప్రకారం సం॥లో ఒక రోజున వారి పేరున **అన్నదానం** జరుపబడును. ఆసక్తిగల భక్తులు అన్నదాన పథకంలో చేరి, శ్రీ స్వామివారి కృపకు పాత్రులు కాగలందులకు కోరుచున్నాము.

| | | | |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | రూ. 1,00,000/- | రాజపోషకులు | రూ. 50,000/- |
| పోషకులు | రూ. 10,000/- | దాతలు | రూ. 1,116/- |

**గమనిక:** శ్రీ స్వామివారి ఆలయంలో ప్రతీనిత్యము అన్నదానం జరుగుచున్నది.

### శ్రీ విఘ్నేశ్వరస్వామివారికి అయినవిల్లిలో జరుగు అభిషేకములు, వాటి రుసుములు:

ఏకాదశ రుద్రాభిషేకం రూ. 40/- (పూజాసామాగ్రి భక్తులు ఏర్పాటు చేసుకొనవలెను)

| | | | |
|---|---|---|---|
| మహాన్యాసాభిషేకం | రూ. 20/- | లఘున్యాసాభిషేకం | రూ. 10/- |
| అష్టోత్తర పూజ | రూ. 5/- | పుస్తకముల పూజ | రూ. 20/- |
| అన్నప్రాశన | రూ. 20/- | అక్షరాభ్యాసం | రూ. 20/- |
| వాహనపూజ సైకిల్ | రూ. 10/- | మోటారుసైకిల్, ఆటో | రూ. 15/- |

లారీ, బస్సు, చిన్నకారు, జీపు, వ్యాను, ట్రాక్టరు రూ. 20/-
50 కొబ్బరికాయలు మొక్కుబడి రుసుము రూ. 5/-

రూ. 25/-లు M.O. ద్వారా గాని, స్వయముగా గాని చెల్లించినచో మీరు కోరిన రోజున మీ గోత్రనామములతో లఘున్యాసాభిషేకం జరిపించి పోస్టులో ప్రసాదం పంపబడును.

**V.V.V.S.N.మూర్తి**
కార్యనిర్వహణాధికారి, సెల్: 94402 19241

**M.O. & Letters పంపే Address:**
**Executive Officer**
Sri Vighneswara Swamy Temple
Ainavilli(V. & M.) 533 211
E.G.Dt., (A.P.)

**డి.డి. తీయవలసిన చిరునామా:**
**Executive Officer**
Sri Vighneswara Swamy Temple
S.B.H., Ainavilli Branch, Code No.2607
E.G.Dt., (A.P.) పేరున డి.డి. తీయవలయును.

మావాళ్ళ సంగతేంటి? " అన్నాను.
"అది నాకనవసరం. దాన్ని గవర్న మెంటు చూసుకోవాలి"
"అయితే ఈ పిచ్చికుక్క సంగతి కూడా నీకనవసరం- నీదార్ని నువ్ పో. దేశం లోని పిచ్చికుక్కలన్నిటికీ మీ పోలీస్ డిపా ర్ట్‌మెంటే జవాబుదారీనా? " అంది షైనీ!
ఎస్ఐ సమాధానం చెప్పలేక తల పట్టు కున్నాడు.
"ఇదిగో చూడమ్మా! ఏ కుక్క ఎలా చస్తే మాకెందుకు? ఇంకే కుక్కనైనా చంపు కోండి.. పాతిపెట్టుకోండి! నేను కల్పించు కుంటే ఒట్టు. కానీ ఈ కుక్కను మాత్రం చంపడానికి వీల్లేదు."
"ఎందుకని? ఈ పిచ్చికుక్క మీద అంత ప్రేమేమిటి? దీన్ని మీ డిపార్ట్‌మెంట్ ఉంచుకుందా? " అడిగింది శ్రీలక్ష్మి.
"అబ్బా! ఈ కుక్కను మీరు చంపబోతు న్నారని మీ అపార్ట్‌మెంట్స్ నుంచే ఒకావిడ మాకు కంప్లైంట్ ఇచ్చిందమ్మా! అందుకే ఇక్కడికి అఘోరించాం!"
అందరం షాకయ్యాం.
"మా అపార్ట్‌మెంట్స్‌లో ఉండే లేడీ కంప్లెయింట్ ఇచ్చిందా? "
"అవును"
"ఎవరామె? "
"పేరు కీమారాణి. ఫ్లాట్ నెంబర్ సిక్స్ వన్ సిక్స్ - డి బ్లాక్- రామ్ భరోసా అపా ర్ట్‌మెంట్స్- ఇదీ అడ్రస్. అరగంట క్రితమే మా పోలీస్ కమిషనర్ గారికి ఫోన్ చేసింది. ఆయన మాకు ఫోన్ చేశాడు. అందుకని వచ్చాం! లేకపోతే నెత్తిన లక్షల కేసులు ఇన్వెస్టిగేషన్ చేయాల్సి ఉండగా- అవన్నీ ఆపి ఈ పిచ్చి కుక్కకోసం ఎందు కొస్తాం? "
అప్పుడర్థమయింది మాకు. కీమారాణి మా అపార్ట్‌మెంట్స్‌వాళ్లందరికీ తెలుసు! ఆమెకి చిన్నప్పటి నుంచీ కుక్కలంటే ఇష్టం!
శోభనంనాడు కూడా ఆమెకీ భర్తకీ మధ్యలో మూడు వీధి కుక్కలు పడుకోవ డంతో మొగుడు బాల్కనీలోనించి దూకి పారిపోయాడు. ఇంతవరకూ తిరిగి రాలేదు.
అప్పటినుంచీ ఆమె పూర్తిగా కుక్కల సేవలో జీవితం గడుపుతోంది. ఆమె వల్లే మా అపార్ట్‌మెంట్స్ మొత్తం కుక్కల మయం అయిపోతోందని అందరూ గొడవ చేయటం- మా అపార్ట్‌మెంట్స్ కమిటీ వాళ్లూ మీటింగ్‌లు కండక్ట్ చేసి ఆమెకు వార్నింగివ్వాలని ప్రయత్నించటం జరి గింది. అయితే ఆమె మమ్మల్నెవ్వరినీ లెక్క చేయలేదు.
మా అపార్ట్‌మెంట్స్‌లో ఉండే వాళ్లందరి మీద వేలసార్లు పోలీస్ కంప్లెయింట్ ఇచ్చింది. ఆమె మెంటల్ అన్న విషయం తెలుసుకున్న పోలీసులు ఆ కంప్లెయింట్స్ పట్టించుకోవటం మానేశారు. అయితే పోలీస్ కమీషనర్లు మారిపోతూంటారు గనుక అప్పుడప్పుడూ ఆమె పిచ్చికి మేమం తా ఇలా పిచ్చి కుక్కలపాలుగాక తప్పదు.
"ఇప్పుడేం చేద్దాం? " అడిగాడు శంకర మూర్తి.
"చేసేదేముంది? మనం అరెస్టయినా, లాఠీ దెబ్బలు తిన్నా ఓకే గానీ ఈ కుక్కని మాత్రం వదలటానికి లేదు. దీన్ని వదిలేస్తే ఇది ఇంకా చాలామందిని కరుస్తుంది- అందులో కొంతమంది చచ్చినా ఛస్తారు" అన్నాడు జగన్.
ఎస్.ఐ రాజీ కొచ్చాడు. "సరే- మనలో మనకి గొడవెందుగ్గానీ- మీరంతా వెళ్లి ఆ కీమారాణిని బ్రతిమాలి ఆమె ఇచ్చిన కంప్లె యింట్‌ను విత్‌డ్రా చేసుకోమనండి. అప్పుడు మీరీ పిచ్చికుక్కని ఏం చేసుకున్నా నాకు అబ్జెక్షన్ లేదు" అన్నాడు.

*(మిగతాది వచ్చే సంచికలో..)*

# ISO 9001:2000

**CVI CERTIFIED COMPANY**




**HANDS FREE PACKED**
**ORIGINAL SATAKE SORTEXED RICE**

# ఆవు దూడ

## బ్రాండ్ బియ్యం

**అన్ని రైస్ షాపులలోను, సూపర్ బజార్లలోను**
**25, 10, 5 కేజీల పేకింగ్‌లో లభించును.**

**SEE FOR ORIGINAL PRINTED STRIP**

క్వాలిటీ సీలు చూసి కొనండి

## శ్రీ రామలింగేశ్వర మోడరన్ రైసమిల్లు

మేనేజింగ్ పార్టనర్ : **సత్తి కృష్ణారెడ్డి**, M.Com., B.L.,

Penuguduru, Kakinada - 533016 0884-2374172, 2384172 email-srlmr_kkd@sify.com

**ఆరోగ్యానికి, ఆనందానికి ఆవు-దూడ బియ్యం**

# ఓ వర్షం కురిసిన రాత్రి

చెన్నై నుంచి జర్మనీకి బయలుదేరిన హరిహరన్ ముంబయిలో మరణించాడన్న వార్త కుటుంబసభ్యుల్ని అశనిపాతంలా తాకింది. నిండుగర్భిణి అయిన అతని భార్య గీతాంబరికి నిజం చెప్పకుండా జాగ్రత్తపడ్డారు. కానీ ఆమె పదేపదే తనభర్త నుంచి ఫోన్‌రాలేదని ఆందోళనపడుతూ అందరినీ టెన్షన్‌కు గురిచేసింది. శవంకోసం ముంబయి వెళ్లిన హరిహరన్ తమ్ముడు, బావమరది ఎదుర్కొన్న అనుభవాలేంటి? గీతాంబరికి నిజం తెలిసిపోయిందా?

ఆద్యంతం ఉత్కంఠ నింపే రాజేష్‌కుమార్ తమిళ నవలకు జిల్లేళ్ళ బాలాజీ అనువాదం ఓ వర్షం కురిసిన రాత్రి ఈనెల చతుర కానుక!

అరేబియా సముద్రంలో సుమారు ఐదువందల కిలోమీటర్ల దూరంలో తిష్ట వేసుక్కూర్చున్న తుపాను ముంబయిని భయపెడుతోంది. ఆకాశం నిండా మేఘాలు కమ్ముకొని ఏ క్షణాన్నైనా విరుచుకుపడేందుకు సిద్ధంగా ఉన్నాయి.

అది ఆగస్టు నెలలో ఓ ఆదివారం. సమయం సాయంకాలం ఐదు కావొస్తోంది. ముంబయిలోని అన్ని దిక్కులా చీకటి కమ్ముకోసాగింది. గాలిలో మెల్లమెల్లగా ఊటీ చల్లదనం...

విలేపార్లే రైల్వేస్టేషన్ నుండి బయటికొచ్చింది నిషా. ఐశ్వర్యారాయ్‌లోని యాభై శాతం రూపురేఖలతో తేనెరంగు కళ్లకు యజమానురాలు ఇరవై మూడేళ్ల నిషా. ఏ కోణం నుండి ఎలా చూసినా అందంగా కనిపించేలా ఉంది. పసుపు చుక్కలు కలిగిన ఎరుపురంగు మాక్సీలో కచ్చితంగా ఇమిడిపోయింది. వర్షం రాకను గమనించి చేతిలో ఒక సింథటిక్ క్లాత్ గొడుగును తెచ్చుకుంది. ఎడమ భుజానికి వ్యానిటీ బ్యాగ్ వేలాడుతోంది.

నిషా స్టేషన్ బయటికొచ్చింది. ఆదివారం కారణంగా నిర్మానుష్యంగా ఉన్న ఫుట్‌పాత్ మీద రెండు నిమిషాల నడక అనంతరం నర సంచారంలేని 'పార్క్-వ్యూ' రోడ్డుమీది కొచ్చింది.

దూరదూరంగా కట్టబడిన బంగళాల మధ్య నిశ్శబ్దం రాజ్యమేలుతోంది.

నిషా తన చేతికున్న వాచ్‌లోకి చూస్తూ వేగంగా అడుగులు వేయసాగింది.

పది నిమిషాల నడక.

రహదారి మలుపులో ఎన్నో రకాల చెట్ల మధ్య తిష్టవేసుకున్న ఆ బంగళా ముందు కొచ్చి నిలబడింది. కాంపౌండ్ గేట్ దగ్గరకు వేసి ఉంది.

గేటును మెల్లగా తొయ్యటంతో అది కీచుమంటూ శబ్దం చేసుకుంటూ వెనక్కెళ్లింది.

నిషా జంకుతూ లోపలికి అడుగుపెట్టింది. గేటునుండి యాభై మీటర్ల దూరంలో ఉన్న ఆ బంగళా కాస్త పాతబడ్డట్టు కనిపించింది. కిటికీలకు చతురస్రాకారంలో, రంగురంగుల అద్దాలు ఉన్నాయి. పోర్టికోలో ఆస్టిన్ కారు ఒకటి కాన్వాస్ పరదా కింద దాక్కుని ఉంది.

గుమ్మం ముందుకు నడిచింది నిషా. సరిగ్గా పట్టించుకోని కారణంగా ఏవేవో పిచ్చి మొక్కలు మొలిచి ఉన్నాయి అక్కడ. నీటి తొట్టికి మధ్య నిలబెట్టి ఉన్న శిల్పం చేతులు రెండూ విరిగిపోయి ఉన్నాయి. పోర్టికో స్తంభం పక్కనున్న రోజా పూల తొట్టెలు శిథిలమై కనిపించాయి.

నిషాలో ఆశ్చర్యం తొంగి చూసింది.

'ఒక న్యూరో సర్జన్ తన ఇంటిని ఇలాగేనా ఉంచుకోవడం? ఇంటర్వ్యూ మొదలెట్టేముందే దీని గురించి మాట్లాడాలి!'

నిషా ఆస్టిన్ కారును చుట్టుకుని పోర్టికో మెట్లెక్కి తలుపుకు ఎడమవైపున్న కాలింగ్ బెల్‌ను మ్రోగించింది.

లోపల సంగీతం వినిపించింది.

అరక్షణం తర్వాత తలుపు తెరుచుకుంది.

అక్కడ ఒక యువతి నిలబడి ఉంది. ముప్పై ఏళ్లుండొచ్చు. ఎత్తుగా కొప్పు వేసుకుని ఉంది. చీరపైన కాఫీపొడి రంగు గౌను తొడుక్కుంది. చేతికి తెల్లగా ఏదో పౌడర్‌లాంటిది అంటుకొని ఉంది.

"ఎవరు కావాలి....? " అడిగింది.

"డాక్టర్ చతుర్వేది..."

"మీరూ..? "

"నా పేరు నిషా... ఫ్రీలాన్స్ రిపోర్టర్‌ని. డాక్టర్ చతుర్వేది ఇంటర్వ్యూ కోసం వచ్చాను. పదిరోజుల ముందే అపాయింట్‌మెంట్ తీసుకున్నాను. ఇవ్వాళ ఆదివారం ఐదుగంటలకు రమ్మని చెప్పారు"

"డాక్టర్ ఎవరికీ ఇంటర్వ్యూ ఇవ్వరే? "

"నాకు ఇస్తానని చెప్పారు."

"లోపలికి వచ్చి కూర్చోండి... నేను డాక్టర్ని అడిగొచ్చి చెబుతాను"

నిషా లోపలికి అడుగుపెట్టింది. ఆమెకు సోఫా చూపి, పక్క గదిలోకి వెళ్ళి మాయమైపోయింది ఆ యువతి.

బంగళాలో వెంటనే స్మశాన నిశ్శబ్దం అలముకుంది. నిషా చుట్టుపక్కల పరిశీలనగా చూసింది. ఆ డ్రాయింగ్ రూమును సగానికి పైగా ఆక్రమించుకున్న ఒక అద్దాల బీరువా కనిపించింది. దానిలోపల కేలికో బైండ్ చేసిన పెద్ద పెద్ద బౌండ్ పుస్తకాలు దర్శనమిచ్చాయి. వాటిమీద మగ్గిపోయిన పసిడి వర్ణ అక్షరాలున్నాయి. వాటిని తన తీక్షణమైన చూపులతో చదివింది నిషా.. డెనిస్ ఇ. ఓమాన్ రాసిన ఎక్స్‌పెరిమెంట్స్ ఇన్ జీన్ మానిప్యులేషన్, జీన్స్ వి. లీవిస్ పుస్తకం జెనిటిక్ ఇంజినీరింగ్ ఇలాంటివే.

పక్కనున్న గోడమీద యువకుడిగా ఉన్న చతుర్వేది ఫోటో కనిపించింది. చక్కటి తలకట్టుతో కాన్వొకేషన్ దుస్తుల్లో నవ్వుతున్నారు. పక్కనే కొన్ని విదేశీ విశ్వవిద్యాలయాలు ఆయనకు డాక్టరేట్ పట్టాలిస్తున్న ఫోటోలు వేలాడుతున్నాయి.

ఇంతలో...

ఎవరిదో అడుగుల శబ్దం...

నిటారుగా కూర్చుంది నిషా.

ఎడమ పక్కనున్న గది తలుపు తెరుచుకుని డా॥ చతుర్వేది బయటికొచ్చారు.

అబ్బురపరిచే ఎత్తు... యాభై ఐదేళ్ల దేహదారుఢ్యం... ముందరి తల ఆకు రాలే కాలాన్ని సూచిస్తోంది. కాస్త మురికి పట్టిన తెల్లటి జుబ్బా పైజామా ధరించిన చతుర్వేది- చేతిలో పైప్ పట్టుకొని ఉన్నాడు.

"గుడ్ ఈవినింగ్ డాక్టర్..." చిరునవ్వుతో నిషా లేచి నిలబడింది.

చతుర్వేది తన ముఖంలో ఏ మార్పు కనిపించనీయకుండా "ఏంటీ? " అన్నాడు.

"ఇంటర్వ్యూ...? "

"రమ్మని చెప్పానా? "

"ఔను డాక్టర్"

"ఎప్పుడు చెప్పాను? "

"పదిరోజుల క్రితం 'కళ్యాణ్ ఆజాద్ హాల్లో' జరిగిన ఒక సెమినార్‌కు మీరొచ్చారు. అది పూర్తయ్యాక మీరు కార్లో ఎక్కుతున్నప్పుడు మీ ఇంటర్వ్యూ కోసం అపాయింట్‌మెంట్ అడిగాను. మీరు ఇరవయ్యో తేదీ సాయంకాలం ఐదింటికి బంగళాకు రమ్మన్నారు. ఈ రోజు ఇరవై..."

చతుర్వేది నోట్లో పైప్ పెట్టుకొని ఆదుర్దాగా ఒకసారి పీల్చి పొగ వదిలాడు.

"మరిచిపోయాను..."

"సారీ డాక్టర్. నేను మళ్ళీ ఫోన్‌చేసి ఇంటర్వ్యూ గురించి గుర్తుచేయాల్సింది"

"ఎస్... ఎస్...! ఇంటర్వ్యూను ఇంకో రోజు పెట్టుకుందామా? "

అప్పుడు గమనించింది నిషా. డాక్టర్ ఏదో ఆదుర్దాలో ఉన్నట్టున్నారు. ఆయన నుదురంతా చెమట అలముకుని ఉంది. పైప్‌ను పట్టుకున్న కుడిచేతివేళ్ళు సన్నగా వణుకుతున్నాయి.

"సరే డాక్టర్, మీ ఇష్టప్రకారమే ఇంటర్వ్యూను ఇంకో రోజు పెట్టుకుందాం" అని చెప్పాలనుకుని నోరు తెరవడానికి ప్రయత్నించిన నిషా దృష్టి అప్రయత్నంగా చతుర్వేది జుబ్బా జేబు మీదకి మళ్లింది.

చతుర్వేది జుబ్బా జేబు చుట్టూ నాలుగైదు ఈగలు ముసురుతున్నాయి... కొన్ని జేబు లోపలికెళ్ళి వస్తున్నాయి.

★ ★ ★

చెన్నై.

బీసెంట్ నగర్‌లోని ఐదో మెయిన్ రోడ్ చివరన ఉన్న ఒక పెద్ద బంగళాలోని పడక గది. హరిహరన్ తన అర్ధాంగి గీతాంబరి గర్భాన్ని మృదువుగా ముద్దాడాడు.

"రేయ్! నేను నాన్నను... వెళ్లొస్తా..."

గీతాంబరి బుంగమూతి పెట్టి భర్త

ముఖాన్ని దూరంగా నెట్టింది.

"మీరేమీ వాడ్ని బుజ్జగించక్కర్లేదు"

"ఎందుకట? "

"మీరు మా ఇద్దరినీ వదిలిపెట్టి ఇంకో రెండు గంటల్లో జర్మనీ వెళ్తున్నారుగా..."

"పది రోజులేగా? ఫ్రాంక్‌ఫర్ట్ వెళ్ళి బిజినెస్ చూసుకుని పరుగెత్తుకొచ్చేయనూ. డెలివరీ డేట్ ఇంకా ఇరవై రోజులుందిగా"

"మీకు పది రోజులు, అది నాకు పది యుగాలు.. భార్య కడుపుతో ఉన్న ఇలాంటి సమయంలో ఏ భర్తా బిజినెస్సే ముఖ్యమని విదేశాలకు బయలుదేరడు..."

హరిహరన్ నవ్వాడు.

"పిచ్చిదాన్లా మాట్లాడకు గీతాంబరీ. ఇదెంత ఇంపార్టెంటో నీకు తెలుసా? "

"ఏం, మీ తమ్ముడు వెళ్ళకూడదేంటీ? "

"వాడికి ఇంగ్లీష్ ఫ్లూయెన్సీ తక్కువ. బిజినెస్ చెడగొట్టాడంటే...లక్షల్లో నష్టం.."

"ఏం చెప్పినా దానికో కారణాన్ని తయారుగా ఉంచుకొంటారుగా? "

"ఇదిగో చూడు గీతా! మా అమ్మా నాన్న నీ మీద ప్రాణాలే పెట్టుకున్నారు. ఈ ఊళ్ళోనే మీ అమ్మా, అన్నయ్యా ఉన్నారు. నేను ఊళ్ళోలేని లోటును తెలియనీయకుండా వాళ్ళందరూ నిన్ను ఎంతో బాగా చూసుకుంటారు..."

గీతాంబరీ తన భర్త రెండు అరచేతుల్నీ పట్టుకుని తన చెక్కిళ్ళపై ఆనించుకుంది. కళ్ళల్లోంచి రెండు కన్నీటి బొట్లు రాలాయి.

"మీ నాన్న, అమ్మ, మా అమ్మ, మా అన్న ఎంతమంది నా పక్కనున్నా, మీరు పక్కన కూర్చుని కబుర్లు చెప్పేదాంతో సమానమవుతుందా? "

"సరే సరే! బయలుదేరే సమయంలో ఏడ్చి హంగామా చేసెయ్యకు. నాకదోలా అయిపోతుంది"

"నిజంగా పది రోజుల్లో వచ్చేస్తారుగా? "

"ఊఁ..."

"రోజూ నాతో ఫోన్లో మాట్లాడాలి..."

"మాట్లాడకుండా ఉంటానా? "

"ఒక ముద్దివ్వండి..."

"ప్చ్!"

"మీ కొడుక్కి? "

"వాడికి లేని ముద్దులా? "

గీతాంబరి కడుపు మీద హరిహరన్ తడి తడి ముద్దులు పెడుతున్న క్షణాన.. టక్... టక్... టక్... మంటూ తలుపు చప్పుడు.. హరిహరన్ లేచి వెళ్ళి తలుపు తీశాడు.

బయట- అతడి తండ్రి మాసిలామణి, తల్లి తిలకం నవ్వు ముఖాలతో ఉన్నారు.

"ఎయిర్‌పోర్టుకు టైమయింది హరీ..."

"ఇదిగో బయలుదేరుతున్నాను నాన్నా.."

"లగేజ్ కార్లోకి వెళ్ళిపోయింది... రమణి నిన్ను డ్రాప్ చేయడానికి రెడీగా ఉన్నాడు. ఏమ్మా గీతాంబరీ... ఏడ్చావా? "

"లేదు మావయ్యా..."

"అబద్ధమాడకు... కళ్ళ కాటుక అంతా ఎలా కరిగిపోయిందో చూడూ... హరిని సంతోషంగా పంపించమ్మా... మరో పది రోజుల్లో వచ్చేస్తాడుగా..."

"హరీ... ఫ్లైట్ ఎన్ని గంటలకు బొంబాయి చేరుకుంటుంది? "

"తొమ్మిదింటిలోపు వెళ్ళిపోతుంది..."

"బొంబాయికి వెళ్ళి హోటల్లో రూమ్ తీసుకున్నాక ఇంటికి ఫోన్ చెయ్..."

"ఇవన్నీ నువ్వు చెప్పాల్సిన పనిలేదమ్మా. నీ కోడలు నిన్న రాత్రి నుండే ఇవన్నీ చెప్పీ చెప్పీ, తల బొప్పికట్టించేసిందనుకో"

ఆ మాటకు అందరూ నవ్వారు.

హరిహరన్ తల్లిదండ్రుల పాదాలకు నమస్కరించి గీతాంబరిని చూసి నవ్వుతూ, పోర్టికోలోని టాటా సియారాకేసి నడిచాడు.

★ ★ ★

సమయం రాత్రి పదిన్నర.. ముంబయి నుండి హరిహరన్ ఫోన్‌కోసం అందరూ

ఎదురు చూస్తున్నారు.

మాసిలామణి అన్నాడు, "ఫ్లైట్ తొమ్మిదికల్లా ముంబయి చేరి ఉంటుంది. ఇప్పుడు గంట పదిన్నర కావస్తోంది. వీడెందుకింకా ఫోన్ చేయలేదు? "

"ఫ్లైట్ లేటుగా వెళ్ళుంటే..? " తిలకం సంశయాన్ని వెలిబుచ్చింది.

"చెన్నై ఏర్‌పోర్ట్‌కు ఫోన్‌చేసి కనుక్కుందామా? " రమణి అన్నాడు.

"ముందు ఆ పనిచెయ్ రమణీ..." గీతాంబరి అంటుండగానే... టీపాయ్ మీదున్న టెలిఫోన్ గణగణమంటూ మోగింది.

"ఇది అన్నయ్యే..." రమణి వేగంగా రిసీవర్ని అందుకొని "హల్లో" అన్నాడు.

"హలో... కాల్ ఫ్రమ్ ముంబై... మిస్టర్ హరిహరన్ ఇల్లే కదూ? "

"అవును"

"హోటల్ 'సిల్వర్ శాండ్' రిసెప్షన్ నుండి మాట్లాడుతున్నాం. మీరు హరిహరన్‌కు ఏమవుతారు? "

"ఆయన తమ్ముణ్ణి. ఏంటి విషయం? "

"క్షమించాలి... ఒక దుర్వార్త...? "

"ఏంటది? "

"మా హోటల్లో గది తీసుకుని బస చేసిన మీ బ్రదర్, అరగంట క్రితం హోటల్ ముందున్న రోడ్‌ను క్రాస్ చేస్తుండగా లారీ గుద్దేసింది. స్పాట్‌లోనే చనిపోయారు...మీరు వెంటనే రాగలరా? "

టెలిఫోన్ రిసీవర్ పట్టుకున్న రమణి చెయ్యి వణికింది.

మనసులో అగ్ని పర్వతం బద్దలవుతున్నా, బయటకు కనిపించనీయకుండా, వదినకు విషయం తెలియకూడదన్న కంగారులో, పెదవిపై చిరునవ్వులు పులుముకుని ఫోన్‌లో మాటలు కొనసాగించాడు రమణి.

"సమాచారం ఇచ్చినందుకు థేంక్స్"

"ఎప్పుడొస్తున్నారు? "

"వెంటనే..."

"ఆలస్యం చెయ్యకండి. తర్వాతి విమానంలో బయలుదేరి వచ్చేయండి..."

"అలాగే..."

రమణి రిసీవర్ పెట్టగానే మాసిలామణి "ముంబయి నుండే కదూ? " అడిగాడు.

"ఆఁ... అవును..."

"హరిహరన్ మాట్లాడనట్టుందే...? "

"లే... లేదు..."

"మాట్లాడిందెవరు? "

"బాంబే సిల్వర్ శాండ్ హోటల్ నుండి మాట్లాడారు. అన్నయ్య అక్కడే బస చేశారట. గంటసేపటి నుండి ఇంటికి ఫోన్ చెయ్యటానికి ట్రై చేశారట. లైన్ దొరకలేదట. ఇంతలో ఎవరో ఒక స్నేహితుడు

**కొత్తగాలి...**

**అమ్మతోడ పుట్టలేదు**
**నాకు పిల్లనూ ఇవ్వలేదు**
**కానీ, మామగా సెటిలైపోయాడు**
**చుప్పనాతి చందమామ**

– తూలుగు రమణారావు,
అక్కరాపల్లి, శ్రీకాకుళం జిల్లా

రావటంతో అతనితో బయటకు వెళ్ళిపోయారట. వెళుతూ రిసెప్షన్‌లో మనింటి ఫోన్ నెంబర్ ఇచ్చి లైన్ దొరకగానే తను చేరినట్టు సమాచారం ఇవ్వమని చెప్పారుట. అందుకే వాళ్ళు ఫోన్ చేశారు"

గీతాంబరి కోపంతో నిష్ఠూరంగా అంది.

"ఆయనకు ఫ్రెండ్స్ కనబడితే చాలు, ఇంట్లో ఉన్న అందర్నీ మరచిపోతారు. లైన్ దొరక్కపోతే ఏంటట, కాసేపాగి ఫోన్ చెయ్యకూడదేంటీ..? "

"హరి మళ్ళీ ఫోన్ చేస్తానని చెప్పాడటనా? " తిలకం అడిగింది.

రమణి ఏం మాట్లాడాలో తెలియక తిక మక పడ్డాడు.

"ఏంట్రా మాట్లాడవ్? "

"అదీ.. బయటికెళ్ళిన అన్నయ్య తిరిగొచ్చే సరికి లేట్ నైట్ అయిపోతుందట. రేపు ఉదయం ఎనిమిది గంటలకు ఫోన్ చేస్తానని చెప్పాడట."

"చూశారా అత్తయ్యా మీ కొడుకుని..."

"కోపగించుకోకమ్మా.. హరి క్షేమంగా ముంబయి చేరిన సమాచారం అందింది. ఇప్పటికిది చాలు.. ఉదయం వాడు ఫోన్ చేసి మాట్లాడినప్పుడు గొడవ పెట్టుకో"

"రేపు ఆయన ఫోన్ చేస్తే నేను మాట్లాడను. మీరే మాట్లాడండి" అంటూ కోపంగా నడుముపై చేతులుంచుకొని మెల్లగా లేచిందామె.

"ఎప్పుడూ బిజినెస్సే... ఊళ్ళో ఉన్నప్పుడు పెళ్ళాంతో రెండు మాటలు మాట్లాడాలంటే డైరీలో టైమ్‌ను నోట్ చేసుకొని వుంటారు. ఇప్పుడు విదేశాలకు ప్రయాణం మరి! ఇక పెళ్ళాం గుర్తుకొస్తుందా? "

మాసిలామణి అడ్డుపడ్డాడు, "మనసు బాధ పెట్టుకోకమ్మా.. హరికి కాస్త డ్యూటీ కాన్షియస్ ఎక్కువ. ఎవరైనా ముఖ్యమైన వ్యక్తులు వచ్చుంటారు. అందుకే బయటకు వెళ్లుంటాడు. రేపు ఫోన్ చెయ్యగానే సంతోషంగా మాట్లాడమ్మా.. నీ మీద వాడికి ఎంత అభిమానమో తెలుసా? "

"అది ఇప్పుడు తెలిసిపోయిందిగా మావయ్యా! మీ కొడుకుని మీరే మెచ్చుకోవాలి... రేపు ఉదయం ఆయన ఫోన్ చేస్తే నేను మాట్లాడను.. రేపు మాత్రమే కాదు.. ఆయన ఫ్రాంక్‌ఫర్ట్‌కు వెళ్ళి అక్కడ నుండి ఫోన్ చేసినా నేను మాట్లాడను"

తిలకం నవ్వింది.

"చూద్దామా.. రేపు ఉదయం ఎనిమిది గంటలకు టెలిఫోన్ మోగగానే కడుపులో బిడ్డ ఉన్నాడన్న విషయాన్ని కూడా మరచి పోయి... పరుగెత్తుకొచ్చి రిసీవర్‌ను తీసి మాట్లాడవూ నువ్వు"

"మాట్లాడను అత్తయ్యా"

"హరి గొంతు వినకుండా నీకు అన్నపానీయాలు సహిస్తాయా? వెళ్ళి పడుకోమ్మా.. రేపు ఉదయం మాట్లాడుకుందాం" గీతాంబరి మెల్లగా హాలు చివరనున్న తన గది కేసి నడిచింది.

ఆమె గదిలోకి వెళ్ళేంతవరకూ చూస్తూ నిలబడ్డ తిలకం భర్తకేసి తిరిగి అంది, "మీలాగానే మీ పిల్లలూనూ..! బిజినెస్ విషయంలో బయటి ఊళ్ళకు వెళితే చాలు, ఇంట్లో పెళ్ళాం అంటూ ఒకటుందని గుర్తుకే రాదు.. హరి రేపు ఉదయం ఫోన్ చెయ్యనీ.. వాణ్ణి ఒక పట్టు పడతాను"

రమణి పగిలిన హృదయంతో అన్నాడు: "అ... అ... అమ్మా...!"

"నువ్వేంట్రా? అన్నకు వకాల్తా పుచ్చుకుంటావా? ఏం? " అని అడుగుతూ రమణి ముఖాన్ని చూసి అదిరిపడింది తిలకం.

రమణి ముఖం నల్లబడిపోయి ఉంది. కళ్ళల్లో నుండి నీళ్ళు. ముక్కుపుటాలు, పెదాలు అదురుతున్నాయి.

"ఒరేయ్... ఒరేయ్... రమణీ... ఏమైందిరా నీకు, ఎందుకేడుస్తున్నావ్ రా? "

"అ... అమ్మా..."

"చెప్పరా..."

గొంతు తగ్గించాడు రమణి.

"అమ్మా.. ఇప్పుడు నేను చెప్పే విషయాన్ని విని ఏడ్చి ఆర్భాటం చేసెయ్యకు! నాన్నా, మీరు కూడా! వదినకు ఈ విషయం ఇప్పుడే తెలియకూడదు, అంతే!"

"ఒరేయ్ ఒరేయ్ రమణీ! భయంగా ఉందిరా. ఏం చెప్పబోతున్నావ్ రా? "

"ఆ... ఆ గదిలోకి వెళదాం రండి"

రమణి లేచి హాలుకు ఎడమవైపు చివర నున్న గదికేసి వెళ్ళాడు. కడుపులో నిప్పు లుంచుకున్నట్టు మాసిలామణి, తిలకం అత

డిని అనుసరించారు.

★ ★ ★

డాక్టర్ చతుర్వేది జుబ్బా జేబు వైపు మళ్ళీ తీక్షణంగా చూసింది నిషా.

ఈగలు అక్కడే తిరగాడుతున్నాయి.

'ఆయన జేబులో ఏముందీ? .. ఎందుకు తడబడుతున్నారు? ' నిషా మనసులో ఎన్నో అనుమానాలు కమ్ముకుంటుండగా మళ్ళీ డాక్టర్ చతుర్వేదిని చూసింది.

ఆయన ఆమెతో అన్నాడు, "ఇంటర్వ్యూ ఇవ్వాళ వద్దు..."

"ఎప్పుడు రమ్మంటారు డాక్టర్? "

"నీ ఫోన్ నెంబర్ ఇచ్చిపో, నేను నీకు ఫోన్ చేసి తేది, సమయమూ చెబుతాను"

"నాకు ఫోన్ లేదు డాక్టర్... అంతేకాకుండా వచ్చేవారం చెన్నై వెళుతున్నాను. మళ్ళీ ముంబాయి రావటానికి పది రోజులు పడుతుంది. ఇవ్వాళే ఓ అరగంట నాకోసం కేటాయిస్తే చాలు. ముఖ్యమైన కొన్ని ప్రశ్నలడిగి నా ఇంటర్వ్యూను ముగించేస్తాను"

"ఇవ్వాళ కుదరదు. బిజీగా ఉన్నాను..." చతుర్వేది నుదుటి ఎడమ పక్క నరం మెల్లగా కదలటం కనిపించింది నిషాకు.

"డాక్టర్, నేను ఇతర రిపోర్టర్లలాంటి దాన్ని కాను. ఇంతవరకూ నేను ఇంటర్వ్యూ కోసం అంటూ ఏ రాజకీయ నాయకుణ్ణీ, ఏ సినీ నటినీ వెదుక్కుంటూ వెళ్ళింది లేదు. విజ్ఞాన, వైద్యరంగాల్లో నిష్ణాతులను మాత్రం వెదుక్కుంటూ వెళ్ళి వాళ్ళ ఇంటర్వ్యూలు తీసుకున్నాను. నా ఇంటర్వ్యూలు, వ్యాసాలు ముంబయి, ఢిల్లీ నుండి వెలువడే పెద్ద పెద్ద పత్రికలలో ప్రచురితమయ్యాయి. వాటి కాపీలు మీరు చూస్తానంటే... చూపిస్తాను..."

"అవన్నీ వద్దు..."

"నరాల నిపుణులైన మీరు ఆ మెడికల్ సెమినార్‌లో ప్రసంగిస్తూ... మనిషి మెదడు సామర్థ్యాన్ని భవిష్యత్తులో పెంచేలా చేయడం అవసరమని చెప్పి, దానికి సంబంధించిన ఒక 'రీసెర్చ్' చేస్తున్నట్టు చెప్పారు... మీరలా చెప్పటం నా మనసులో నాటుకు పోయింది... మీరిప్పుడు చేస్తున్న రీసెర్చ్‌కు సంబంధించిన లిటరేచర్ ఏమిటో చెబితే అంతే చాలు..."

"చెప్పానుగా.. ఇవ్వాల్టికి ఇంటర్వ్యూ గింటర్వ్యూ ఏదీ వద్దు... నువ్వు చెన్నై వెళ్ళొచ్చాక ఫోన్ చెయ్. డేట్ చెబుతాను."

"డాక్టర్"

ఇంతలో లోపల టెలిఫోన్ మ్రోగింది.

చతుర్వేదిలో కాస్త ఆందోళన ఎక్కువై "యు మే గో" అని చెప్పి టెలిఫోన్ తీయడానికి లోపలకి వెళ్ళాడు.

నిషా చూపులు ఆయన జుబ్బా జేబు మీదకు మళ్ళి అక్కడ గిరికీలు కొడుతున్న ఈగలపై పడింది.

'డాక్టర్ ముఖంలో ఏదో తప్పు చేశానన్న భావం ఉంది... అదేమై ఉంటుంది? దాన్ని తెలుసుకోకుండా ఇక్కడ నుండి వెళ్ళకూడదు'

నిషా కళ్ళు తిప్పి అటు ఇటు చూసింది. దృష్టికి ఎవరూ ఆనలేదు. లోపల డాక్టర్ టెలిఫోన్లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. నిషా మెల్లగా పక్కకు కదిలి అక్కడ మూసి ఉన్న తలుపును నెట్టి చూసింది.

తలుపు శబ్దం కాకుండా తెరుచుకుంది.

నిశ్శబ్దంగా ... చీకటిగా ఉన్న గది...

రెండు పెద్ద పెద్ద చెక్క బీరువాలు గోడవారగా కనిపించాయి. గదిలో ఎవరూ లేరని నిర్ణయించుకున్నాక నిషా చప్పున లోపలకి వెళ్ళి తలుపు మూసి చెక్క బీరువాకు వెనక దాక్కుంది.

'ఇది నీకు తగని పని' అని మెదడులోని కొన్ని న్యూరాన్‌లు నిషాను హెచ్చరించాయి. ఆమె దాన్ని పట్టించుకోకుండా ఊపిరి బిగబట్టి నిలబడింది.

గుండె వేగంగా కొట్టుకుంటూండగా

డాక్టర్ లోపల ఎవరితోనో టెలిఫోన్‌లో మాట్లాడ్డం స్పష్టంగా వినిపిస్తోంది.

ఒక్క నిమిషం తరువాత-

డాక్టర్ రిసీవర్‌ను పెడుతున్న శబ్దం వినిపించింది. ఆ తర్వాత ఆ బంగళా మొత్తం నిశ్శబ్దం ఆవహించింది.

నిషా బీరువా వెనక చలనం లేకుండా అలాగే నిలబడి ఉంది.

కొన్ని క్షణాల తర్వాత...

ముందు గదిలో డాక్టర్ అడుగుల శబ్దం వినిపించింది.

ఆ వెనకే ఆయన గొంతు వినిపించింది.

"ఆర్యా... ఆర్యా..."

"ఏం డాక్టర్? " లోపల ఏదో ఓ గదిలో నుండి ఒక యువతి గొంతు నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ బయటికొచ్చింది.

"ఆ అమ్మాయి వెళ్ళినట్టుంది. నువ్వు ముందు తాళం తీసుకుని కాంపౌండ్ గేట్‌కు వేసిరా. మరెవరైనా వచ్చేస్తారేమో!"

"అలాగే డాక్టర్" అన్న ఆర్యా గొంతు వినిపిస్తుండగానే నిషా దాక్కుని ఉన్న గది తలుపును తోసుకుని లోపలికి వచ్చాడు డాక్టర్ చతుర్వేది.

నిషా బీరువాకు అతుక్కుపోయింది.

ఆమె గుండె కొట్టుకునే వేగం రేసు గుర్రంలా దూసుకెళ్తుంటే, ఒళ్లంతా చెమటలు పట్టసాగాయి.

బీరువాకు అతి దగ్గరగా వచ్చాడు డాక్టర్.

నిషాలో సన్నటి వణుకు ప్రారంభమైంది. శ్వాస వదిలే శబ్దం కూడా డాక్టర్ గ్రహించకుండా ఉండటానికి తన నోటినీ, ముక్కునూ చేతితో మూసుకుంది.

డాక్టర్ బీరువాను బార్లా తెరచి దేన్నో అటు ఇటు కదిపి చూస్తుండగా ఆర్యా కాంపౌండ్ గేట్‌ను మూసి లోపలి నుండి తాళంపెట్టి గుమ్మం తలుపును దగ్గరికి వేసి గదిలోకి వచ్చింది.

"డాక్టర్"

"ఊc..."

"ఆ అమ్మాయి ఎటువైపు వెళ్ళిందో తెలియటం లేదు..."

"ఆమె ఎటుపోతే ఏం? ఇక్కడి నుండి వెళ్ళిపోయిందిగా... అంతే చాలు..."

"ఆమెను ఎందుకు రమ్మనాలి? ఇప్పుడు ఎందుకిలా అవస్థ పడాలి..."

"నేనెక్కడ రమ్మన్నాను... పది రోజుల క్రితం సెమినార్‌కొచ్చి, పరిచయం చేసుకుంది. బయలుదేరుతుంటే- టకటక ప్రశ్నలు వేయటం మొదలెట్టింది. 'నువ్వడిగే ప్రశ్నలకంతా ఇప్పుడు జవాబివ్వటానికి సమయం లేదు' అని చెప్పాను. 'వచ్చే ఆదివారం మీ ఇంటికి రానా' అంది. ఆమె నుండి బయటపడితే చాలన్న ఉద్దేశంతో తలాడించాను. కరెక్టుగా బాణం దూసుకొచ్చినట్టు వచ్చేసింది. ఆమె వస్తుందని నేను ఊహించను కూడా లేదు..."

"మళ్ళీ రమ్మని చెప్పారు? "

"ఏం చెయ్యనూ? అలా చెప్పకపోతే... ఆమె కదిలేట్టు లేదే? "

"డాక్టర్, ఈ పత్రికల వాళ్ళతో మీరు జాగ్రత్తగా ఉండాలి. ఇంటర్వ్యూ గింటర్వ్యూ అంటూ దగ్గరి కొస్తే తట్టుకోవటం కష్టం"

"ఇక ఆ అమ్మాయి ఎప్పుడొచ్చినా సరే, నేను ఊరుకు వెళ్ళానని చెప్పేయ్. కాంపౌండ్ గేట్ లాక్ చేశావా? "

"చేశాను..."

"బయట వర్షం పడుతోందా? "

"లైట్‌గా..!. బట్... ఆకాశం ఏ నిమిషంలోనైనా బరస్ట్ అయ్యేలా ఉంది...! బీరువాలో ఏం వెదుకుతున్నారు డాక్టర్...? "

"రాగిణి 'సెల్ కల్చర్' రిపోర్ట్!"

"అది సర్జరీ థియేటర్‌లో ఉంది"

"అక్కడికెందుకు తీసుకెళ్ళావ్? "

"నిన్న మీరే కదా అడిగారు..."

"ఓహ్ సారీ...! పద.. థియేటర్‌కు

వెళదాం" అంటూ బీరువా తలుపును గట్టిగా మూశాడు చతుర్వేది.

"తలుపు లోపల గడియపెట్టావా? "

"పెట్టాను. ఇక ఎవరితోనూ ఇబ్బంది ఉండదు డాక్టర్..."

"నువ్వు ఇంకోపని కూడా చెయ్యాలి.."

"ఏంటి డాక్టర్"

"టెలిఫోన్ రిసీవర్‌ను తీసి కింద పెట్టే సేయ్. మనం థియేటర్లో రాగిణి వద్ద ఉన్నప్పుడు అది మోగటం మొదలు పెడితే బయటికి రావలసి ఉంటుంది."

"మీరు థియేటర్‌కు వెళ్ళండి డాక్టర్. నేను రిసీవర్‌ను తీసి పెట్టేసి వస్తాను..."

చతుర్వేది వెళ్ళడానికి ప్రయత్నించగా, ఆర్యా చప్పున అడ్డుపడింది.

"డాక్టర్"

చతుర్వేది ఆగాడు.

"ఊc..."

"మీ జుబ్బా జేబులో ఏముందీ? "

"ఏం లేదే! కర్చీఫ్ ఉంది. ఎందుకలా అడుగుతున్నావ్? "

"మీ జేబుమీద నాలుగైదు ఈగలు తిరుగుతున్నాయి చూడండి"

తలొంచి చూశాడు.

"అరె... అవునూ! ఇవేంటిలా? " అంటూ జేబులోంచి తన తెల్లటి కర్చీఫ్‌ను బయటికి తీశాడు. కర్చీఫ్ నిండా రక్తం మరకలు..

చతుర్వేది నవ్వాడు. "ఇందాక రాగిణి ఒంటి నుండి రక్తం తీస్తున్నప్పుడు చేతిపై చిందింది. కర్చీఫ్‌తో తుడుచుకుని దాన్ని జేబులో పెట్టేసినట్టున్నాను. సరే.. దీన్ని స్టెరిలైజ్ చేసేయ్" అంటూ ఆ కర్చీఫ్‌ను ఆర్యా వైపు విసిరేసి మూలనున్న మరొక తలుపును తీసుకుని బయటికెళ్ళాడు చతుర్వేది. ఆర్యా హాలును వదిలి వెళ్ళేంతవరకూ ఆమె అడుగుల శబ్దం వినిపించింది.

తర్వాత...

నిశ్శబ్దం!

బీరువా వెనక నిలబడున్న నిషాకు దాదాపు చెమటతో స్నానం చేసినట్టు అయిపోయింది పరిస్థితి.

'ఈ డాక్టర్ చతుర్వేది... ఆ అమ్మాయి ఆర్యా... మంచివాళ్ళు కారు... వాళ్ళ వద్ద ఏదో తప్పుంది. ఎవరా రాగిణి? ... ఆమెను ఇక్కడ ఉంచుకొని వీళ్లేం చేస్తున్నారు? దాన్ని కనిపెట్టే తీరాలి' నిషా బీరువా వెనుక నుండి మెల్లగా బయటికొచ్చింది. చతుర్వేది బయటికెళ్ళిన తలుపు వైపు తడుముకుంటూ నడిచింది.

బంగళా బయట కురుస్తున్న వాన తుంపర్లు ఇప్పుడు క్రమక్రమంగా పెద్దవి కాసాగాయి.




**గదిలోకి** వెళ్ళాక రమణి చెప్పిన విషయాన్ని విని మాసిలామణీ, తిలకమూ స్తంభించిపోయారు.

"రే... రేయ్... రమణీ... ను... నువ్వు.....! నువ్వేమంటున్నావ్ రా..." గట్టిగా ఏడ్వడానికి ప్రయత్నించిన తల్లి నోటిని మూశాడు రమణి.

"అయ్యో... అమ్మా... ఏడ్చి గీపెట్టొద్దు... ఈ విషయం ఇప్పుడు వదినకు తెలియకూడదు... అన్నయ్యకు ఇలా అయిందని తెలిస్తే... నిండుగర్భిణి వదినకు ఏమైనా జరగొచ్చు"

మాసిలామణి శూన్యమైన చూపులతో

రమణి చేతుల్ని పట్టుకున్నాడు.

"ఈ విషయం చెప్పింది ఎవరు? "

"సిల్వర్ శాండ్ హోటల్ రిసెప్షన్ నుండి మాట్లాడారు నాన్నా. హోటల్‌కు ఎదురుగా ఉన్న రోడ్డును క్రాస్ చేస్తుండగా లారీ వచ్చి గుద్దినట్టుంది. స్పాట్‌లోనే అన్నయ్య ప్రాణం పోయినట్టుంది. బాడీని హాస్పిటల్‌కు తీసుకెళ్ళారట. బాడీని రిసీవ్ చేసుకోవడానికి రమ్మని చెప్పారు."

తిలకం చీరకొంగును అడ్డం పెట్టుకుని గోడకు చేరగిలబడి కూర్చుండిపోయింది.

మాసిలామణి దుఃఖంతో పూడుకుపోయిన కంఠంతో అడిగాడు, "రమణీ! ఇప్పుడు... ఏం చేద్దామంటావ్? "

రమణి దీర్ఘంగా నిట్టూర్చి అన్నాడు, "రేపు ఉదయం ముంబాయి వెళ్ళే ఫ్లైట్‌లో మీరు నేనూ బయలుదేరి వెళ్ళి అన్నయ్య బాడీని తీసుకుని వచ్చేద్దాం. మనం ముంబాయి నుండి తిరిగొచ్చేసరికి అమ్మ వదినకు జరిగిన విషయాన్ని చెప్పి..."

రమణి తన మాటల్ని ఇంకా పూర్తి చెయ్యలేదు. తిలకం తల కొట్టుకుంటూ రెండు చేతుల్నీ అడ్డంగా ఊపుతూ అరిచింది, "చె... చెప్పలేను... నా నోటితో చెప్పలేనురా రమణీ. కడుపులో బిడ్డను పెట్టుకుని అది తపించిపోవడాన్ని నేను చూడలేను"

"విషయాన్ని ఎలాగైనా చెప్పేతీరాలిగా...! ఎంత కాలమని దాచగలం? "

మాసిలామణి రమణి భుజం మీద చెయ్యేశాడు. "రమణీ! మీ అమ్మ చెప్పినట్టు హరిహరన్ మరణాన్ని గీతాంబరి ఈ పరిస్థితిలో తట్టుకోలేక పోవచ్చు ఆమె ప్రసవించేంత వరకూ చెప్పకుండా దాచి ఆ తర్వాత చెబుదాం"

"నాన్నా, ఇంతకీ మీరేమంటారు? "

"నువ్వు నేను చెప్పినట్టు వింటావా? "

"చెప్పండి నాన్నా..."

"గీతాంబరి ప్రసవించేంతవరకూ హరి మరణించిన విషయం మన రిలేటివ్ సర్కిల్‌కీ ఫ్రెండ్స్ సర్కిల్‌కీ తెలియకూడదు. రేపు ఉదయం ఫ్లైట్‌లో ముంబాయికి నువ్వు మాత్రం వెళుతున్నావ్..."

"నేను మాత్రమేనా? "

"అవును. నువ్వు వెళ్ళి హరి బాడీని తీసుకుని అక్కడే దహనం చేసేయ్"

తిలకం ఏడ్చేసింది. "ఏంటండీ ఘోరం! బిడ్డ ముఖం కూడా చూడనీయరా? "

"ఏడుస్తూ కూర్చోవడానికి ఇది సమయం కాదు తిలకం. ఒక పెద్ద ప్రాణాన్ని, ఒక చిన్న ప్రాణాన్ని కాపాడవలసిన బాధ్యత మన మీదుంది.."

తిలకానికి ఏం మాట్లాడాలో తెలియక ఏడుస్తూ ఉండిపోయింది.

రమణి మాసిలామణితో అన్నాడు, "నాన్నా... అన్నయ్య చనిపోయిన విషయాన్ని ఎవరికీ చెప్పకపోయినా ఒకరికి మాత్రం చెప్పేతీరాలి."

"ఎవరికి? "

"వదిన వాళ్ళమ్మకూ, అన్నకూ..."

"చెప్పాలని నువ్వు అనుకుంటున్నావా? "

"ఔను... వియ్యంకులకి తెలియపరచటం మన ధర్మం కదా..."

"అయితే ఒక పనిచేయ్..."

"ఏంటి? "

"గీతాంబరి వాళ్ళమ్మకు చెప్పొద్దు. ఆమె అన్న దివాకర్‌కు మాత్రం చెప్పేయ్. వీలైతే అతణ్ణీ ముంబాయికి తీసుకెళ్లు"

రమణి కళ్ళు వర్షిస్తుండగా పెదాలు దుఃఖంతో కంపించసాగాయి.

"నాన్నా! నేనూ, వదిన వాళ్ళ అన్న దివాకరూ ముంబాయికి వెళ్ళి చెయ్యాల్సిన పనులు చేసి రావటం గొప్పకాదు. కానీ ఆ తర్వాత వదిన ప్రసవమయ్యేంతవరకూ ఆమెను తట్టుకోవడం ఎలా? అన్నయ్య ముంబాయి నుండి టెలిఫోన్‌లో మాట్లాడ

లేదు అంటేనే వదిన ఎలా మదనపడిందో ఇందాక చూశారుగా? ప్రసవానికి ఇంకా ఇరవైరోజులుంది. ఈ ఇరవైరోజుల్లో అన్నయ్య రోజూ కనీసం ఒక్కసారైనా ఫోన్ చేసి మాట్లాడాలి"

మాసిలామణి కళ్ళు తుడుచుకుని తలా డించాడు. "ఆ సమస్యనూ అధిగమిద్దాంలే"

"ఎలా?" రమణి ఆశ్చర్యంతో కళ్ళను విప్పార్చి చూస్తున్న సమయంలోనే ఆ గది తలుపును తడుతున్న శబ్దం.

"టక్... టక్... టక్...!"

ముగ్గురూ మాటలను ఆపేసి, కళ్లు తుడుచుకున్నారు. రమణి గొంతును తగ్గించి తల్లితో చెప్పాడు.

"అమ్మా! వచ్చింది వదినే. ఏడ్చి గోల పెట్టేయకు... మాములుగా మాట్లాడు"

తిలకం తలాడించింది.

రమణి మెల్లిగా నడిచివెళ్ళి గడియతీసి తలుపు తెరిచాడు.

బయట...

గీతాంబరి నడుముమీద రెండు చేతుల్నీ ఉంచుకొని నవ్వుతూ అడిగింది, "తలుపు మూసుకుని ముగ్గురూ ఏం రహస్యాలు మాట్లాడుతున్నారో తెలుసుకోవచ్చా?"

గీతాంబరి అడిగిన ప్రశ్నకు మాసిలా మణీ, తిలకమూ ఏం జవాబు చెప్పాలో తెలియక తికమకపడుతుంటే రమణి నవ్వుతూ అన్నాడు, "రహస్యాలేం లేవు వదినా. నాన్నకూ నాకూ ఒక గొడవ..."

"గొడవా...?"

"ఊఁ..."

"ఏం గొడవ?"

"నాన్న రేపు ఉదయం... నన్ను కొచ్చికి వెళ్ళమంటున్నారు?"

"కొచ్చికా... దేనికీ?"

"ఓ కాంట్రాక్ట్ పనికి టెండర్ వేశాం. ఆ కాంట్రాక్ట్ మనకు దక్కాలంటే, అక్కడున్న ఒక రాజకీయ నాయకుణ్ని కలిసి లంచం ఇవ్వాలిట. అదే నాకు నచ్చని విషయం. కానీ, నాన్న ఇమ్మంటున్నారు. పనివాళ్ళ చెవిలో ఆ మాటలు పడకూడదనే తలు పులు వేసి మాట్లాడుకుంటున్నాం.. అంతే!!"

గీతాంబరి నవ్వి మాసిలామణి వైపుకు చూసింది. ఆయన ముఖం వాడిపోయి ఉండటాన్ని గమనించింది.

"ఏంటి మావయ్యా... అలా ఉన్నారు?"

"ఏం లేదమ్మా... నిద్రలేమి అంతే..."

"నిద్రలేమా? చూస్తే అలా కనిపించటం లేదే? మామూలుగా మీకు ఒంటి గంటకు పైనేకదా నిద్రపడుతుంది?"

"ఇవ్వాళ ఏంటో తెలియటం లేదమ్మా. అలసటగా ఉంది. కొచ్చి వెళ్ళే విషయంలో రమణితో గొడవ కూడానూ...!"

"మీకు నిద్రలేమి సరే... అత్తయ్యకు ఏమయ్యింది? ఆమె కూడా అదోలా ఉందే... కళ్ళంతా తడిగా ఉన్నాయి."

"నేనూ రమణీ కొచ్చివెళ్ళే విషయంగా మాట్లాడుకుంటున్నాం... కొడుకును వె నకేసుకొచ్చింది మీ అత్తయ్య. కోపమొచ్చి తిట్టాను, దాంతో కన్నీళ్ళు పెట్టుకుంది..."

గీతాంబరి నవ్వింది, "అత్తయ్య కన్నీళ్ళు పెట్టుకోవటం నేను ఇవ్వాళే చూశాను..."

తిలకం దుఃఖాన్ని దిగమింగి, ముఖాన్ని మామూలుగా పెట్టి గీతాంబరితో అంది.

"ఇప్పుడు నువ్వెందుకమ్మా లేచి వచ్చావ్? ... వెళ్ళి పడుకో..."

"పడుకోవటమా? నాకు నిద్రెలా పడు తుంది అత్తయ్యా? ముంబాయిలో ఉన్న మీ కొడుకు నాతో మాట్లాడాకే నాకు నిద్ర పడుతుంది..."

"హరి, రేపు ఉదయం ఫోన్ చేస్తానని చెప్పాడుగా..."

"ఫ్రెండ్‌తో బయటికెళ్ళిన మనిషి, హోటల్ రూమ్‌కు రాగానే మళ్ళీ ఫోన్ చేస్తారని నాకు అనిపించటం లేదు... అయినా పన్నెండుగంటల వరకూ హాల్

లో కూర్చుందామని వచ్చాను..."

తిలకం గతుక్కుమంది.

"నువ్వెందుకమ్మా ఆరోగ్యాన్ని పాడుచేసు కుంటావ్. బయటికెళ్ళినవాడు ఎన్ని గంట లకొస్తాడో, ఏమో? నువ్వెళ్ళి పడు కోమ్మా. రేపు ఉదయం వాడే ఫోన్‌చేస్తాడు"

"నా మనసు ఒప్పుకోవటం లేదు అత్తయ్యా..."

మాసిలామణి అడ్డుపడ్డాడు, "నువ్వెళ్ళి పడుకోమ్మా... హరి ఫోన్ చేస్తే నేనే వచ్చి పిలుస్తాను. నిద్రమాని ఆరోగ్యాన్ని చెడగొ ట్టుకోకు.. వెళ్ళమ్మా.. నీ గదిలోకి వెళ్ళు.."

గీతాంబరి అయిష్టంగా కదిలి, తన గది కేసి వెళ్ళగానే ముగ్గురూ ఒకరినొకరు చూసుకున్నారు.

ఆమె తన గదిలోపలికి వెళ్ళగానే చీరకొం గును నోటికి అడ్డం పెట్టుకుని తిలకం శబ్దం రాకుండా ఏడ్వటంతో రమణి తడి యైన కళ్ళతో మాసిలామణితో అన్నాడు, "నాన్నా ఇంకో ఇరవైరోజులు అన్నయ్య వది నతో టెలిఫోన్‌లో మాట్లాడితీరాలి. ఆ సమ స్యను పరిష్కరించవచ్చునని చెప్పారు. ఎలా పరిష్కరిస్తారు?"

"ఒకటే మార్గం.."

"ఏంటది?"

"నువ్వు బయటి నుండి ఇంటికి ఫోన్ చేసి మాట్లాడుతున్నప్పుడు గీతాంబరి ఎన్నో మార్లు హరి మాట్లాడుతున్నాడనుకుని పొర బడేది... నాతో కూడా ఎన్నోసార్లు ఆ విష యం చెప్పింది. కంఠంలో ఉన్న ఆ పోలి కనే ఇప్పుడు ఉపయోగించుకోబోతున్నాం. దీని ద్వారా గీతాంబరి ప్రసవమయ్యేంత వరకూ సమస్యను ఎదుర్కొందాం."

"నాన్నా! ఇది కుదిరే పనేనా?"

"జాగ్రత్తగా నడుచుకుంటే అన్నీ సాధ్యమే. రేపు ఉదయం ఫ్లైట్‌లో నువ్వూ, గీతాంబరి అన్న దివాకరు ముంబాయికి వెళ్ళిపోండి. నువ్వు కొచ్చికి వెళ్ళావని గీతాం బరితో చెప్పేస్తాను..."

"నాన్నా... ఫోన్లో మాట్లాడ్డం సరిగ్గా వర్కవుట్ అవుతుందంటావా?"

"అదీ... అదీ... నీ చేతిలోనే ఉంది. వెళ్ళగానే ఫోన్‌చేసి మాట్లాడు"

మాసిలామణి కళ్ళు నీటితో నిండిపో యాయి. ఆ తర్వాత ఏం మాట్లాడాలో తెలి యక గొంతు పూడుకుపోయింది.

★ ★ ★

వర్షం ముంబయిని చుట్టుముట్టింది.

డాక్టర్ చతుర్వేది బంగళాలో అలు ముకుని ఉన్న చీకటిలో మెల్లగా నడుచు కుంటూ వెళ్ళి, ఆ గది తలుపు మీద చెయ్యే సింది నిషా.

తలుపు మెల్లగా తెరుచుకుంది. నిషా తన తలను మాత్రం లోపలికి చాపి చూపుల్ని సారించింది.

అది కాస్త పెద్ద గదిలాగానే అనిపిం చింది. లేబొరేటరీలా అగుపిస్తోంది. పొడ వాటి మేజామీద ఏవేవో పరికరాలు, అద్దాల అల్మైరాలో రంగు రంగుల ఆమ్ల బాటిళ్ళు ఉన్నాయి. ఉప్పు జాడీలు, గోడమీద ఏవేవో సైన్స్‌కు సంబంధించిన చిత్రాలున్నాయి. నిషా గబగబా వాటిని చదివింది.

Structure of nucleotide

A - T - C - G

Function of Gene Isolator

## కొత్తగాలి...

**నువ్వెక్కడుంటే నేనక్కడుంటా**
**అన్నాడతను పొయెటిగ్గా**
**మరీ అంత అనుమానమా..? అని**
**అతని ప్రేమని**
**వద్దనేసిందామె చిరాగ్గా!**

– భాస్కరభట్ల, హైదరాబాద్

Gene Machine.

నిషాకు అవేమీ అర్థం కాలేదు. లేబొరేటరీలో ఆవరించి ఉన్న గాలిలో ఏదో పులిసిన వాసన అలుముకుని ఉండటం నిషా నాసిక పసిగట్టింది.

నిషా శబ్దం రాకుండా మెల్లగా నడిచి లోపలికెళ్ళింది.

చతుర్వేది దృష్టిలో పడకుండా జాగ్రత్తపడింది. శరీరం దేనికీ తగలకుండా రెండు పొడవాటి మేజాలకు మధ్యన నడిచి గది చివరికెళ్ళింది.

పక్క గదిలోకి వెళ్ళడానికి కర్టెన్ వ్రేలాడుతూ ఒకదారి కనిపించింది. లోపల నుండి ఏవో చిన్న శబ్దాలు వినిపించాయి...

చతుర్వేది గొంతు సవరించుకున్న శబ్దం.

వెనక్కు తిరిగి చూసింది.

ఆర్యా రావటం కనిపించింది.

చటుక్కున పక్కనున్న పెద్ద బీరువా వెనక గొంతుక్కూర్చుంది. ఆర్యా వచ్చింది. చేతిలో ఏదో ఫైల్ ఉంది. కర్టెన్ తీసుకుని లోపలికి వెళ్ళింది.

డాక్టర్ గొంతు వినిపించింది. "రిసీవర్‌ను క్రింద పెట్టేశావా ఆర్యా? "

"ఊఁ"

"బయట వర్షం పెద్దదైనట్టుంది"

"బాగా"

"చేతిలో ఏం ఫైల్ అదీ? "

"ఆటో క్లోవ్ పర్టికులర్స్"

"సెల్ కల్చర్‌లో మీడియమ్‌ను మార్చి చూశావా? "

"లిక్విడ్ స్టేజ్ నుండి సాలిడ్ స్టేజ్‌కు మార్చి చూశాను డాక్టర్. ఏమీ గ్రోత్ కనిపించటంలేదు"

"ఎక్కడో తప్పు చేస్తున్నాం"

"నైట్రోజినస్ బేస్ రేషియో కూడా సరిగ్గా దొరకలేదు డాక్టర్. సైటోసైన్ రాలేదు..."

"స్టెరిలైజేషన్ సరిగ్గా కానట్టుంది. సెల్‌కల్చర్ మీడియమ్‌ను ఇకపై నువ్వు ప్రిపేర్ చెయ్యకు. నాకు వదిలి పెట్టేయ్..."

"సరే డాక్టర్..."

చెయిర్ వెనక్కు తోసిన శబ్దం.

డాక్టర్ పైకి లేచినట్టున్నాడు.

"ఇక రాగిణి దగ్గరకు పోదామా? "

కర్టెన్ కదిలింది.

నిషా ఊపిరి బిగబట్టి అలాగే కూర్చుండిపోయింది. చతుర్వేది, ఆర్యా బయటికొచ్చారు. చతుర్వేది నోట్లో ఉన్న పైప్ నుండి పొగ వస్తోంది.

"జీన్ మెషీన్ మానిటర్ ఇప్పుడు సరిగ్గా పనిచేస్తోందా ఆర్యా? "

"పర్‌ఫెక్ట్‌గా ఉంది డాక్టర్..."

"మార్చాల్సి వస్తుందేమోననుకున్నా"

"మరొకటి ఇంపోర్ట్ చేసుకోవాలని అంటుండేవాళ్ళుగా డాక్టర్? "

"కాలిఫోర్నియాలో ఉన్న బయోటెక్ రీసెర్చ్ సెంటర్‌కు ఉత్తరం రాశా. బదులు రాలేదు. రేపొక రిమైండర్ పంపాలి" మాట్లాడుకుంటూ ఇద్దరూ బయటికి నడిచారు. బీరువా వెనక కూర్చున్న నిషా అలా కూర్చున్న స్థితిలోనే బయటికొచ్చింది. డాక్టర్, ఆర్యా ఇప్పుడు లేబొరేటరీకి కుడి పక్క చివరగా గోడకున్న వార్డ్‌రోబ్ లాంటి దాన్ని తెరచుకుని లోనికెళ్లారు. నిషా రెండు నిమిషాలాగి మెల్లగా లేచి, ఆ వార్డ్‌రోబ్‌కేసి వెళ్ళింది. దగ్గరికి నడిచి దాని చేతి పిడిని పట్టుకుని లాగింది. మొండికేయకుండా అది తెరుచుకుంది.

జాగ్రత్తగా లోపలికి వెళ్ళింది. గదిలోపల డిమ్‌గా లైట్ వెలుగుతోంది. ఏసీ శబ్దం చేస్తోంది. రెండు మూడు కంప్యూటర్ల మానిటర్ తెరలమీద వెలుగు కనిపించింది.

"ఎటు వెళ్లారు వీళ్ళు? "

నిషా అటుఇటు చూస్తూ మెల్లగా నడవసాగింది. గదిలో ఉన్న చల్లదనాన్ని మించి చెమట పట్టసాగింది. ఆ గది కూడా ఒక పరిశోధనాలయంలా అగుపిస్తోంది. అల్మైరాలో ఉన్న గాజునాళాల్లో ఈస్ట్‌మన్ కల

ర్‌లో ద్రవాలు స్థిరంగా కనిపిస్తున్నాయి.
నిషా ఎటువెళ్ళాలా అని ఆలోచిస్తున్నంతలో- వెనకనుండి ఎవరో గొంతు సవరించుకున్న శబ్దం వినిపించింది. అదిరిపడి వెనక్కు తిరిగింది. చతుర్వేది పైప్ పొగ వదులుతూ నవ్వాడు.
"రా నిషా...! వెల్‌కమ్...!"
చతుర్వేదిని చూసి ఒంట్లోని ముఖ్య భాగాలన్నీ అదిరాయి నిషాకు.
మెల్లగా భయం ఆవహించసాగింది.
చతుర్వేది నవ్వు పెద్దదైంది "నిన్ను అప్పుడే వెళ్ళిపొమ్మన్నాగా?"
"డా... డా... డాక్టర్ అదీ... అదీ"
"విలేఖరి పనేకాక డిటెక్టివ్ పనిని కూడా పార్ట్‌టైమ్‌గా పెట్టుకున్నట్టున్నావ్?"
"డా... డాక్టర్.. బయట వర్షం ఎక్కువైంది అందుకే..."
"తల దాచుకొనేందుకు లోపలికి వచ్చానంటావ్..." అంటూ ఒక బీరువా చాటునుండి బయటికొచ్చింది ఆర్యా. ఆమె చేతిలో ఒక మెటాలిక్ పిస్టల్ దర్శనమిచ్చింది.
"నీకో విషయం తెలుసా నిషా? ఈ లేబొరేటరీ లోపల నేనూ డాక్టర్ తప్ప, ఎవరున్నా సరే, వాళ్ళెంత మెల్లగా పిల్లిలా నడిచినా సరే, మా చేతికి ఉన్న ఈ డెసిబల్ డిటెక్టర్ చెప్పేస్తుంది..."
నిషా నుదుటిపై ఇప్పుడు చెమట ధారగా కారసాగింది. మెల్లగా వెనకడుగు వెయ్యబోయి దేనికో గుద్దుకుని ఆగింది. చతుర్వేది నవ్వి ఆమె వైపుకు నడిచాడు. "భయపడకు నిషా... నువ్విప్పుడు విలేఖరివి కావు. నా గెస్ట్‌వి. ఇంటికొచ్చిన గెస్ట్‌కు మర్యాద చెయ్యకుండా ఉండొచ్చా?"
నిషా చూపుల్లో భయం. లిప్‌స్టిక్ పూసిన పెదాలు అదరసాగాయి.
"డా... డాక్టర్..."
"ఏంటమ్మా"
"న. నన్ను... వదిలి పెట్టేయండి... నే... వెళ్ళిపోతాను..."
"ఏంటీ వెళతావా? బావుందే కథ! ఆర్యా... నిషా చెప్పింది విన్నావా?"
ఆర్యా నవ్వింది. "అలా వెళ్లడానికి వీల్లేదు .. ఇక్కడికి అతిథిగా వచ్చినవాళ్ళు ఎట్‌లీస్ట్ పదిరోజులైనా ఇక్కడ ఉండే వెళ్ళాలి..."
"మన అతిథిని లోపలికి తీసుకెళ్ళు ఆర్యా, బంగళా కాంపౌండ్ గేట్‌కు వేసిన తాళం సరిగ్గా వేశావో లేదో చూసొస్తా నేను" చతుర్వేది బయటకి నడిచాడు.
ఆర్యా నిషా వైపుకు నడిచి కుడిచేత్తో ఆమె భుజాన్ని పట్టుకుంది.
"నడూ..."
నిషా భయపడుతూ నడిచింది. కిరోసిన్ తగ్గిన హరికేన్ లాంతరులా ఆమె గుండె కొట్టుకోసాగింది.
'ఇక్కణ్ణుండి తప్పించుకోవడానికి వీలవుతుందా? ... వీలయ్యేలా లేదే...! ఏం చేద్దాం...?' నిషా వేగంగా ఆలోచిస్తున్నంతలోనే ఊదారంగు వెలుతురు నిండిన ఒక గదిలోకి వచ్చారు వాళ్లు. అక్కడ ఏసీ శబ్దం వినిపిస్తోంది. ఏసి చల్లదనంలో కడుపులో తిప్పేసేటంతగా ఓ చెడువాసన.
"కూర్చో..."
నిషాను ఒక కుర్చీలోకి తోసింది ఆర్యా. కుర్చీ ఆర్మ్‌పోర్షన్‌కు ఆమె రెండు చేతుల మణికట్లూ కప్లింగ్‌లతో వెంటనే బంధించబడ్డాయి. గింజుకునేందుకు ప్రయత్నించగా మణికట్టు వద్ద విపరీతమైన నొప్పి.
కళ్ళలో నుండి నీరు కారుతుండగా నిషా చూపులు ఆ గది నలువైపులకూ ప్రసరింపచేసింది. ఊదారంగు వెలుతురు కారణంగా మొదట్లో అల్మైరాలోని వస్తువులు అలికినట్టు కనిపించినా ఒకట్రెండు నిమిషాలకంతా స్పష్టంగా కనిపించసాగాయి. నాలుగైదు కంప్యూటర్ల మధ్య ఓ ఫైబర్ గ్లాస్ మేజా స్పష్టంగా కనిపించింది.
దానిమీద చేతులూ కాళ్లూ చాచినట్టు ఓ

యువతి శరీరం ఉంది. తల మొత్తంగా గుండు గీయబడింది. ఛాతీమీద గుడ్డలేదు. ఎడమవైపు ఛాతీమీద ఎర్రని తెరుచుకున్న కన్నులాగ సిగరెట్ ప్యాకెట్ సైజులో ఒక బూడిద రంగు పరికరం అమర్చి ఉంది. నున్నటి పుర్రె వెనక భాగంలో ఒక రంధ్రం ఉంది. కింది భాగంలో చారలుగా రక్తం...

నిషా గుండె బ్రిడ్జి మీద వెళ్ళే రైలులా మారుతున్న సమయంలో...

చతుర్వేది లోపలికొచ్చాడు. వర్షంలో లైట్‌గా తడిసినట్టున్నాడు. నిషాను చూసి చిర్నవ్వు చిందించాడు.

"ఏం నిషా... కుర్చీ సౌకర్యంగా ఉందా? ఇక్కడికొచ్చే గెస్ట్‌లకోసమే ప్రత్యేకంగా తయారు చేయించిన కుర్చీ అది..." అని ఆర్యా వైపు తిరిగాడు.

"గెస్ట్‌కు కూల్‌డ్రింక్ ఇచ్చావా?"

"రెడీగా ఉంది" చేతిలోని ఇంజెక్షన్‌ను పైకెత్తి చూపించింది. దాన్ని చూసిన నిషా కళ్ళలో భయం ద్విగుణీకృతమైంది. ఆ సిరెంజ్ లోపల మగ్గిపోయిన పచ్చరంగులోని ద్రవం కదలాడింది.

"ఏంటది?"

నిషా భయంభయంగా చూస్తుండగానే ఆర్యా ఆమె దగ్గరికొచ్చి ఎడమ చేతిని పట్టుకుంది. నిషా విదిలించింది.

"వద్దు... వద్దు..."

"వద్దా... సరేలే...! ఈ కూల్‌డ్రింక్‌కే భయపడితే ఎలా? తీసుకోవలసినవి ఎన్నో ఉన్నాయి? ఆ అమ్మాయి మేజామీద పడుకున్నట్టు నువ్వూ పడుకోవద్దూ?"

"నో!" నిషా అరుస్తుండగానే ఆమె ఎడమ భుజంలోకి సూది దిగబడింది. వెంటనే మెదడు లోపల వేడి అధికం కాసాగింది.

★ ★ ★

గీతాంబరి తల్లి పార్వతమ్మ ఆ ఉదయం పూట రమణి చెప్పిన విషయాన్ని విని మీద పిడుగుపడ్డట్టు స్తంభించిపోయి అలాగే గోడకు జారగిలబడింది. దివాకర్ షాక్ నుంచి తేరుకుంటూ అడిగాడు, "ముంబయి నుండి వార్త ఎప్పుడొచ్చింది.?"

"రాత్రి పదిన్నరకు..."

"వెంటనే వచ్చి ఎందుకు చెప్పలేదు...?"

"ఒకటే అయోమయంగా అనిపించింది... ఏం నిర్ణయం తీసుకోవాలో తెలియలేదు. మీ అమ్మకు కూడా ఈ విషయం తెలియకూడదని మా నాన్న చెప్పారు. కానీ నా మనసు అంగీకరించలేదు. చెప్పేశాను. చూడు దివాకర్, ఇప్పుడు సావకాశంగా మాట్లాడుకోవటానికి టైంలేదు. నువ్వూ నేనూ ముంబాయి వెళ్లడానికి ఫ్లైట్ టికెట్‌లు తీసేశాం. రెండు జతల బట్టలు సర్దుకుని బయలుదేరు. ఇంకో గంటలో ఫ్లైట్... బయట టాక్సీ రెడీగా ఉంది".

దివాకర్ వేగంగా తన గదిలోకి వెళ్లాడు. పార్వతమ్మ ఏడుస్తూ అంది, "ఇది... ఇది ఏంటయ్యా అన్యాయం? గీతాంబరి వద్ద దాచాల్సిన విషయమేనా ఇది. భర్త ముఖాన్నైనా చివరిసారిగా.. చూడొద్దా?"

"అమ్మా.. మీరంటున్నది సబబే. అయితే వదిన ఇంకో జీవినీ మోస్తోంది. నిజం తెలిస్తే తట్టుకోలేదు. అంచేత జరపాల్సిన తతంగాలన్నీ పూర్తిచేసుకుని వచ్చేస్తాం".

పార్వతమ్మ తన రెండు చేతుల్నీ ముఖానికి అడ్డు పెట్టుకుని ఏడవసాగింది. దివాకర్ తన గదిలో నుండి ఒక చిన్న సూట్‌కేస్‌తో బయటికొచ్చాడు.

"అమ్మా! నువ్వు ఏడ్చి గీపెట్టకు! ఇప్పుడు మనకు గీతాంబరి ప్రాణం ముఖ్యం. పోయిన ప్రాణం కోసం ఏడ్చి, ఉన్న ప్రాణాన్ని లేకుండా చేయకు. మేము ముంబయి నుండి వచ్చేంతవరకూ ఇంట్లోనే ఉండు. పొరపాటున కూడా గీతాంబరిని చూడ్డానికి వెళ్ళొద్దు. దుఃఖాన్ని కంట్రోల్ చేసుకోలేవు"

పార్వతమ్మ గోడకేసి తలను బాదు

కుంది. "ఒరేయ్ దివాకర్, ఇంత పెద్ద భారాన్ని మనసులో మోస్తూ ఇంట్లో నేనె లారా స్థిమితంగా కూర్చోనూ? "

"అమ్మా... గుండె నిబ్బరం చేసుకో... మేం రెండు రోజుల్లో తిరిగొచ్చేస్తాం"

పార్వతమ్మ చీరకొంగుతో నోటిని మూసు కుని వెక్కివెక్కి ఏడవసాగింది. రమణీ, దివాకర్ వీధిలో చీకట్లో నిలబడివున్న టాక్సీ కేసి నడిచారు.

★ ★ ★

వర్షంతో తడిసిన ముంబయి నేలమీద వాళ్లు అడుగుపెట్టి టాక్సీలో ప్రభుత్వ ఆసుపత్రికి చేరుకునేసరికి సమయం ఉదయం పదకొండు గంటలు అయింది.

పోస్టుమార్టం గది ఎటువైపో తెలుసుకుని జనం రద్దీ నుండి తప్పించుకుని వెళ్లేసరికి రమణీ దివాకరూ చెమటతో తడిసి నీరసించిపోయారు.

మార్చురీ గదికి వెలుపల నిలబడి నోట్లో 'పాన్' నములుతూ ఎవరినో హిందీలో తిడుతున్న ఆ యువ ఇన్‌స్పెక్టర్ ముందు కెళ్లి నిలబడ్డారు వాళ్ళు. ఇన్‌స్పెక్టర్ చొక్కాకున్న నేమ్ బ్యాడ్జ్ అతనిని 'మల్హోత్రా' అని తెలియ చేస్తోంది.

రమణి తనకు తెలిసిన హిందీలో అడిగాడు, "సార్... మేం మెడ్రాస్ నుండి వస్తున్నాం. సిల్వర్ శాండ్ హోటల్లో దిగిన హరిహరన్ లారీ గుద్దుకుని చనిపోయినట్టు, హాస్పిటల్లో బాడీ ఉన్నట్టూ నిన్న రాత్రి హోటల్ నుండి ఫోన్ మెసేజ్ వచ్చింది"

మల్హోత్రా నోట్లో ఉన్న పాన్‌ను పక్కనున్న క్రోటన్స్ మొక్కలపై ఉమ్మి పక్కన పెట్టున్న టోపీని తీసి తలమీద సర్దుకుంటూ వాళ్లను చూశాడు.

"మీ కోసమే ఎదురుచూస్తున్నాను. చనిపోయిన హరిహరన్‌కు మీరేమవుతారు? "

"నేను బ్రదర్‌ను, ఇతను బ్రదర్ ఇన్‌లా"

మల్హోత్రా నిట్టూర్చాడు. "జరిగింది ఒక ఘోరమైన సంఘటన. రాత్రి పదింపావు గంటల సమయంలో బ్రీఫ్‌కేస్ తీసుకుని మీ బ్రదర్ హోటల్‌నుండి బయలుదేరినట్టున్నాడు. వాచ్‌మెన్‌తో 'టాక్సీ స్టాండ్ ఎక్కడుంది' అని అడిగి తెలుసుకుని రోడ్డును క్రాస్ చేయాలనుకున్నాడు. ఆ సమయంలో దూసుకొచ్చిన ఓ లారీ గుద్దినట్టుంది. స్పాట్‌లోనే తల పగిలి మరణం సంభవించింది. లారీ నిలవకుండా వెళ్లిపోయినా హోటల్ వాచ్‌మేన్ నెంబర్ నోట్ చేశాడు. లారీని పట్టేయొచ్చు భయంలేదు."

రమణి ఏడుపును దిగమింగుకుంటూ అడిగాడు, "బాడీని చూడొచ్చా సార్? "

## రాజాజీ చతురోక్తులు

రాజాజీగా సుప్రసిద్ధులైన చక్రవర్తుల రాజగోపాలాచారి దేశభక్తుడు. గాంధీజీతో సాన్నిహిత్యం ఎక్కువ. వివిధ సందర్భాల్లో ఆయన పేల్చిన చతురోక్తులలో కొన్ని...



### బాపూజీకి చురక

గాంధీజీ తరచుగా రాజాజీకి జాబులు రాస్తుండేవారు. వ్యవహారమంతా ఇంగ్లీషులోనే సాగేది. ఒకసారి గాంధీజీ హిందీలో జాబు రాస్తూ ఇకముందు తన లేఖలన్నీ హిందీలోనే రాయాలని నిర్ణయించుకున్నట్లుగా అందులో తెలిపారు. వెంటనే రాజాజీ గాంధీజీకి తమిళంలో బదులు రాశారు. పర్యవసానంగా గాంధీజీ హిందీ వదిలి ఇంగ్లీషులోనే జాబులు రాయటానికి అంగీకరించారు.

"రండి..." రంగు వెలిసిన మార్చ్యురీ గది తలుపును తీసుకుని లోపలికి వెళ్లాడు మల్హోత్రా. ఇద్దరూ వెంట నడిచారు. రేకుల మేజాలపై శవాలు ఫార్మలిన్‌లో చుట్టబడి కనిపించాయి. నేలమీద ఐసుదిమ్మెల తేమ తడితడిగా ఉంది. మల్హోత్రా అనవసరంగా నవ్వుతూ చెప్పాడు, "ఇవ్వాళ సిటీలో ఏడెనిమిది ఆత్మహత్యలు జరిగాయి. మార్చ్యురీ హౌజ్ ఫుల్?"

రమణికి కడుపులో తిప్పినట్టయింది. వాంతి చేసుకోనేలా ఉన్నాడు.

మల్హోత్రా అడిగాడు, "మీ బ్రదర్‌కు మ్యారేజ్? ..."

"అయ్యింది"

"పూర్ ఫెలో..."

నడుస్తున్నవాడు చటుక్కున నిలబడి పక్కనున్న మేజాను చూపించాడు.

"ఇదే...!"

రమణీ, దివాకర్ అటు చూశారు. ముఖంపై కప్పి ఉన్న తెల్లటి గుడ్డ నుండి బయటికొచ్చి పగిలిన తల కనిపించింది.

మల్హోత్రా తన చేతిలోని లాఠీతో రక్తపు మరకలతో ఉన్న ఆ ముసుగును తొలగించాడు. శరీరం పూర్తిగా కనిపించింది. "ఇది అన్నయ్యా కాకూడదు భగవంతుడా" అని ప్రార్థిస్తూ రమణి చూపుల్ని తిప్పాడు. గుండె వేగంగా కొట్టుకుంది. ముఖం, కంఠం, ఉదరమూ అన్నీ చితికి పోయి ఉన్నా అది హరిహరనే అన్న విషయాన్ని రక్తంతో తడిసిన ఆ స్కై బ్లూ సఫారీ డ్రెస్, ఎడమ చేతి రిస్టువాచ్ స్పష్టం చేస్తున్నాయి.

మల్హోత్రా బ్రీఫ్‌కేస్‌ను పట్టుకొచ్చి చూపించాడు. "యాక్సిడెంట్ జరిగినప్పుడు ఈ బ్రీఫ్‌కేస్ మీ బ్రదర్ చేతిలో ఉంది. ఇది ఆయనదేనా చూడండి."

రమణి తీసుకుని చూశాడు.

అది హరిహరన్ బ్రీఫ్‌కేసే.

తాళం తెరిచాడు. హరిహరన్‌కు ఇష్టమైన ఇంగ్లీష్ ప్రావెర్బ్ స్టిక్కర్ బ్రీఫ్‌కేస్ లోపలి భాగాన అతికించబడి ఉంది.

For every 10 Minutes you are angry, you lose 600 seconds of happiness.

లోపల డైరీ, పెన్ను, కూలింగ్ గ్లాసెస్, అత్తరు కర్చీఫ్, మనీపర్స్, ఫ్లైట్ టికెట్లు, ఇన్‌హేలర్, జాన్సన్ బడ్స్ అన్నీ తాము హరిహరన్ సొంతమని స్పష్టం చేస్తున్నాయి. లోపలి అరలో కట్టలు కట్టలుగా కరెన్సీ ఉంది.

రమణి మనీపర్సును తెరిచాడు. పర్స్ రెండో అరలో.. అద్దం వెనక... పాస్‌పోర్ట్ సైజ్‌లో నుదుట పెద్ద కుంకుమబొట్టుతో నవ్వుతున్న గీతాంబరి ఫోటో దర్శనమిచ్చింది.

వదిన ఫోటోను చూడగానే రమణి కళ్ళు నీళ్లతో నిండిపోయాయి.

రమణి భుజాన్ని తట్టాడు మల్హోత్రా. "ఫోటోలో మిసెస్ హరిహరనే కదూ?"

రమణి ఔనన్నట్టు తలాడించాడు.

"నౌ షి ఈజ్ క్యారియింగ్"

"బాప్‌రే..." అన్నాడు ఎస్సై.

రమణి గద్గద కంఠంతో అన్నాడు. "బాడీని ఎప్పుడిస్తారు సార్?"

"ఇంకా పోస్ట్‌మార్టం కాలేదు. పి.ఎం. పూర్తై మీకు బాడీ హ్యాండోవర్ అయ్యేసరికి సాయంత్రం ఆరు అవుతుందనుకుంటున్నాను. బట్ బాడీని మీరు చెన్నై తీసుకెళ్ళడానికి వీలులేదే"

"లేదు. ఇక్కడే దహనం చేసి వెళతాం"

"హరిహరన్ బస చేసిన సిల్వర్ శాండ్ హోటల్‌కు వెళ్లారా?"

"లేదు"

"అక్కడికి వెళ్ళండి.. హరిహరన్ వస్తువులన్నీ తీసుకోండి. బాడీని దహనం చేశాక వెంటనే మీరు వెళ్లడానికి వీల్లేదు. కేసు ఫైల్‌చేసి ఫర్‌దర్ ప్రొసీడింగ్స్ కోసం పంపడానికి మీ అవసరం ఉంటుంది."

"ఎన్ని రోజులు ఉండవలసి వస్తుంది?"

"అధిక పక్షం ఐదురోజులు. కేసు కోర్టుకు వెళ్ళాక నెలకోసారి రావలసి ఉంటుంది"

"ఇన్‌స్పెక్టర్"

"ఏంటీ? "

"ఈ కేసును ఫైల్ చెయ్యకండి సార్? "

"అదెలా సాధ్యం? ఆ లారీవాణ్ణి కోర్టుకు లాగి శిక్షపడేలా చేయాలి కదా? సరే, మీరు హోటల్ కెళ్ళండి. పోస్టుమార్టమయ్యాక ఫోన్ చేస్తా. వచ్చి బాడీని తీసుకుందురు"

రమణీ, దివాకరు భారమైన హృదయాలతో మార్చురీ బయటకు నడిచారు.

దివాకర్ అన్నాడు, "రమణీ, మీ నాన్నకు ఫోన్‌చేసి విషయమంతా చెప్పాలి కదా? "

"అవును"

## 3



**చెన్నై!**

టెలిఫోన్ మోగింది. కుర్చీలో వెనక్కు వాలి కళ్ళు మూసుకుని ఉన్న మాసిలామణి ఆదుర్దాగా లేచి అదురుతున్న చేతులతో రిసీవర్ తీసి చెవికి ఆనించుకున్నాడు.

"హలో.. నాన్నా... రమణిని"

మాసిలామణిలో ఆదుర్దా ఎక్కువైంది. "రమణీ ఒక్క నిమిషం లైన్లోనే ఉండు..." అని గోడకు ఆనుకుని కూర్చొని ఏడుస్తున్న భార్య వైపుకు తిరిగాడు.

"తిలకం.. ముంబయి నుండి రమణీ. గీతాంబరి ఎక్కడుందో చూడు.."

తిలకం చీరకొంగుతో కళ్లు తుడుచుకుంటూ గది బయటికి వెళ్లి, చూసి మళ్ళీ లోపలికి వచ్చింది. "సిట్ అవుట్‌లో కూర్చొని వైర్‌బ్యాగ్‌ను అల్లుతోంది..."

"ఆమెను ఓ కంట కనిపెడుతుండు... నేను వాడితో మాట్లాడతా"

తిలకం తల ఊపుతూ గది ద్వారం వద్ద నిలబడింది. మాసిలామణి టెలిఫోన్‌లో "చెప్పు రమణీ..." అన్నాడు.

"నాన్నా...! నేనూ దివాకరూ ఇప్పుడు ముంబయి జి. హెచ్‌కు బయటున్న టెలిఫోన్ బూత్‌నుండి మాట్లాడుతున్నాం. అన్నయ్య బాడీ ఇంకా పోస్టుమార్టం కాలేదు. బాడీ అందేసరికి సాయంత్రం ఐదు గంటలు అయ్యేటట్టుంది."

మాసిలామణి కీచుకంఠంతో అడిగాడు, "ఆక్సిడెంట్ ఎలా జరిగిందో కనుక్కున్నావా? "

"అడిగాను. నిన్న రాత్రి సుమారు పదింపావు సమయంలో బ్రీఫ్‌కేస్ తీసుకుని అన్నయ్య బయటికి వెళ్లటానికి బయలుదేరినట్టుంది. టాక్సీ స్టాండ్‌కు వెళ్లటానికి హోటల్ ఎదురుగా ఉన్న రోడ్డును క్రాస్ చేస్తున్నప్పుడు వేగంగా దూసుకొచ్చిన లారీ గుద్దేసినట్టుంది"

"రాత్రి పదింపావు పైన ఎవరిని కలవడానికి హరి బయలుదేరాడు? "

"బిజినెస్ విషయంగా ఎవర్నినైనా కలవడానికై ఉండొచ్చు నాన్నా."

గది గుమ్మం వద్ద నిలబడున్న తిలకం చప్పున పిలిచింది.

"ఏమండి, గీతాంబరి లేచి వస్తోంది. ఫోన్ పెట్టేయండి"

"రానివ్వు! రిసీవర్‌ను ఆమెకిచ్చి రమణిని హరి మాట్లాడేలా మాట్లాడమందాం".

"ఈ విషమ పరీక్షలు వద్దండి... నాకు ఒళ్ళంతా దడ పుడుతోంది."

"వద్దంటే ఎలా? ముంబయి నుండి హరి ఫోన్‌చేసి మాట్లాడుతాడని ఉదయం ఆరు

గంటల నుండి గీతాంబరి ఎదురు చూసి చూసీ అలసిపోయింది. ఇకనైనా హరి ఫోన్ చేయకపోతే ఊరుకోదు. నిన్నూ నన్నూ స్థిమితంగా ఉండనివ్వదు".

"నేను లోపలికెళ్ళిపోతాను. దీన్ని నేను భరించలేను..." తిలకం ఏడుపు గొంతుతో అంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

మాసిలామణి టెలిఫోన్‌లో మాటలు కొనసాగించాడు. "రమణీ! మీ వదిన వస్తోంది. ఆమె చేతికి రిసీవర్‌ను ఇవ్వబో తున్నాను. నువ్వు హరిలా మాట్లాడు..."

"నా... నాన్నా..." అటు వైపు రమణి తడబడ్డాడు.

"ఫోన్‌లో ఎవరు మావయ్యా?"

గీతాంబరి గది లోపలికొచ్చింది.

★ ★ ★

నిషా చెవి పక్కకు వంగి డాక్టర్ చతుర్వేది నవ్వాడు. "మేము ఒక ముఖ్యమైన ఎక్స్‌పెరిమెంట్ చెయ్యాలి నిషా... అందుకని నీకు ఓ నాలుగ్గంటల వరకూ నిర్బంధ నిద్ర తప్పదు. కలర్ కలర్‌గా కలలొస్తాయి... నిద్రపో..."

నిషాకు తన శరీరం తేలికైపోతున్నట్టుగా అనిపిస్తోంది. కనురెప్పలు షట్టర్‌లాగా ఎవరో క్రిందికి లాగి తాళం వేశారు. మాట్లాడాలని ప్రయత్నించి వీలుకాకపోవడంతో అలాగే తలను పక్కకు వాల్చేసింది.

చతుర్వేది ఆర్యాను చూసి నవ్వాడు.

"ఆర్యా.."

"డాక్టర్.."

"ఇప్పటిదాకా మన పరిశోధనాలయానికి వచ్చిన ఎలుకల్లో ఇదే ఆరోగ్యమైంది"

"తెలివైన ఎలుక కూడా..."

"అదృష్టం. తానుగా వచ్చి చిక్కుకుంది."

"లోపలికి తీసుకెళ్ళి కేజ్‌లో పడుకోబెట్టేద్దామా... డాక్టర్?"

"ఊఁ... నువ్వెళ్ళి కేజ్‌రూమ్‌ను తెరిచి



ఉంచు. నేను ఆమెను ఎత్తుకొస్తాను."

ఆర్యా తలాడిస్తూ ల్యాబొరేటరీ చివర నున్న ఒక గదిలోకి వెళ్ళింది. చతుర్వేది కుర్చీకున్న కప్లింగ్‌లను తొలగించి నిషాను ఓ పువ్వులా పైకెత్తుకున్నాడు.

"రావే అందాల ఎలుకా...!" నడిచాడు.

ఇనుప చువ్వలతో తయారుచేసిన పెద్ద కేజ్ గది అది. ఆర్యా మంచాన్ని శుభ్రం చేసి ఓ పరుపును పరిచింది. నిషాను దాని మీద పడుకోబెట్టాడు.

సరిగ్గా అదే సమయంలో...

బంగళా బయట కాంపౌండ్ గేట్ ముందు కారు హారన్ వినిపించింది.

"పీప్... పీప్..."

ఆర్యా వైపు చూశాడు చతుర్వేది.

"ఎవరీ సమయంలో?"

"ఢిల్లీకి వెళ్ళిన మీ అబ్బాయి విక్రమ్ వచ్చి



నట్టున్నాడు డాక్టర్"

"విక్రమా... అయి ఉండదు. ఉదయమే ఢిల్లీ నుండి నాకు ఫోన్ చేసి మాట్లాడాడు. ముంబాయి రావడానికి ఇంకో నాలుగైదు రోజులు పడుతుందని కూడా చెప్పాడు!

"బీప్... బీప్..."

మళ్లీ బయటినుండి కారు పిలుస్తోంది. ఈ మారు దీర్ఘంగా హారన్ వినిపించింది.

"ఆర్యా... నువ్వు కేజ్ రూమ్‌కు తాళం పెట్టిరా... నేనెళ్లి చూస్తాను... మనకు పరిచయస్తులైతే నువ్వు మా ముందుకు రావొచ్చు. లేకుంటే ల్యాబ్ లోనే ఉండు"

"ఎస్ డాక్టర్"

కార్లో వచ్చింది ఎవరన్న ఆదుర్దాతో గదుల్ని దాటుకుని బంగళా ముందుకు వచ్చాడు చతుర్వేది.

వర్షపు తాకిడి అద్దాల కిటికీలపై కనిపిస్తోంది. తలుపు తీసుకుని బయటకు తొంగి చూశాడు చతుర్వేది. మేఘాలు కమ్ముకున్న ఆ సంజ చీకటిలో కాంపౌండ్ గేట్‌కు బయట ఒక కారు కనిపించింది.

గొడుగు వేసుకుని వర్షంలో కాంపౌండ్ గేటుకేసి నడిచాడు. దాని సమీపానికి వెళుతుండగానే ఆకాశంలో మెరిసిన మెరుపులో ఆ కారు ఎవరిదో తెలిసింది. నీలిరంగు కాంటెస్సా.

'ఇది జోషి కారు కదా!'

గబగబా తాళం తీసి గేటును బార్లా తెరిచి కారు పక్కకు జరిగాడు. కారు అద్దాలు కిందికి దిగటంతో డ్రైవింగ్ సీట్‌లో ఉన్న జోషి ముఖం ప్రత్యక్షమైంది. శ్రీమంతుల దర్పంతో హిందీలో మాట్లా

డాడు అతను. "ఏమిటి డాక్టర్. అప్పుడే గేట్‌కు తాళం వేసేశారు? "

"లోపల ముఖ్యమైన ఎక్స్‌పెరిమెంట్‌లో ఉన్నాం. ఎవరూ వచ్చి డిస్టర్బ్ చేయకూడదని తొందరగానే గేట్‌కు తాళం పెట్టేశా"

"నేనొచ్చి డిస్టర్బ్ చేసేశానా? "

"నో... నో... నేను ప్రారంభించిన ఈ ఎక్స్‌పెరిమెంట్ మొత్తం మీ కోసమే కదా! లోపలికి పదండి... గేటు వేసొస్తాను..."

కారు లోపలికెళ్లింది.

చతుర్వేది గేట్‌ను మూసి పోర్టికోలోకి వచ్చాడు. జోషి క్రిందికి దిగి తన బట్టతలను కర్చీఫ్‌తో తుడుచుకున్నాడు.

"రండి జోషిగారు"

ఇద్దరూ లోపలికెళ్లారు.

"ఇంకో నాలుగైదు రోజులవరకూ వర్షం ఆగేట్టులేదే"

"ముంబాయి సముద్రమైపోతుంది"

"ఆర్యా ఎక్కడ? "

"అయాం హియర్" వచ్చింది ఆర్యా.

"ఎలా ఉన్నావు? "

"ఫైన్ సార్..."

గెస్ట్‌గదిలో ఉన్న సోఫాల్లో ముక్కోణంగా కూర్చున్నారు ముగ్గురూ. జోషి కళ్లద్దాలు తీసి కోటు జేబులో పెట్టుకుంటూ దీనంగా చతుర్వేది వైపు చూశాడు.

"డాక్టర్ మీ జీన్ ట్రాన్స్‌ఫర్ ఎక్స్‌పెరిమెంట్ ఎంతవరకూ వచ్చింది? "

"సక్సెస్ రేట్ ఇప్పటికి ముప్పైపర్సెంట్ సాధించాం. వచ్చే నెలలోపు దాన్ని అరవై పర్సెంట్ చేసేస్తాం."

"అంటే వచ్చే నెలలో మా నకుల్‌ను మెదడు సమస్య నుండి కాపాడేస్తారా? "

"ష్యూర్... మీ అబ్బాయి నకుల్‌ను జీన్ ట్రాన్స్‌ఫర్ ద్వారా మెదడు సమస్య నుండి బయటపడేలా చేసి, అతణ్ణి మామూలు స్థితికి తీసుకురావడానికేగా ఇన్ని ఎక్స్‌పెరిమెంట్లు చేస్తున్నాం..."

"డాక్టర్ నాకున్న కోట్ల ఆస్తికి వాడొక్కడే వారసుడు. వాడికి మీరు నయం చేయగలిగితే కోటి రూపాయలు మీ పాదాలవద్ద పోయడానికి రెడీగా ఉన్నా"

జోషి మాటలకు చతుర్వేది నవ్వాడు.

"మిస్టర్ జోషి! మీ అబ్బాయికి నయం చేయడానికి నేను ప్రారంభించిన ఈ జీన్ ట్రాన్స్‌ఫర్ ఎక్స్‌పెరిమెంట్‌లో మొదట్లో ఎదుర్కొన్న అపజయాలు ఇప్పుడు లేవు. నా పరిశోధనలో నేను ఎన్నో ఘట్టాలను దాటి వచ్చేశాను"

"డాక్టర్ నాకో భయం"

"ఏంటది? "

"మీ పరిశోధన ముగిసేలోగా నకుల్ మెదడు సమస్య ఎక్కువైతే ఆ తర్వాత నయం చేయడానికి వీలవుతుందా? "

చతుర్వేది నవ్వాడు. "మీ అబ్బాయి నకుల్ మెదడులోని సమస్యకు కారణం... మెదడులోని తలామస్ ప్రాంతంలో టోపామైన్ అధికంగా ఉత్పత్తి కావడమే. దీన్ని సైకియాట్రిక్ మేనిఫెస్టేషన్ అని చెప్పడం కద్దు. ఆ టోపామైన్ ఉత్పత్తిని నియంత్రించగలిగితే. హి విల్ బి నార్మల్..."

"దాన్నెప్పుడు నియంత్రించగలరు ? "

"త్వరలోనే"

"డాక్టర్ మీరు చెబుతున్నది నాకు అర్థం కావడంలేదు. ప్రారంభంలో నా కొడుకును మీ వద్దకు ట్రీట్‌మెంట్ కోసం తీసుకొచ్చినప్పుడు జీన్ ట్రాన్స్‌ఫర్ పద్ధతిలో నెలలో నయం చేస్తానని చెప్పారు. ఎన్నో నెలలు గడిచిపోయాయి. ఇంకా మీరు ఎక్స్‌పెరిమెంట్స్‌లోనే ఉన్నారు. నకుల్‌కు ఎప్పుడు ట్రీట్‌మెంట్‌ను ప్రారంభిస్తారు? "

చతుర్వేది సావకాశంగా తల ఊపి నవ్వాడు. "మిస్టర్ జోషి... బయట నా గురించి తెలుసుకున్న డాక్టర్లు, నేనేదో మెదడు సామర్థ్యాన్ని పెంచేందుకు సంబంధించిన పరిశోధనలో మునిగిపోయినట్లు

భావిస్తున్నారు. బట్... నేను చేస్తున్న ఈ పరిశోధన పూర్తిగా మీ అబ్బాయికి నయం చేసేందుకే అని గ్రహించండి...

తలామస్ ప్రాంతంలో టోపామైన్ అధికంగా ఉత్పత్తి కావడాన్ని నియంత్రించగలిగే శక్తి మెదడు క్రింది భాగంలో ఉన్న పిట్యూటరీ గ్రంథికి మాత్రమే ఉంది. ఈ పిట్యూటరీ గ్రంథి ఒంట్లోని అన్ని గ్రంథులకూ చక్రవర్తిలాంటిది. ఇప్పుడు నా జీన్ ట్రాన్స్‌ఫర్ ఎక్స్‌పెరిమెంట్లు అన్నీ ఈ పిట్యూటరీ గ్రంథిలోపలే జరుగుతున్నాయి. మెయిన్ స్విచ్‌బోర్డులాగా ఉన్న ఈ గ్రంథి లోపల మరొకరి జీన్ కల్చర్ అండ్ జీన్ మానిప్యూలేషన్ సాధ్యమేనా అని చూస్తున్నాను. ఇది చాలా గొప్ప పరిశోధన. పరిశోధన కోసం ఇంతవరకూ మీ ద్వారా వచ్చిన ముగ్గురిని, మేము మోసపుచ్చి తెచ్చిన నలుగురినీ బలి చేశాం. రెండురోజుల క్రితం సోపూ, పౌడర్ అమ్మడానికి వచ్చిన 'రాగిణి' అనే అమ్మాయిని ట్రాప్‌చేసి పరిశోధన తర్వాతి ఘట్టం ప్రారంభించాను. ఆ రాగిణి వచ్చిన వేళా విశేషం.. కాసేపటి క్రితం మరొక పక్షి కూడా వచ్చి చిక్కుకుంది."

జోషి నిటారుగా కూర్చున్నాడు.

"ఎవరది? "

"పేరు నిషా. పత్రికా విలేఖరి. నన్ను ఇంటర్వ్యూ చేయడానికొచ్చి ఇక్కడి రహస్యాలపై కన్నేసింది. ప్రస్తుతం కేజ్ రూమ్‌లో మత్తుగా పడుంది. రాగిణి యొక్క పిట్యూటరీ గ్రంథిలోపల నేను చేయబోయే జీన్ మ్యానిపులేషన్ సరిగ్గా వర్క్ అవుట్ కానిపక్షంలో.. నిషాను ఉపయోగించుకుంటా"

చతుర్వేది చేతుల్ని పట్టుకున్నాడు జోషి. "డాక్టర్ మీరు తొందరగా ఏదో ఒకటి చేసి నా కొడుకు నకుల్‌ను మామూలు స్థితికి తీసుకురావాలి. దానికోసం ఎంతైనా..."

జోషి మాట్లాడే కొద్దీ అంతవరకూ మౌనంగా గోడవారగా నిలబడున్న ఆర్యా చప్పున చతుర్వేది పక్కకు వంగింది. ఆమె గొంతులో తడబాటు కనిపించింది.

"డా... డాక్టర్ మాట్లాడకండి... మళ్లీ ఇంకో ప్రమాదం ముంచుకొస్తోంది"

"ఏ.. ఏంటది? "

"బయట కుడిపక్కనున్న అద్దాల కిటికీ వద్ద ఎవరో నిలబడున్నారు..."

"ఎ... ఎవరు? "

"తె... తెలియడం లేదు. ఇప్పుడు ఐదు క్షణాల క్రితం మెరుపు మెరిసినప్పుడు, ఆ వెలుగులో ఒక ఆకారం కనిపించింది"

జోషి, చతుర్వేది ముఖాలు చిట్లించారు.

"ఆడా... మగా...? "

"వెంటనే గుర్తించలేకపోయా. మెరుపు వెలుగులో ఓ క్షణమే చూశాను. స్త్రీ కావచ్చు. కొప్పు పెట్టుకున్నట్లు అనిపించింది"

> **కొత్తగాలి...**
>
> **మనసు బావుల్లోని**
> **అనురాగపు ఊటల్ని**
> **డబ్బు పంపు**
> **వేగంగా తోడేస్తోంది**
>
> **- అరుణ్‌కుమార్ ఆలూరి,**
> అభంగపట్నం, నిజామాబాద్

"సరే, లోపలికి వెళ్లి టార్చ్‌లైట్‌నూ, రివాల్వర్‌నూ తీసుకురా..."

ఆర్యా లోపలికెళ్లింది. చతుర్వేదీ, జోషీలిద్దరూ కుడి పక్కనున్న కిటికీకేసి తిరిగి చూశారు. కొక్కీ తగిలించని ఆ అద్దాల కిటికీ వర్షపు గాలికి మెల్లగా ఊగుతోంది.

డాక్టర్ మెల్లగా పైకి లేచి కిటికీని సమీపించి బయటికి చూశాడు. గాలితోపాటు వర్షం విజృంభిస్తోంది. చిన్న మెరుపొకటి వచ్చినా అక్కడ ఎవరూ కనబడలేదు.

ఆర్యా లోపలి నుండి టార్చ్‌లైటూ, రివా

ల్వర్‌నూ తీసుకొచ్చి ఇచ్చింది.

"ఆర్యా"

"డాక్టర్"

"నువ్వు నిజంగా ఆకారాన్ని చూశావా? "

"చూశాను డాక్టర్"

జోషి పక్కకొచ్చాడు. అతడి కంఠంలో భయం తొంగిచూస్తోంది.

"డాక్టర్, బయటికెళ్ళిచూస్తారా? "

"ఎస్! ఇంట్లో పాము ఉందని అనుమాన మొచ్చాక స్థిమితంగా ఉండగలమా? "

చతుర్వేది రెయిన్‌కోటు ధరించి ఓ చేత్తో టార్చ్‌నూ మరో చేతిలో రివాల్వర్ పట్టుకొని గుమ్మం తలుపు తీసుకుని బయటికొచ్చాడు. చీకట్లో వర్షం జోరున కురుస్తోంది.

★ ★ ★

గీతాంబరి మనసులో ఆనంద తరంగాలు ఎగసి పడుతుండగా మాసిలామణి నుండి రిసీవర్‌ను అందుకుని చెవికి ఆనించుకుంది.

"హలో..."

అటువైపు మౌనం...

"హలో..."

రమణి పొంగుకొస్తున్న దుఃఖాన్ని ఆపు కుంటూ హరిహరన్ మాట్లాడుతున్నట్టే "గీతాంబరీ" అని మృదువుగా పిలిచాడు. గీతాంబరి కోపం నటిస్తూ అంది.

"ఇప్పటికి పెళ్లాం గుర్తుకొచ్చిందన్నమాట"

"సారీ"

"ఏంటి సారీ... నిన్నరాత్రి ఎందుకు ఫోన్ చెయ్యలేదు? "

"అదీ... అదీ..."

"ఏ అబద్ధం చెప్పాలా అని ఆలోచనా? "

"కా... కాదు.. గీతాంబరీ ముంబయిలో ఒకటే వర్షం... హోటల్ టెలిఫోన్ పని చె... చెయ్యలేదు..."

"అది సరే... మీ గొంతు ఏంటీ వణుకు తున్నట్టుంది? "

"వర్షంలో కొంచెం తడిశాను. అందుకే.."

"అడగటం మరిచేపోయాను. ఇవ్వాళ ఉదయం మీరు ఫ్రాంక్‌ఫర్ట్ బయలుదేరి వెళ్లాలే. ఎందుకు వెళ్లలేదు? "

"అదీ.. అదీ.. వెదర్ కండీషన్ బాగాలే దని ఫ్లైట్ పదిగంటలు ఆలస్యం..."

"అంటే సాయంత్రం ఐదు గంటల తర్వా తే ఫ్లైట్ బయలుదేరుతుందన్న మాట!"

"ఔను... సాయంత్రం ఫ్లైట్ ఎక్కడానికి ముందు మళ్లీ నీకు ఫోన్ చేస్తాను..."

"ఏం ఇప్పుడింకా ఓ ఐదు నిమిషాలు మాట్లాడొచ్చు కదా? "

"బిజినెస్ విషయంగా ఒకరిని కలవడా నికి బయటికి వెళ్లాల్సి ఉంది"

"వర్షం పడుతోందని చెప్పారు? "

"టాక్సీలోనేగా వెళతాను"

"ఊఁ... ఇవ్వాళ మీరేం బాగాలేదు"

"మామూలుగా మీరు మాట్లాడే మాటల్లో నాకు నచ్చిన కొన్ని మాటలుంటాయి. అవి ఇవ్వాళ మిస్సింగ్.."

"గీతాంబరీ నాకు ఒంట్లో బాగాలేదు.. లైట్‌గా జ్వరం వచ్చేట్టుంది.."

"మాత్ర వేసుకున్నారా? "

"ఊఁ... ఇప్పుడే వేసుకున్నాను!"

"ఏం మాత్ర వేసుకున్నారు? "

"కాల్‌పాల్..."

"సరిపోదు..."

"మరి? "

"రిసీవర్‌ను చెవికి గట్టిగా ఆనించి పట్టు కోండి... నేనొక మాత్ర ఇస్తాను. జలుబూ, జ్వరం అన్నీ ఎగిరిపోతాయి"

అటువైపు ఉన్న రమణికి అర్థమైపో యింది. భర్త అని భావిస్తూ వదిన ముద్దు ఇవ్వబోతోంది. వెంటనే మాట మార్చాడు.

"గీతాంబరీ నీ గొంతు వినగానే సగం జ్వరం ఎగిరిపోయింది. రమణి పక్కనుంటే రిసీవర్‌ను వాడి చేతికివ్వు... ఒక ముఖ్య మైన విషయం మాట్లాడాలి.."

"నాతో మాట్లాడేప్పుడే మీకు తమ్ముడూ, వ్యాపారమూ, గుర్తుకొస్తాయి కాబోలు"

"ప్లీజ్ గీతాంబరీ రమణిని పిలువ్"

"మీ తమ్ముడు రాత్రి కొచ్చి వెళ్లాడు.."

"దేనికీ? "

"బిజినెస్ విషయంగా..."

"సరే నాన్న చేతికి రిసీవర్ ఇవ్వు.."

"నేనుతప్ప అందరితోనూ మాట్లాడేందుకు తొందరపడుతున్నారు. ముంబాయి వెళ్లాక మీరు బాగా మారిపోయారు."

"గీతాంబరీ బిజినెస్ టెన్షన్‌లో ఉన్నాను. నాన్న చేతికి రిసీవర్ ఇవ్వు.. రమణి ఎందుకు కొచ్చికి వెళ్లాడో అడగాలి.."

"సరే ఆయనతోనే మాట్లాడండి" అంటూ పక్క గదిలోకి తొంగిచూసి "మామయ్యా! మీ అబ్బాయి మీతో మాట్లాడాలట.."

మాసిలామణి బయటకొచ్చి రిసీవర్‌ను అందుకోగానే, తిలకం ఉన్న గదికేసి సణుగుతూ వెళ్లింది గీతాంబరి.

గీతాంబరి వెళ్లగానే రిసీవర్‌ను చెవికి ఆనించుకున్నాడు మాసిలామణి.

"నేను... నాన్నను మాట్లాడుతున్నాను."

"నాన్నా... వదినకు నిజం చెప్పేయండి నాన్నా... వదినతో అన్నయ్యలా మాట్లాడాలంటే ఒళ్లంతా సిగ్గుతో చచ్చిపోతున్నా. రేపు ఈ విషయం తెలిస్తే వదిన ముఖం ఎలా సూటిగా చూడగలను నాన్నా? "

"ఆవేశపడ్డానికి ఇది సమయం కాదు రమణీ... అన్నీ అనుకున్నట్టే జరగనీ..."

"నాన్నా...!"

"మరింకేం మాట్లాడకు. అక్కడ పనులన్నీ పూర్తయ్యాక సాయంత్రం మళ్లీ నాకు ఫోన్ చెయి... ఇంటికి చెయ్యకు కంపెనీకి చెయి.. నీ ఫోన్‌కోసం అక్కడ ఎదురు చూస్తుంటాను."

"స... సరే... నాన్నా.." రమణి అలా అనగానే మాసిలామణి రిసీవర్‌ను పెట్టేసి, పై గుడ్డను నోటికి అడ్డం పెట్టుకుని దుఃఖాన్ని ఆపుకున్నాడు.

ఫోన్‌లో మాట్లాడి "అత్తయ్యా" అంటూ తిలకం ఉన్న గదిలోకి వెళ్లింది గీతాంబరి.

## అంతలేదు!

ఓ వేసవి మధ్యాహ్నం రాజాజీ మొదటి తరగతి పెట్టెలో రైలు ప్రయాణం చేస్తున్నారు. ఎండ బాగా కాస్తోంది. అందులోనే ఒక తెల్ల దొర కూడా ఉన్నాడు. అతనికి బాగా చెమట పోస్తూవుంది.



కాస్సేపు తర్వాత 'ఈరోజు ఎండ విపరీతంగా ఉంది' అన్నాడు దొర రాజాజీతో.

'అంత ఎక్కువగా లేదు' అన్నారు రాజాజీ.

'అంత ఎక్కువగా లేదా? ఏమిటి మీరంటున్నది? ' అన్నాడా ఆంగ్లేయుడు ఆశ్చర్యంగా.

"ఈ దేశంలోకి జొరబడిన తెల్లవాళ్లను తరిమేసేంత ఎక్కువగా ఎండలు లేవు కదా? " అన్నారాయన నవ్వుతూ.

కిటికీ పక్క అటు తిరిగి నిలబడి శబ్దం రాకుండా ఏడుస్తున్న తిలకం గబగబ కళ్లను తుడుచుకుని, పెదాలపై నవ్వును పులుముకుంటూ కోడలికేసి చూసింది.

"రామ్మా"

తిలకం ముఖంకేసి చూసిన గీతాంబరి "ఏంటి అత్తయ్యా! కళ్లంతా ఎర్రబడి ఉన్నాయి.. ఏడ్చారా? "

"ఛఛ.. ఏంలేదు పాడు తలనొప్పి చంపుతోంది. వెలుగు చూస్తే కళ్లు ఎర్రబడి నీళ్లు కారుతున్నాయి."

"మాత్ర వేసుకున్నారా అత్తయ్యా? "

"ఊc.. ఇప్పుడే వేసుకున్నాను. కాసేపు పడుకుంటే సరిపోతుంది. ఔను, హరితో నువ్వు ఫోన్‌లో మాట్లాడినట్టున్నావ్? "

"అవును అత్తయ్యా.. ఎందుకు మాట్టా

డానా అనిపిస్తోంది...!

ఏం?

"ఏదో బిజినెస్ టెన్షన్‌లో ఉన్నట్టున్నారు. మామూలుగా నాతో మాట్టాడినట్టు మాట్లా డలేదు. ఏదో యాంత్రికంగా మాట్లాడి నాన్న చేతికి ఫోన్ ఇవ్వమన్నారు..."

కడుపులో అగ్గి రాజుకున్నట్టు అనిపిం చింది తిలకానికి. నోరు తెరిచి ఏదైనా మాట్లాడ్డం మొదలు పెడితే అది ఏడుపుగా మారిపోతుందేమోనన్న భయంతో బలవం తంగా నవ్వు తెచ్చుకుంది.

గీతాంబరి తన కోపాన్ని కొనసాగిం చింది. "సాయంత్రం మళ్ళీ ఫోన్ చేస్తారట. చెయ్యనీండి, నేను మాట్లాడను... జర్మనీ నుండి చేసినా మాట్లాడదలచుకోలేదు"

"ఎందుకమ్మా, అలా అంటున్నావ్?"

"లేకపోతే ఏంటత్తయ్యా... ఏదో ఇష్టం లేని భార్యతో మాట్లాడినట్లు అంటీ ముట్ట నట్టు మాట్లాడుతున్నారు... జర్మనీ నుండి రానీ, అప్పుడు చెబుతాను..."

"వాణ్ణెందుకమ్మా తిడుతున్నావు?"

"మీకు కోపం వస్తున్నట్టుంది? బిడ్డను తిడితే ఊరుకుంటారా మీరు?" గీతాంబరి అంటుండగానే పనిమనిషి లోపలికొచ్చింది.

"ఏం వసంతీ, ఏం కావాలీ?"

"అమ్మగారూ... ఎదురింటి బంగళా నుండి శెట్టెమ్మా, వాళ్ళ కూతురూ వచ్చారు. సోఫాలో కూర్చోపెట్టాను"

తిలకం, గీతాంబరి ఇద్దరూ గదిలో నుండి హాల్లోకొచ్చారు. ఒంటినిండా నగలు దిగేసుకుని కూర్చుని ఉన్న వాళ్ళను చూసి నవ్వుతూ ఆహ్వానించారు.

శెట్టెమ్మ లేచి నిలబడి కుంకుమభరిణెను చాపి "కుంకుమ తీసుకోండి" అంది.

"ఏంటీ విశేషం?" అని అడుగుతూ కుడి చేతి ఉంగరపు వేలితో కుంకుమను తీసు కుని నుదుట దిద్దుకుంది గీతాంబరి.

"రేపు ఉదయం తొమ్మిదింటికి మా ఇంట్లో సుమంగళి పూజ. అత్తయ్యను వెంట బెట్టుకుని వచ్చేసేయ్ గీతాంబరీ"

"ఏంటమ్మా... ఉన్నట్టుండి సుమంగళి పూజ పెట్టుకున్నారు. ఇది నోముల మాసం కూడా కాదే?"

"తెలుసు! ఇది నా కూతురి కోసం. దీని జాతకంలో ఏదో మాంగల్య దోషం ఉందట. ఆ దోష నివారణ కోసం సుమం గళి పూజ చెయ్యాలిట..."

"మంచిదేగా"

గీతాంబరి మాత్రమే బదులిస్తున్న విష యాన్ని గమనించిన శెట్టెమ్మ అడిగింది "ఏం తిలకం, ఒంట్లో బాగోలేదా?"

"అత్తయ్యకు తలనొప్పి"

"పూజకు తప్పకుండా రండి. మధ్యాహ్నం భోజనం అక్కడే. నూటెనిమిది మంది ము త్తయిదువలకు జాకెట్ ముక్కలూ, పళ్ళూ, పూలు ఇవ్వాలనుకుంటున్నాం..."

గీతాంబరి నవ్వింది. "తప్పకుండా అత్తయ్య పూజకొస్తుంది. ఆమె చేతికే నా కోటాను కూడా ఇచ్చేయండి..."

"నువ్వూ రామ్మా..."

"రాలేనండీ. పదడుగులు నడిస్తేనే ఆయాసం.. దానికి తోడు ఓ రెండు నిమి షాలు కూడా కూర్చోలేకపోతున్నాను. నా బదులుగా అత్తయ్య వస్తుందిగా."

"డెలివరీ డేట్ ఎప్పుడు?"

## కొత్తగాలి...

**మనసుకు మనసు కలిస్తే**
**మావిడాకులు**
**మాటకి మాట కలిస్తే**
**మా 'విడాకులు'**

— జి. శివకృష్ణ, హైదరాబాద్

"ఇంకా ఇరవై రోజులుంది..."

"కడుపును చూస్తుంటే అన్ని రోజులు పట్టేట్టు లేదే. నా మనసుకు ఏమనిపిస్తోందో చెప్పమంటావా? "

"చెప్పండమ్మా..."

"ఇంకో రెండ్రోజుల్లో కాన్పు రావచ్చు."

"డాక్టరమ్మ అలా చెప్పలేదే? "

"ఈ కాలం డాక్టర్లకు ఏం తెలుసు? నువ్వు నిలబడ్డ తీరును చూస్తుంటేనే నాకు స్పష్టంగా అర్థమైపోతోంది. రేపటిలోగా నువ్వు ఆస్పత్రిలో ఉంటావ్ చూడూ..."

మనసులో అగ్ని పర్వతాలు బద్దలవుతున్నా దాన్ని బహిర్గతం చెయ్యకుండా, ఓ బలవంతపు చిరునవ్వుతో శెట్టెమ్మతో అంది తిలకం. "మీ నోటి వాక్కు ఫలించి తొందరగానే ప్రసవం కానీ..."

4



**చీకట్లో** కుంభవృష్టిగా కురుస్తున్న వర్షంలో రెయిన్ కోటు ధరించి డాక్టర్ చతుర్వేది ఓ చేత్తో టార్చ్‌లైటునూ మరో చేత్తో రివాల్వర్‌నూ జాగ్రత్తగా పట్టుకుని ముందుకు నడిచాడు.

బూటు కాళ్ళు నీళ్ళలో బలంగా పడుతుండటంతో... నీళ్ళు చెదిరి పక్కలకు పడుతున్నాయి. మనసులో ఎన్నో అనుమానాలు.

"ఆర్యా, నిజంగా ఆ ఆకారాన్ని చూసిందా? లేదా, భ్రమా? ... ఆర్యా నీడల్ని చూసి మోసపోయే రకం కాదు... ఆమె చూపులు, ఆలోచనలు, నిర్ణయాలు అన్నీ సరిగ్గానే ఉంటాయి.!"

టార్చ్‌లైట్ వెలుగును ప్రసరింపచేస్తూ బంగళా వెనకున్న గోడ పక్కగా నడిచాడు. అక్కడ ఎవరూ కనిపించలేదు.

క్రోటన్ మొక్కలన్నీ తలవాల్చేసి ఉన్న ప్రాంతంలోకి వచ్చి నిలబడ్డాడు. జోరున కురుస్తున్న వర్షం శబ్దం మాత్రం హోరుమంటూ వినిపిస్తోంది. కాంపౌండ్ గోడ పక్కన పదునుగా చెక్కిన పెన్సిళ్ళులాగా నిలబడున్న సైప్రస్ చెట్లు గాలికి తలలూపుతున్నాయి. 'కిటికీ పక్కన కనిపించిన ఆకారం స్త్రీ అని ఆర్యా చెప్పింది, ఎవరై ఉంటారు? నిషాను వెదుక్కుంటూ ఇంకెవరైనా ఇక్కడికొచ్చుంటారా? ...'

భయం గుండె వేగాన్ని పెంచింది. వాన నీళ్ళు ముఖంపై కారుతుంటే అటూ ఇటూ పరికించి చూశాడు. బంగళా కుడి పక్కన చివర ఆజ్‌బెస్టాస్ కప్పుతో పనికిరాని వస్తువులను వేసి ఉంచిన గది కనిపించింది.

'అక్కడికెళ్ళి చూద్దామా? ' భయంతో కాళ్ళు వెనక్కులాగుతున్నా, చేతిలో రివాల్వర్ ఉందన్న ధైర్యంతో ముందుకు నడిచాడు. టార్చ్ వెలుగుకూ, బూట్ల నడక శబ్దానికీ చీకట్లో కప్పలు ఎగిరెగిరి పక్కకు దూకుతున్నాయి.

రెండు నిమిషాల నడక అనంతరం ఆజ్‌బెస్టాస్ గది వద్దకు చేరుకున్నాడు. గాలికి పాత చెక్క తలుపు కిర్రు కిర్రుమంటు ఊగుతుంటే చతుర్వేది కాలితో తలుపును బార్లా తెరిచి టార్చ్‌లైట్ లోపలికి వేశాడు.

తుప్పు పట్టిన డ్రమ్ము, విరిగిపోయిన ఆమ్లజాడీలు, పాడైపోయిన ఓ గీజర్, కాళ్ళిరిగిన కుర్చీ నొక్కుపోయిన సింటెక్స్ గోతాలు, స్పాంజ్ బయట పడ్డ సోఫాసెట్ వగైరాలు కన్పించాయి.

'లోపలికెళ్ళి చూద్దామా? ' అని ఆలోచిస్తుండగానే...

"డబ్... డబ్..." మంటూ వెనక నుండి అడుగుల శబ్దం వినిపించగానే అదిరిపడి వెనక్కు తిరిగి చూశాడు. చీకట్లో ఆర్యా వస్తూ కనిపించింది. వేగంగా వస్తోంది.

"డాక్టర్" పక్కకొచ్చి నిలబడింది.

"ఏంటి ఆర్యా? "

"నేను చూసిన ఆ ఆకారం ప్రస్తుతం బయటలేదు."

"మరి? "

"బంగళా లోపల... అదీ ల్యాబ్ సెక్షన్ లోపల ఉంది..."

"ఆర్యా... నువ్వేమంటున్నావ్? "

"నే చెప్పలే.. ఆ ఆకారం లోపలున్న విషయాన్ని డెసిబల్ డిటెక్టర్ చెప్పేసింది."

చతుర్వేది ముఖం అంత చీకట్లోనూ క్రూరంగా మారటం కనిపించింది. ఆదుర్దాగా అడిగాడు. "ల్యాబ్ సెక్షన్ తలుపును బయట నుండి లాక్ చేశావా? "

"చేసేశాను... ఇప్పుడు పక్షి మన చేతిలో చిక్కుకుంది..."

"రా... వెళ్ళి చూద్దాం..."

ఇద్దరూ గబగబ బంగళావైపు వెళ్ళారు. జోషి పోర్టికోలో ఆత్రుతగా వాళ్ళకోసం ఎదురుచూస్తున్నాడు.

"డాక్టర్... ఎనీథింగ్ సీరియస్? "

"నో... నో... ఓ చిన్న అంతరాయం అంతే. ఇవ్వాళ కాస్త యాక్టివ్‌గా లేను..."

"వచ్చింది ఎవరు? "

"తెలియటంలేదు. మేం ఈ వ్యవహారాన్ని చక్కదిద్దుకుంటాం. మిస్టర్ జోషీ! ఇక మీరు బయలుదేరండి... రెండు రోజుల తర్వాత రండి.. మీకో శుభవార్త చెబుతా"

జోషి కాస్త కలవరపాటుగా కారు తీసుకుని వెళ్ళిపోగా చతుర్వేది కాంపౌండ్ గేట్‌ను లోపలి వైపు తాళం పెట్టి వచ్చాడు.

ఆర్యా ఎదురు చూస్తోంది.

"రా... పక్షిని పడదాం..."

జాగ్రత్తగా లోపలికి వెళ్ళారు.

ల్యాబ్ సెక్షన్ వచ్చింది. ఆర్యా భయంతో గుటకలు మింగుతూ అంది "డాక్టర్ నిషా ఎవరికో సమాచారం ఇచ్చి వచ్చినట్టుంది. ఆమె మన బంగళాలో ఉందో లేదో చూడ్డానికెవరైనా వచ్చారేమో"

"వచ్చిన ఆ ఎక్స్ మన మాటలను ఓవర్ హియర్ చేసుండొచ్చు కదా? "

"కావచ్చు.. నిజాలను కనిపెట్టేందుకు లోపలికొచ్చిన ఆ ఎక్స్‌ను బయటికి వదిలితే పోలీసులు ఏ క్షణాన్నైనా ఇక్కడికి రావచ్చు.."

"ఆ పరిస్థితి మనకెప్పటికీ రాదు. లాక్‌ను ఓపెన్ చెయ్."

"డా...క్ట...ర్.."

"ఊం..."

"లోపలున్న ఆ ఎక్స్ చేతిలో ఏదైనా ఆయుధం ఉంటే? "

"భయపడకు... లాక్ ఓపెన్ చెయ్."

వణుకుతున్న చేత్తో ఆర్యా తాళం తీసి తలుపు మెల్లగా తెరిచింది. అంతవరకూ కొన ఊపిరితో ఉన్న కరెంట్ ఆ క్షణంలో చచ్చి ఊరుకుంది. బంగళాలో ఇప్పుడు గాఢాంధకారం...

డాక్టర్ చతుర్వేది, ఆర్యా ఆ కటిక చీకట్లో ముందుకు వెళ్ళలేక నిలబడిపోయారు. కొన్ని క్షణాలు నిలబడ్డాక ఆర్యా సన్నటి గొంతుతో "డాక్టర్" అంది.

"ఊం"

"సమయానికి మన జనరేటర్ కూడా పనిచేయటంలేదు. రెండురోజుల క్రితం జనరేటర్‌ను బాగుచేయటానికొచ్చిన వ్యక్తిని వారం తర్వాత రమ్మనటం ఎంత పొరపాటో ఇప్పుడు అర్థమవుతోంది."

"ఆర్యా! అవన్నీ ఇప్పుడు మాట్లాడుతూ కూర్చోవటానికి సమయం లేదు. టార్చ్ వేసుకుని లోపలికెళ్ళి చూద్దమే."

"వొ...వొద్దు... డాక్టర్..."

"వొద్దా... ఏం? "

## అభిమాన సంఘాల ఆరాధ్య రచయిత


రాజేష్ కుమార్

ప్రారంభంలో ఉపాధ్యాయులుగా, సేల్స్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసిన రాజేష్ కుమార్ 1980 నుంచి ప్రొఫెషనల్ రైటర్‌గా మారి వెయ్యికి పైగా నవలలు రాశారు. పదిహేను వందల కథలు, పాతిక రేడియో నాటకాలు రాశారు. ఆయన సీరియల్స్ ప్రచురించని పత్రిక లేదంటే అతిశయోక్తి కాదు. 'క్రైమ్ నావెల్' మాసపత్రికకు వీరి డిటెక్టివ్ నవలలే ఆధారం. తమిళనాట సూపర్ స్టార్ రజనీకాంత్‌లాగే అత్యధిక అభిమాన సంఘాలు కలిగిన ఏకైక రచయిత రాజేష్ కుమార్.

తన వెయ్యో నవల 'డైనమైట్' విడుదల సందర్భంగా ముఖ్యమంత్రి కరుణానిధి ప్రశంసిస్తూ ఉత్తరం రాయటం మరచిపోలేని సంఘటన అన్నారాయన. ప్రస్తుతం కలైంజ్ఞర్ టీవీలో 'విచారణై' పేరుతో వస్తున్న వీరి సీరియల్ 100 ఎపిసోడ్లు పూర్తి చేసుకోవటమే కాక దానికి మంచి టి.ఆర్.పి రేటింగ్స్ రావడం సంతోషంగా ఉందంటున్నారు. ఎంతో పేరుప్రఖ్యాతులున్న 'చతుర'లో తన రెండో నవల రావడంపై ఆయన ఎంతో ఆనందం వ్యక్తంచేస్తున్నారు.

చిరునామా: 23, యమున స్ట్రీట్, క్యూరియో గార్డెన్ అవెన్యూ, భారతీయార్ యూనివర్సిటీ పోస్ట్, కోయంబత్తూర్-641046

"ల్యాబ్‌లో ఎవరో ఉన్నారన్న విషయం స్పష్టమైపోయింది. టార్చ్ వెలుగును నమ్ముకుని మనం లోపలికెళ్ళడం చాలా రిస్క్. లోపలున్న ఆ ఎక్స్ చేతిలో ఏదైనా పదునైన ఆయుధం ఉంటే ఇక మీకూ నాకూ కపాల మోక్షమే"

"అయితే ఇప్పుడు ఏం చేద్దామంటావ్? "

"కరెంట్ వచ్చేంతవరకూ చూద్దాం."

డాక్టర్ కనీసస్థాయిలో కోప్పడ్డాడు.

"ఆర్యా, తెలివిలేకుండా మాట్లాడకు. పోయిన కరెంట్ ఎప్పుడొస్తుందో తెలియదు. ఇది వర్షాకాలం. రాత్రంతా కూడా రాకుండా ఉండే అవకాశముంది. ల్యాబ్‌లోకి ప్రవేశించిన ఆ ఎక్స్ దృష్టి టెలిఫోన్ మీద పడిందంటే పోలీసులకు ఫోన్ చెయ్యడానికి ప్రయత్నించవచ్చు.."

ఆర్యాకు భయం పట్టుకుంది. "నేను ఆ కోణంలో ఆలోచించలేదు డాక్టర్..."

ఇప్పుడు కరెంట్ పోయి ల్యాబ్‌లో చీకటిగా ఉండటం ఒక రకంగా మనకు అనుకూలించే విషయమే. లోపలికి ప్రవేశిం

## అపరాధ పరిశోధనలతో పఠనాభిరుచి


జిల్లేళ్ళ బాలాజీ

యువతలో పఠనాభిరుచి పెంపొందించటానికి సస్పెన్స్, థ్రిల్లర్లు, అపరాధ పరిశోధన రచనలు రావాలన్నది నా అభిప్రాయం. మొదట వాళ్ళలో పఠనాసక్తిని పెంచితే తర్వాత మంచి సాహిత్యం వైపు వాళ్ళే వెళ్తారు. ఇప్పటివరకూ నేను క్లాసికల్ రైటర్ జయకాంతన్ నవలలతో పాటు మాస్ రైటర్ రాజేష్‌కుమార్ నవలలు ఆరింటిని తెలుగులోకి అనువదించగా అందులో మూడు నవలలు 'చతుర'లోనే ప్రచురింపబడటం నాకు గర్వకారణం.

నా పాతికేళ్ళ రచనా ప్రస్థానంలో 115కు పైగా కథలు, కొంత బాలసాహిత్యం, కొన్ని మినీ కవితలు వివిధ పత్రికలలో అచ్చయ్యాయి. అర డజను కథలకు బహుమతులందుకున్నాను. ఆర్ద్రతతో కూడిన రచనలు చేయడమన్నా, చదవడమన్నా ఎంతో ఇష్టం.

చిరునామా: ఇం.నెం.5-17, టెలిఫోన్ కాలనీ, లింగేశ్వరనగర్, బైరాగిపట్టెడ, తిరుపతి-517501

చిన ఆ ఎక్స్ చూపుకు ల్యాబ్‌లో ఏమీ కనిపించే అవకాశాలు లేవు. అవన్నీ కనిపించేలోపే మనం ఆ ఎక్స్‌ను పట్టుకోవాలి. నువ్వు టార్చ్‌ను వేసుకుని ముందు వెళ్ళు. నేను రివాల్వర్‌తో నీ వెనుకే వస్తాను..."

"డా...క్ట...ర్"

"భయపడకు ఆర్యా... ఇలాంటి వేళల్లోనే ధైర్యంగా ఉండాలి. ల్యాబ్ మనకు బాగా పరిచయమైన ప్రదేశం. ఆ ఎక్స్‌కు అర్థం కాని చోటు. తొందరగానే పట్టుకోవచ్చు"

లోపలికి వెళ్ళారిద్దరూ.

ల్యాబంతా కటిక చీకటిగా ఉంది.

చతుర్వేది ల్యాబ్ తలుపుకు లోపల వైపు గడియపెట్టి తాళం పెట్టాడు. చెవిని జేబులో భద్రంగా దాచుకుంటూ సన్నటిగొంతుతో అన్నాడు.

"ఆర్యా, టార్చ్‌వెయ్..."

టార్చ్ బటన్‌ను నొక్కింది ఆర్యా. సన్నని వెలుగు గదిలో ప్రసరించింది.

"ముందు నడువ్..."

ఆర్యా మెల్లగా ముందుకు కదిలింది. వెలుగు ల్యాబ్ గోడ పక్కగా పడింది. చతుర్వేది చేతిలోని రివాల్వర్ తన ఒంటికన్నుతో అటుఇటు చూస్తోంది.

"ఆ... ఆర్యా..."

'డాక్టర్..."

"టార్చ్ వెలుగును నాలుగు వైపులా తిప్పు... ముఖ్యంగా బీరువా వెనక వైపు"

టార్చ్ వెలుగు అటు ఇటు కదిలి ల్యాబ్‌నంతా కలయతిరిగింది. ఇద్దరూ జాగ్రత్తగా చూసుకుంటూ నడిచారు. బయట వర్షం కురుస్తున్న శబ్దం పాము బుసలా వినిపిస్తోంది. ల్యాబ్ మొదటి భాగాన్ని దాటి రెండో భాగంలోకి రాగానే ఆర్యా చెమట పట్టిన ముఖంతో చతుర్వేది వైపు చూసింది.

"డాక్టర్..."

"ఊc..."

"ముందు టెలిఫోన్ ఉన్న గదికి వెళ్ళి ఫోన్ కనెక్షన్ పీకేస్తే ఎలా ఉంటుంది?"

"నేనూ అదే అనుకుంటున్నాను... పద వెళదాం..." నడుస్తున్న దిశను మార్చారు. టార్చ్ వెలుగు నేలమీద పడుతోంది.

"డాక్టర్, రివాల్వర్‌ను పట్టుకోండి... ఆ ఆకారాన్ని చూడగానే... క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా కాల్చేయండి. అది ఎవరైనా సరే... ఆలోచించకండి..."

చతుర్వేది అంత ప్రమాదకర పరిస్థితిలోనూ చిరునవ్వు నవ్వాడు.

"నేను ఆలోచనలో ఉన్నా ఈ రివాల్వర్ ఆలోచించదు ఆర్యా... దానికి షూట్ అట్ సైట్ ఆర్డరిచ్చి చాలాసేపయ్యింది."

టెలిఫోన్ ఉన్న గది వద్దకు వచ్చారిద్దరూ. తలుపు మూసి ఉంది. ఆర్యా తలుపు తొయ్యడానికి ప్రయత్నించగానే, టార్చ్ వెలుగు అప్రయత్నంగా పదడుగుల దూరంలో నిలబెట్టి ఉన్న షెల్ఫ్ కర్టెన్ మీదకు ప్రసరించటంతో, ఆమె చూపులు అక్కడే చిక్కుబడిపోయాయి.

అలాగే కదలకుండా నిలబడింది.

చతుర్వేది ఆమె భుజాన్ని తట్టాడు.

"ఏంటి ఆర్యా... తలుపు తెరవకుండా అలాగే నిలబడ్డావ్?"

ఆర్యా చప్పున గొంతు తగ్గించింది. ఆయనకు మాత్రం వినబడేలా చెప్పింది.

"ష్‌ష్..ఎక్స్ ఉన్న చోటును కనిపెట్టేను"

"ఎక్కడ?"

"కుడిపక్కనున్న షెల్ఫ్ కర్టెన్ వెనక"

అంటూ చేతిలోని టార్చ్ వెలుగును అటు పక్కకు తిప్పింది.

చతుర్వేది చూపులు అటు తిరిగాయి. అక్కడ కర్టెన్ క్రిందుగా ఒక జత పాదాలు కనిపించాయి.

★ ★ ★

మాసిలామణి సాయంత్రం ఆరు గంటలకు పైన కంపెనీకి వెళ్ళి టెలిఫోన్ పక్కనే అదురుతున్న గుండెతో ఎదురుచూడసా





గాడు. ఆయన పక్కనే ఏడ్చిఏడ్చి ఉబ్బిన కళ్ళతో కూర్చొని ఉంది తిలకం.

సరిగ్గా ఆరున్నరకు ఫోన్ మోగింది. అదురుతున్న చేత్తో రిసీవర్‌ను తీశాడు మాసిలామణి.

"హలో" అటు నుండి రమణి గొంతు.

"ఏ.. ఏమైంది... ర...రమణి..."

"పోస్టుమార్టం పూర్తయింది. అన్నయ్య బాడీని స్వాధీనం చేసుకున్నాం నాన్నా. ఇంకో పదినిమిషాల్లో ఓ వ్యాన్‌లో 'కరెంటు కాష్టానికి' తీసుకెళ్ళిపోతాం..."

మాసిలామణికి దుఃఖం పొంగుకొచ్చింది.

"హ...హ...హరీ..."

"నా... నాన్నా..."

"ఊఁ..."

"మన ఆచారం ప్రకారం దహన క్రియలు ఏమైనా జరపాలా అని పోలీసులు అడిగారు. అలా ఏమైనా ఉంటే చెప్పండి నాన్నా చేసేద్దాం..."

"ఏం చేసి ఏం ప్రయోజనం?" నిరాశగా నిట్టూర్చాడు మాసిలామణి. తర్వాత గద్గదమైన కంఠంతో చెప్పాడు. "అస్థిని మాత్రం ఒక చిన్న చెంబులో తీసుకొచ్చెయ్ రమణీ. కావేరీకి తీసుకెళ్ళి నిమజ్జనం చేద్దాం"

"నాన్నా... వొదిన ఎలా ఉంది?"

"భర్త చనిపోయిన విషయం తెలియకుండా, ఫోన్లో హరి సరిగ్గా మాట్లాడలేదని సణుక్కుంటోంది. ఫోన్లో సరిగ్గా మాట్లాడలేదన్న చిన్న కారణంగానే బాధపడిపోతున్న మీ వొదినతో, హరి ప్రాణంతో లేడన్న విషయాన్ని చెబితే ఆమె పరిస్థితి ఏమవుతుందోనని ఆలోచిస్తేనే భయంగా ఉంది"

మాసిలామణి రుద్ధమైన కంఠంతో మాట్లాడుతుండగానే తిలకం ఏడుస్తున్న శబ్దం అటువైపున్న రమణికి వినిపించింది.

"నా... నాన్నా..."

"ఊఁ..."

"పక్కనెవరు!.... అమ్మేనా?"

"అ...అవును...!"

"వదిన ఇంట్లో ఒంటరిగా ఉందా?"

"లేదు, వాళ్ళమ్మ తోడుగా ఉంది. నేనూ మీ అమ్మా గుడికి వెళుతున్నామని చెప్పి కంపెనీకి వచ్చేశాం..."

"వాళ్ళమ్మ కన్నీళ్ళు పెట్టుకుంటే, వదినకు విషయం తెలిసిపోతుందేమో నాన్నా..."

"లేదు రమణీ, గీతాంబరి వాళ్ళమ్మ మన కన్నా జాగ్రత్తగా ఉంటోంది... కళ్ళలో నీరు కనిపించకుండా తన భావాలన్నీ అణచుకొని... కడుపుతో ఉన్న కూతురు ప్రసవించేంతవరకూ విషయం తెలియకూడదన్నట్టుగానే ఉంది... మీ అమ్మనే కంట్రోల్ చేయలేకపోతున్నా. ఇంట్లో నోరు తెరిచి ఏడవలేక... మీ అమ్మ పడే తపన, బాధా ఉందే... కళ్ళతో చూడలేకపోతున్నారా"

**కొత్తగాలి...**

**వూగే చిటారు కొమ్మన**
**హాయిగా కూర్చుందో పక్షి**
**కొమ్మని నమ్మికాదు**
**తన రెక్కల్ని నమ్మి**

– అయినాల కనకరత్నాచారి
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

ఫోన్లో కొన్ని క్షణాలు నిశ్శబ్దం రాజ్యమేలింది. దాన్ని మాసిలామణి చెదరగొట్టాడు.

"ముంబయి నుండి నువ్వెప్పుడు బయలుదేరుతున్నావు రమణీ..

"అస్థిని తీసుకుని రేపు ఉదయం ఫ్లైట్‌లో నేనూ దివాకరూ బయలుదేరుతున్నాం"

"వద్దు..."

"ఏం నాన్నా?"

"మీ వదినకు ప్రసవమయ్యేంతవరకూ నువ్వు అక్కడ నుండే మాట్లాడాలి. రోజుకు ఒక్కసారైనా ఫోన్ రాలేదంటే ఆవిడ అరిచి

ఆర్భాటం చేసేస్తుంది. సో... నేను చెప్పేం తవరకూ నువ్వూ, దివాకరూ ముంబయి లోనే ఉండండి...".

"నాన్నా... ఫ్రాంక్‌ఫర్ట్ నుండి అన్నయ్యా వదినతో మాట్లాడినట్టు నేను మాట్లాడాలి, అంతేకదా? "

"ఔను..."

"దానికి ముంబయి నుండే మాట్లాడాలని ఏమీలేదు. చెన్నైలో ఉండీ మాట్లాడొచ్చు వదిన కదలికలను ఇంట్లో చూస్తూ, దానికి తగ్గట్టు బయటకెళ్ళి ఏదో ఒక చోటు నుండి టెలిఫోన్ చేసి ఫ్రాంక్‌ఫర్ట్ నుండి మాట్లాడేట్టు మాట్లాడుతాను. దాంతో వదినకు అనుమానం కలిగే అవకాశం లేదు"

"మరోసారి ఆలోచించు..."

"ఇందులో ఆలోచించడానికి ఏమీ లేదు నాన్నా... రేపు ఉదయం ఫ్లైట్‌లో నేనూ, దివాకరూ బయలుదేరి వస్తున్నాం..."

"సరే ఫ్రాంక్‌ఫర్ట్‌కు ఫ్లైట్ ఎక్కే ముందు గీతాంబరికి ఫోన్ చేస్తానన్నావా? "

"ఔను..."

"మరి చెప్పినట్టే ఫోన్ చేసి హరిలాగా మాట్లాడేసేయ్..."

"ఊс..."

"కాస్త ప్రేమగా హరిలా మాట్లాడు... అంటీ ముట్టనట్టు మాట్లాడకు..."

"నాకు చేతకావడం లేదు..."

"కష్టమే... మరోదారి లేదు... హరి మాట్లాడినట్టే మాట్లాడి ఆమెను సంతోష పెట్టు..."

"సరే నాన్నా..."

★ ★ ★

కేబుల్ టీవీలో సినిమా చూస్తున్న గీతాంబరి, పక్క గదిలో టెలిఫోన్ మోగ టంతో కడుపులో శిశువు ఉందన్న విష యాన్ని కూడా మరచి, టక్కున ఒక్కసా రిగా పైకి లేచింది. పక్కనున్న ఆమె తల్లి పార్వతమ్మ అదిరిపడింది.

"మెల్లగా లేవవే..."

"అమ్మా, ఫోన్ చేసేది మీ అల్లుడే. వెళ్ళి తగవును కంటిన్యూ చెయ్యాలి" గోడను పట్టుకుని గదిలోకి వెళ్ళి ఫోన్ తీసింది.

"హలో"

చక్కటి ఇంగ్లీష్‌లో అటు నుండి మాట్లా డారెవరో... "హరిహరన్ ఇల్లే కదూ? "

"ఔను..."

"ముంబాయి సిల్వర్ శాండ్ హోటల్ రిసెప్షన్ నుండి మాట్లాడుతున్నాం"

హోటల్ రిసెప్షనిస్టు తనకెదురుగా కూర్చొని ఉన్న రమణిని చూస్తూ టెలిఫోన్‌లో గీతాంబరితో అన్నాడు "మిసెస్ గీతాంబరీ హరిహరన్ ప్లీజ్..."

"హోల్డింగ్..."

"మేడమ్... మీవారు మీతో మాట్లాడుతారట... కనెక్షన్ ఇవ్వనా? "

"ప్లీజ్..."

రిసెప్షనిస్ట్ రిసీవర్‌ను తన ఎడమ చేతివేళ్ళతో మూసి ఉంచి రమణికేసి చూశాడు.

"సార్... మీరు చెప్పినట్టే మిసెస్ గీతాంబరితో మాట్లాడాను. ఆమె లైన్లో ఉన్నారు, మాట్లాడండి..."

"థాంక్యూ వెరీమచ్..." రమణి రిసీవర్‌ను అందుకుని హరిహరన్‌లాగా మాట్లాడ్డం మొదలుపెట్టాడు.

"గీ... గీ... గీతాంబరీ..."

గీతాంబరి అటునుండి గయ్‌మంటూ లేచింది... "ఇప్పుడు టైమ్ ఎంతైందో తెలుసా? ఏడున్నర. అయిదింటికే ఫోన్ చేస్తానని ఉదయం చెప్పారు..."

"లైన్ దొరకలేదు. ఐదు గంటల నుండి ట్రై చేస్తున్నాను..."

"అబద్ధం... పచ్చి అబద్ధం..."

"అరె. నిజంగానే! ముంబాయి టెలిఫోన్‌లు పగలంతా ఎప్పుడూ బిజీనే..."

"సరే! ఫ్రాంక్‌ఫర్ట్ ఫ్లైట్ ఎన్నింటికి? "

"ఫ్లైట్‌లో మెకానికల్ ప్రాబ్లం ఉందట.

చివరిగా అందిన సమాచారం ప్రకారం రాత్రి తొమ్మిదింటికి బయలుదేరొచ్చు.."

"అంటే... ఇంకో అరగంటలో మీరు ఏర్ పోర్ట్‌కు బయలుదేరి వెళ్ళాలి..."

"ఔను... లగేజ్ అంతా ప్యాక్ అయిపో యింది. హోటల్ బిల్ రెడీ అవుతోంది"

"జలుబూ, జ్వరమూ ఎలా ఉన్నాయ్?"

రమణి ఉత్సాహంగా అన్నాడు. "పోయిందే..."

"ఔనూ ఉదయం చేసినప్పుడూ, ఇప్పుడూ మీరో విఐపి గురించి అడగలేదు?"

రమణి దిగ్భ్రాంతి చెందాడు.

"విఐపీనా...?"

"ఔను..."

**కొత్తగాలి...**

**గురువుగారు**
**సరళరేఖను బోధిస్తే**
**జీవితం మాత్రం**
**దారిద్ర్యరేఖను సూచిస్తోంది**

– పి.వి.రమణకుమార్,
చిలకలూరి పేట

"ఎ... ఎవరు?"

"ఇప్పుడు మీరు ఎవరని అడిగినందుకే ఐ.పి.సి. ప్రకారం మీకు ఏ శిక్ష అయినా వెయ్యొచ్చు. అరనిమిషం టైమిస్తున్నా. ఆ లోపలే ఆ విఐపీ ఎవరో చెప్పెయ్యాలి"

"అమ్మా"

"నో..."

"నాన్నా?"

"కాదు..."

"మీ అమ్మా?"

"ముంబాయికి వెళ్ళగానే ఎందుకిలా మొద్దులా మారిపోయారు?"

"నువ్వు ఎవరి గురించి చెబుతున్నావో అర్థం కావటం లేదు గీతా..."

"మీరిప్పుడు నా పక్కనుంటే చేటలా వాచి పోయేవరకూ చెవి మెలిపెట్టేదాన్ని..."

రమణికి గీతాంబరీ చనువు గొప్ప ఇబ్బందిగా అనిపించింది. నుదుటి నుండి చెమట ధారగా కారసాగింది.

"ఏంటీ మౌనం?"

"అదీ... అదీ..."

"ఆ ముఖ్యమైన విఐపి ఎవరో ఇంకా గుర్తుకు రాలేదా?"

"రా... రాలేదు..."

"సరే, కడుపు మీద రిసీవర్‌ను పెడతాను- మీరే మాట్లాడండి"

కన్నీటి తెర రమణి కళ్ళకు అడ్డొచ్చింది 'భగవంతుడా! ఏమిటీ ఘోరం?'

గీతాంబరి కోపాన్ని తగ్గించుకోకుండా మాట్లాడసాగింది. "మీ కొడుకుతో మీరు మాట్లాడలేదని వాడికి చాలా కోపంగా ఉన్నట్టుంది. తన్ని పెడుతున్నాడు. చూడండి. ఇప్పుడు కూడా తంతున్నాడు."

"అ... అలాగా...! ఊరికొచ్చాక వాణ్ణి ఒక పట్టు పడతాను..." అతి కష్టంమీద నవ్వుతూ ఆపై మాటలు పెంచకుండా గబగబ చెప్పాడు.

"గీతాంబరీ ఏర్‌పోర్ట్‌కు వెళ్లడానికి నా కోసం బస్ వచ్చేసింది... బయలుదేరనా?"

"ఫ్రాంక్‌ఫర్ట్‌కు వెళ్ళాక, ఎన్ని పనులున్నా సరే... ముందు నాకు ఫోన్ చెయ్యాలి."

"సరే..."

"ఇప్పుడు 'సరే'నని తర్వాత 'సారీ' చెప్పకూడదు. రేపు ఉదయం పది గంటల్లోపు మీ ఫోన్‌కోసం ఎదురు చూస్తుంటాను."

"సరే, రిసీవర్‌ను పెట్టేయనా?"

"ఎందుకలా కంగారు పడుతున్నారు. నాకు ఇవ్వకపోయినా ఫరవాలేదు. మీ కొడుక్కైనా ఇవ్వవలసింది ఇచ్చేసి రిసీవర్‌ను పెట్టేయండి..."

"ఏ.... ఏమివ్వాలి?"

"సరిపోయింది! ముంబాయి వెళ్లినప్పటి నుండి మీరు అవుటాఫ్ ఆర్డర్... మీ బిజినెస్ టూర్‌ను ముగించుకుని రండి... తర్వాత తీరికగా మాట్లాడుకుందాం..."

"గుడ్‌నైట్... గీతాంబరీ"

"ఊc... ఊc..."

రమణి రిసీవర్‌ను పెట్టేసి కర్చీఫ్ తీసుకొని తడిగా ఉన్న కళ్ళను తుడుచుకుని రిసెప్షనిస్టువైపు తిరిగాడు "మీ సహాయానికి కృతజ్ఞతలు..."

"సార్, ఈ నాటకాన్ని ఇంకా ఎన్నాళ్ళని కొనసాగిస్తారు? "

"మా వదినకు బిడ్డ పుట్టేంతవరకూ..."

"మీతో వచ్చిన దివాకర్, గీతాంబరి బ్రదరా? "

"ఔను...."

"ఇప్పుడు ఆయన ఎక్కడికెళ్ళారు? "

"అస్థిని సేకరించేందుకు 'కరెంటు కాష్టానికి' వెళ్ళాడు. రేపు ఉదయం చెన్నై ఫ్లైట్‌కు మేము వెళుతున్నాం. రెండు టిక్కెట్లు బుక్ చేసేయండి."

విచారంగా రిసెప్షనిస్ట్ తలాడిస్తున్న సమయంలో... హోటల్ పోర్టికోలోకి పోలీస్ జీప్ ఒకటి వచ్చి ఆగింది. ఇన్‌స్పెక్టర్ మల్హోత్రా పాన్ నములుతూ క్రిందికి దూకి వేగంగా రమణికేసి వచ్చాడు.

"మిస్టర్ రమణీ! ఒక్క నిమిషం రండి"

రమణి అయోమయంగా లేచి వెళ్ళాడు.

"ఏంటి సార్...? "

మల్హోత్రా హాలు చివరికి తీసుకెళ్ళి ప్రశ్నించాడు, "మీకిచ్చిన పోస్టుమార్టం రిపోర్ట్ కాపీని చదివారా? "

"లేదు సార్..."

"చదవండి... ఒక నిజం తెలుస్తుంది.."

"ఏం నిజం సార్...? "

"లారీ ప్రమాదంలో చనిపోయింది మీ బ్రదర్ హరిహరన్ కాదన్న నిజం..."

★ ★ ★

ల్యాబొరేటరీ చీకటిలో... టార్చ్ వెలుగులో... షెల్ఫ్ కర్టెన్ కింద కనిపించిన ఒక జత పాదాలను అదిరిపడి చూసిన చతుర్వేది తన చేతిలోని రివాల్వర్‌ను జాగ్రత్తగా పట్టుకుని గట్టిగా అరిచాడు

"కమ్. అవుట్..."

ఆ పాదాలలాగే నిలబడ్డాయి. హిందీలో అరిచాడు "రా బయటికి!"

నిశ్శబ్దం.

చతుర్వేది మళ్ళీ గట్టిగా అరిచాడు "బయటికొస్తావా, రావా? "

కర్టెన్ మెల్లగా కదిలి, చెమటతో తడిసిన ముఖంతో, బెదురు చూపులతో ఓ యువకుడు బయటికొచ్చాడు. కాలేజీ కుర్రాడిలా ఉన్నాడు. చిన్ని గడ్డం, బ్యాగీ ప్యాంట్, టీ షర్ట్ తొడుక్కున్నాడు.

"మాఫ్ కరో సాబ్" అర్థించాడతను

"ఇలా రా.... " రివాల్వర్‌ను చూపిస్తూ గద్దించాడు చతుర్వేది. అతడు తడబడుతూ బయటికొచ్చాడు.

"నీ పేరేంటీ? "

"విరల్...."

"ఎందుకోసం ఈ ఇంట్లోకొచ్చావ్? "

"అదీ.... అదీ...." తడబడ్డాడు.

"ఊc... చెప్పు..."

"నిషా లోపలుందా లేదా చూడ్డానికి"

చతుర్వేది, ఆర్యా ఒకరినొకరు చూసుకున్నారు. తర్వాత విరల్‌వైపుకి తిరిగి "నిషా ఇక్కడికొచ్చిందని నీకెలా తెలుసు? " అన్నాడు చతుర్వేది.

"అదీ... అదీ... కొంతకాలంగా ఆమె బయటికి ఎక్కడికెళ్ళినా ఆమెను వెంబడించడమే నా పనిగా పెట్టుకున్నాను."

"ఎందుకలాగా? "

"ఆ... ఆమెను ఇష్టపడుతున్నాను..."

"ఆమె నిన్ను ఇష్టపడుతోందా? "

"లేదు! ఆమె వెళ్ళే చోటికల్లా వెళ్ళి, ఆమె ప్రేమను సాధించాలని పట్టుదల. ఈ రోజు

కూడా ఆమె ఇంటి నుండి బయలుదేరగానే ఫాలో అయ్యాను....”

“నువ్వు వెంటబడ్డం ఆమెకు తెలుసా?”

“తెలియదు... ఆమె ఈ ఇంట్లోపలికి రాగానే నేను రోడ్లో ఉన్న ఓ పాతరేకుల కొట్టం కిందికి వెళ్లి నిలబడ్డాను. నిషాకోసం ఎదురు చూడ్డం మొదలు పెట్టాను. ఎంత సేపటికీ నిషా బయటికి రాకపోయేసరికి”

“లోపలికొచ్చిన ఆమె గురించి తెలుసుకోవడానికి లోపలికొచ్చేశావ్, అంతేనా?”

“ఔను!” అంటూ విఠల్ తలాడించాడు.

“గేట్‌కు తాళం వేసుందిగా... లోపలికెలా వచ్చావ్?”

“ఓ కారు లోపలికి రావటం కోసం మీరు గేట్ తియ్యగానే కారు వెనకే వచ్చేశాను”

చతుర్వేది ఆర్యాను చూసి చిరునవ్వు నవ్వాడు... “ప్రేమ ప్రభావం చూశావా?”

విఠల్ చెమటతో ఉన్న ముఖాన్ని తుడుచుకోకనే అన్నాడు “నేను ఈ ఇంట్లోకి రావటం తప్పే, నన్నేమీ చెయ్యకండి. నేను నిషాను చూడ్డానికే వచ్చాను... దొంగతనం చెయ్యడానికి రాలేదు...”

చతుర్వేది మెల్లగా నవ్వాడు “నువ్వు దొంగతనానికి వచ్చుంటే ఇప్పటికే నిన్ను ఆనందంగా బయటికి పంపించేవాళ్లం. కానీ నువ్వు నిషాను వెదుక్కుంటూ వచ్చావ్... అది చాలా పెద్ద తప్పు.”

“సా...సార్...”

“నిషా ఈ ఇంట్లోపలికి రావటం నువ్వు చూశావ్ కదూ?”

“అ... అవును...”

“ఆమె ఆ ఇంటిని వదిలి బయటికి వెళ్ళలేదనీ నీకు తెలుసుకదూ?”

“అ...అవును సార్...”

“ఇన్ని నిజాలు తెలుసుకున్న నువ్వు ఇక మీదట ఈ ఇంటిని వదిలి బయటికి వెళ్ళడానికి వీల్లేదు...”

“సా...సార్...” విఠల్ భయం భయంగా చూడటంతో ఆర్యా నవ్వింది.

“ఇవ్వాళ ఈ ల్యాబ్‌కి దొరికిన రెండో ఎలుకవు నువ్వు...”

ఆకాశంలో మెరిసిన మెరుపు వెలుగు సర్రుమంటూ కిటికీ అద్దాల నుండి లోపలికి ప్రసరించింది. బయట వర్షం అంతకంతకూ అధికమై ముంబయిని ముంచెత్తసాగింది.

విఠల్ అమాయకంగా చతుర్వేదిని చూడ్డంతో ఆయన ఆర్య వంక చూశాడు.

“గెస్ట్‌ను నేను లోపలికి తీసుకెళతాను. కూల్‌డ్రింక్స్‌కు ఏర్పాటు చెయ్ ఆర్యా...”

ఆర్యా అలాగేనంటూ తలాడించి చీకటికి అలవాటుపడ్డ చూపులతో దేనికీ గుద్దుకోకుండా ల్యాబొరేటరీ లోపలికి నడిచింది. చతుర్వేది తన చేతిలోని రివాల్వర్‌ను విఠల్‌కేసి తిప్పాడు.

“ఊc.. రా...”

“సా...సార్... నన్ను... ఏమీ చెయ్యకండి సార్...”

“భయపడకు!... నువ్వు నిషాను చూడాలనేగా వచ్చావ్? ఆమె లోపలే ఉంది. రా... చూద్దాం...” చతుర్వేది నవ్వుతూ విఠల్‌కేసి కదిలిన ఆ క్షణంలో అతడు వేగంగా స్పందించాడు.

మేజా మీద ఉన్న ఖాళీ గాజుగొట్టాన్ని తీసుకొని డాక్టర్ వైపుకు విసిరాడు. అత్యంత వేగంతో ప్రమాదాన్ని గ్రహించిన చతుర్వేది చప్పున కిందికి వంగాడు. ఫట్‌మంటూ ఆ గాజుగొట్టం గోడకు గుద్దుకుని ముక్కలు ముక్కలుగా పగిలి నేలమీద పడింది.

ఆర్యా పరుగెత్తుకొచ్చింది.

“డాక్టర్... డాక్టర్...”

చతుర్వేది మామూలు స్థితికి వచ్చేలోపు విఠల్ చేతికి ఓ బున్‌సన్ బర్నర్ చిక్కింది. దాన్ని వేగంగా విసిరాడు. బర్నర్ తన ఇనుప బలాన్ని చతుర్వేది కుడి భుజానికి రుచి చూపించి అతనికి ఓ సన్నటి బాధను కలిగించి క్రిందికి దొర్లింది.

ఆర్యా అరిచింది.

"డాక్టర్... వాణ్ణి షూట్ చెయ్యండి"

"వద్దు ఆర్యా... మన ఎక్స్‌పెరిమెంట్‌కు ఆ ఎలుక ప్రాణంతో కావాలి..."

విఠల్ చేతికి ఇప్పుడు జాడీలాంటిది దొరికింది... విసిరాడు. చతుర్వేది, ఆర్యా చప్పున ఓ పెద్ద బీరువా చాటుకు వెళ్ళటంతో- అది ఒక స్టూలును పడదోసి శబ్దం చేస్తూ నేలమీద దొర్లింది. ఆర్యా అరిచింది. "డాక్టర్ ఇక విఠల్‌ను కంట్రోల్ చేయటం కష్టం... మీరు రివాల్వర్‌ను ప్రయోగించకుండా ఉంటే ఈ చీకటిని అనుకూలంగా చేసుకొని అతడు తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాడు. అట్‌లీస్ట్ మోకాలికి కిందైనా అతణ్ణి షూట్ చేయండి..."

చతుర్వేది చెమటకు జారుతున్న రివాల్వర్‌ను పట్టుకుని చీకట్లో విఠల్‌ను వెదికాడు.

విఠల్ విసరటానికి ఏవైనా వస్తువులు కనిపిస్తాయేమోనని ఆతృతగా వెదుకుతుండటంతో, చతుర్వేది అతడి మోకాలి క్రింది భాగానికి గురిపెట్టాడు.

ఓ మట్టి కూజా ఎగురుతూ వచ్చి వెడల్పాటి మేజామీద పడి ముక్కలైంది.

"ఇక అతణ్ణి ఉపేక్షించకూడదు! మోకాలు కింద తూటాను పేల్చాల్సిందే...!"

ట్రిగ్గర్‌పై వేలు బిగుసుకుంది.

విఠల్ కుడి మోకాలు అంత చీకట్లోనూ లీలామాత్రంగా కనిపించటంతో వేగంగా ట్రిగ్గర్ నొ...క్కా...డు...

సైలెన్సర్ పిస్టల్ నిశ్శబ్దంగా తూటాను బయటకి పంపిన ఆ క్షణంలో.. విఠల్ క్రిందపడున్న టెస్ట్‌ట్యూబ్ చెక్కస్టాండ్‌ను తీసుకోవడానికి వంగటంతో, మోకాలికి పెట్టిన గురి గుండెను దత్తత తీసుకుంది.

"టప్...!" గుండెమీద చెయ్యిపెట్టి నోరు తెరుచుకుని వెనక్కు విరుచుకు పడిపోయాడు విఠల్.

"ఆర్యా! కార్యం చెడింది... తూటా గుండెలోకి దూసుకెళ్ళింది."

"డాక్టర్ టార్చ్‌ను నా చేతికివ్వండి" డాక్టర్ చేతి నుండి టార్చ్‌ను తీసుకుని విఠల్ పక్కకు తిరిగింది.

టార్చ్ వెలుగు రక్తపు మడుగును చూపించగా, విఠల్ చివరి ఘడియల్లో ఉన్నాడు.

"డాక్టర్, కాపాడ్డానికి వీలవుతుందా?"

"చూద్దాం..."

గబగబ నడుస్తూ ఇద్దరూ అతడి సమీపానికి వెళ్ళారు. చతుర్వేది మోకాళ్ళపై కూర్చొని విఠల్ పల్స్ చూస్తుండగానే అతడు తన చివరి శ్వాసను వదిలి తల వాల్చేశాడు. చతుర్వేది నిట్టూర్చాడు.

"పూర్ బాయ్! ఇవ్వాళ చచ్చే తీరాలని

## కొత్తగాలి...



**ప్రేమ పెళ్ళికి పునాది**
**పెళ్ళి ప్రేమకు సమాధి**
**ప్రేమ పెళ్ళి విజయాలు అరుదు**
**వారి జీవితాలు అదురు**

– ప్రియాంక, తెనాలి

కంకణం కట్టుకుని వచ్చినట్టున్నాడు."

"ఇప్పుడేం చేద్దాం డాక్టర్?"

"బాడీని డిస్పోజ్ చేసేసి మన పనిని కొనసాగించడమే..."

"బయట కుంభవృష్టి డాక్టర్. బాడీని ఎక్కడికి తీసుకెళ్ళి డిస్పోజ్ చెయ్యాలి?

చతుర్వేది కొన్ని క్షణాలు ఆలోచించి ఆర్యాతో అన్నాడు "ఓ పనిచెయ్..."

"చెప్పండి డాక్టర్..."

"జోషికి ఫోన్ చేసి, ఆయన్ను కారు తీసుకొని రమ్మను. బాడీని డిస్పోజ్ చేసే పనిని ఆయన తన మనుషుల ద్వారా కచ్చితంగా పూర్తి చేస్తారు."

ఆర్యా తలాడించి టార్చ్ వెలుగులో టెలి ఫోన్ ఉన్న గదికేసి నడిచింది.

చతుర్వేది తన ఒంట్లో గూడుకట్టుకొని ఉన్న ఆదుర్దాను నియంత్రించుకునేందుకు సిగార్ పైప్‌ను వెలిగించుకొని ఆ చీకటి గదిలో పచార్లు చేయసాగాడు.

## 5



**నిలువెల్లా** ఆశ్చర్యమూ, ఆనందమూ నిండిపోతుంటే, ఎస్సై మల్హోత్రాను పారవశ్యంగా చూశాడు రమణి.

"ఇన్‌స్పెక్టర్, మీరంటున్నది నిజమేనా? "

"అది నిజమా, అబద్ధమా అన్నది మీరు చెప్పే సమాధానాలను బట్టే నిర్ణయించాలి... పోస్టుమార్టం రిపోర్టు ప్రకారం ప్రమాదంలో చనిపోయిన వ్యక్తికి ముందువరుసలో నాలుగు కట్టుడు పళ్ళు. మీ బ్రదర్‌కు కట్టుడు పళ్ళున్నాయా? "

"లేవు సార్... "

"ఆర్ యూ ష్యూర్? "

పక్కనున్న దివాకర్ అడ్డుపడి చెప్పాడు "ఐ ష్యూర్ అబౌట్ ఇట్ సార్... హరిహరన్ నాకు బ్రదర్ ఇన్ లా అయినప్పటికీ ఆ చుట్టరికాన్ని మించి మా మధ్య స్నేహముంది. హరిహరన్ ఏ విషయాన్నీ నా నుండి దాచింది లేదు... హరిహరన్‌కు కట్టుడు పళ్లు ఉండే అవకాశమే లేదు.. చనిపోయింది మరెవరో అయి ఉండాలి..."

"నేనూ ఇప్పుడు ఆ కోణంలోనే ఆలోచిస్తున్నాను. లారీ ప్రమాదంలో చనిపోయింది హరిహరన్ కాదన్న విషయం నిజమైతే మరొక ప్రశ్న ఎదురవుతుంది."

"చనిపోయింది ఎవరన్న ప్రశ్నే కదా? "

"అది రెండో ప్రశ్న. మొదటి ప్రశ్న ఏంటంటే- చనిపోయింది హరిహరన్ కాదనుకుంటే అతనిప్పుడు ఏమయ్యాడు? "

దివాకర్ ఇన్‌స్పెక్టర్ వైపు చూశాడు "సార్! ఈ హోటల్ వాచ్‌మెన్ ఇచ్చిన స్టేట్‌మెంట్ ప్రకారం హరిహరన్ వాచ్‌మెన్‌ను టాక్సీస్టాండ్‌కు దారి అడిగి తెలుసుకుని, రోడ్డును క్రాస్ చేస్తుండగా లారీ గుద్దేసింది... అవునా? "

"ఔను..."

"వాచ్‌మెన్‌ను మరోసారి విచారణ చేస్తే ఇంకేదైనా నిజం తెలుస్తుందేమో? "

ఆ విషయాన్ని అంగీకరిస్తున్నట్టు తలాడించిన మల్హోత్రా, హోటల్ రిసెప్షనిస్టుకు విషయం చెప్పాడు. మరో రెండు నిమిషాలకల్లా రెయిన్ కోట్ ధరించిన వాచ్‌మెన్ ఎస్సై ముందుకొచ్చి నిలబడ్డాడు. మల్హోత్రా అతణ్ని తీక్షణంగా చూస్తూ ప్రశ్నించాడు "నిన్న రాత్రి హోటల్ ముందు లారీ గుద్ది ఒక వ్యక్తి మరణించినప్పుడు నువ్వు స్పాట్‌లో ఉన్నావా? "

"ఔను సార్!"

"ప్రమాదంలో చనిపోయిన వ్యక్తి హోటల్‌నుండి బయటకు రావటం నువ్వు చూశావా? "

"చూశాను సార్."

"ముఖం గుర్తుందా? "

"లేదు సార్."

"ఆ వ్యక్తి నిన్ను ఏం అడిగాడు? "

"టాక్సీస్టాండ్‌కు ఎటు వెళ్లాలని అడిగాడు. నేను చెయ్యి చాపి దారి చూపించగానే రోడ్డును క్రాస్ చెయ్యబోయాడు. రోడ్డును ఆయన సగం దూరం దాటుతుండగా ఓ లారీ వేగంగా దూసుకొచ్చింది. ఆయన కేక లేస్తూ వెనక్కు వచ్చేలోపలే లారీ ఆయన్ను

గుద్దేసి మీద నుండి వెళ్లిపోయింది."

రమణి తన చేతిలో ఉన్న హరిహరన్ బ్రీఫ్‌కేస్‌ను తెరిచి... పాస్‌పోర్ట్‌ను బయటికి తీసి... అందులో అతికించబడున్న హరిహరన్ ఫొటోను వాచ్‌మెన్‌కు చూపిస్తూ అడిగాడు, "నువ్వు చూసింది ఈయన్నేనా? "

వాచ్‌మెన్ ఆ ఫొటోను చూసి తల గోక్కున్నాడు.

"గుర్తులేదు సార్..."

"ఫొటోను బాగా చూసి చెప్పు"

వాచ్‌మెన్ తన చూపుల్ని తీక్షణంగా చేసుకుని చూసి తలాడించాడు.

"క్షమించండి సార్. నాకు ముఖం గుర్తుకు రావడం లేదు. దానికి కారణం ఆ సమయంలో వర్షం బాగా పడుతోంది. కాంపౌండ్ గేట్‌లోని బల్బ్‌కూడా వెలగ లేదు. మనిషి టిప్‌టాప్‌గా సఫారి డ్రెస్‌లో ఉండటం మాత్రం తెలిసింది."

"నీతో ఏ భాషలో మాట్లాడాడు? "

"హిందీ..."

"మల్హోత్రా రమణి వైపు చూస్తూ "మీ బ్రదర్‌కు హిందీ తెలుసా? " అడిగాడు.

"తెలుసు సార్.."

ఇన్‌స్పెక్టర్ ఇంకేదో అడగబోతున్న సమయంలో హోటల్ రిసెప్షనిస్ట్ పిలిచాడు.

"సార్! మీకు ఫోన్... స్టేషన్ నుండి ఎస్సై మఫత్‌లాల్ మాట్లాడుతున్నాడు"

ఎస్సై వెళ్లి మాట్లాడాడు.

"ఎస్.."

అటువైపు మరో ఎస్సై మఫత్‌లాల్ మాట్లాడసాగాడు. వింటున్న మల్హోత్రాముఖంలో రంగులు మారాయి.

"ఈజిట్? "

"..."

"ఎప్పుడు? "

"..."

"మనిషిని స్టేషన్‌కు తీసుకొచ్చేశారా? "

"..."

"గుడ్‌జాబ్... ఇప్పుడే బయలుదేరి వస్తున్నా..." మల్హోత్రా రిసీవర్‌ను పెట్టేసి, చిర్నవ్వు నవ్వుతూ రమణినీ దివాకర్‌నూ చూశాడు.

"లారీ ప్రమాదంలో చనిపోయింది హరిహరన్ కాదని స్పష్టమైపోయింది."

"భగవంతుడా!" ఆనందంతో అరిచిన రమణి కళ్లల్లో నీరు పొంగుకొచ్చింది.

ఎస్సై కొనసాగించాడు "లారీ ప్రమాదంలో చనిపోయిన వ్యక్తి పేరు ద్వారకానాథ్. అతడొక కొత్త రకపు దొంగ. ధనవంతుడిలా డ్రెస్ చేసుకుని పెద్దపెద్ద హోటళ్లకు వెళ్లి, ఎవరినో కలుసుకునేందుకు వచ్చినట్టు నటించి, హోటల్ సిబ్బంది వాళ్ల పనుల్లో లీనమై ఉన్న సమయం చూసి, తాళం వేస్తున్న గదిని నకిలీ తాళం చెవితో తెరచి లోపలున్న కాస్ట్‌లీ వస్తువులన్నింటినీ దోచుకెళ్లటం అతడి అలవాటు. నిన్నరాత్రి ద్వారకానాథ్ తన అనుచరుడితో కలిసి ఈ హోటల్‌కు వచ్చాడు. అనుచరుడి పేరు శీతల్. తాళం వేసున్న మీ బ్రదర్ గదిని ఇద్దరూ కలిసి తెరిచారు. వాళ్లు ధరించిన డ్రెస్ వర్షంలో తడిసిపోవడంతో మీ బ్రదర్ డ్రెస్సుల్ని వేసుకుని రూమ్‌లో ఉన్న అన్ని వస్తువుల్ని మూటకట్టుకుని బయటికొచ్చారు. శీతల్‌కు పాత దుస్తుల్ని, కొంత డబ్బునూ ఇచ్చి ముందుగానే పంపించేసి కాసేపయ్యాక ద్వారాకానాథ్ బ్రీఫ్‌కేస్‌తో బయటికొచ్చాడు. వాచ్‌మేన్ అనుమానించ కూడదని టాక్సీస్టాండ్‌కు దారడిగి రోడ్డును క్రాస్ చేస్తూ లారీ గుద్ది చనిపోయాడు"

మల్హోత్రా చెబుతుండగానే రమణి హృదయంలో ఒక పక్క ఆనంద తరంగాలు ఎగసిపడుతున్నా మరోపక్క ఏదో అనుమానం పీడించసాగింది.

'ప్రమాదంలో చనిపోయింది ద్వారకనాథ్ అయితే అన్నయ్య ఎక్కడ? ద్వారకనాథ్ చేతికి అన్నయ్య వాచ్ ఎలా వచ్చింది? '

## కస్తూరిబా ఇంగ్లీషు

ఒకసారి కస్తూరిబా తిరుచెంగోడ్‌లోని గాంధీ ఆశ్రమాన్ని చూడటానికి వచ్చారు. రాజాజీ ఆమెకు ఆశ్రమంలోని వివిధ శాఖలను చూపిస్తూ ఖాదీ గుడ్డలకు అద్దకం చేస్తున్న స్థలానికి తీసుకొచ్చారు.



కస్తూరిబా అమాయకంగా వచ్చీరాని ఇంగ్లీషులో -రంగు వెలుస్తుందా- అనడానికి 'కలర్ గో? ' అని ప్రశ్నించారు.

దానికి రాజాజీ, 'దిస్ ఈజ్ నో గో కలర్' (ఈ రంగు పోదు) అనగానే అందరూ నవ్వారు. కస్తూరిబా సహజ సిద్ధమైన నమ్రతతో 'నా ఇంగ్లీషులో తప్పులున్నాయా? ' అన్నారు. రాజాజీ అందుకు బదులుగా అది కస్తూరిబాగారి ఇంగ్లీషు అన్నారు. గాంధీజీ, కస్తూరిబాతో రాజాజీకున్న సాన్నిహిత్యానికి ఈ సంఘటన ఓ మచ్చు తునక.

మనసులో తొలుస్తున్న ఆ అనుమానాలను ఎస్సైనే అడిగాడు రమణి.

"సార్... మా బ్రదర్ హోటల్ గదికి తాళం పెట్టి బయటకు వెళ్లిన సమయంలోనే ద్వారకనాథ్ డూప్లికేట్ తాళంచెవితో గదిలోని వస్తువులన్నిటినీ అపహరించుకుని వెళ్ళినట్టు చెప్పారు. మా బ్రదర్ ఎవర్నైనా కలవటానికి బయటికి వెళ్ళుంటే వాచీ పెట్టుకునే కదా వెళ్ళుండాలి...? "

"ఊc... అయి ఉండొచ్చు..."

"అలా వాచీ కట్టుకుని వెళ్ళుంటే, ఆ వాచీ ద్వారకనాథ్ చేతికి ఎలా వచ్చింది.? లారీ గుద్ది మరణించిన ద్వారకనాథ్ చేతికి హరిహరన్ కట్టుకున్న వాచీ ఉందే మరి? "

మల్హోత్రా నవ్వాడు. "ఇద్దరి వద్దా ఒకే రకమైన వాచీలు ఉండకూడదా ఏం? "

"నేను ఆ పాయింట్‌ను ఊహించలేకపోతున్నాను సార్!"

దివాకర్ అడ్డుపడ్డాడు. "ఇన్‌స్పెక్టర్! నా మనసులో ఓ ఆలోచన ఉంది చెప్పనా? "

"నిస్సంశయంగా"

"ద్వారకనాథ్, శీతల్ ఇద్దరూ నిన్న రాత్రి ఈ హోటల్‌కు దొంగిలించేందుకు వచ్చుండాలి. ఆ సమయంలో హరిహరన్ తన గదికి తాళం పెట్టి బయటికెళ్ళటం చూసుండాలి. వెంటనే వాళ్ళిద్దరూ హరిహరన్ వెనకే వెళ్ళి ఏదో ఓ ప్రాంతంలో అతడిపై దాడిచేసి ప్రాణానికి అపాయం కలిగించి, అతడి వద్ద ఉన్న వస్తువుల్ని దోపిడీ చేసుండాలి. ఆ పైన హోటల్‌కు వచ్చి తాళంచెవితో గదిని తెరిచి మిగిలిన వస్తువుల్ని దోచుకుని వెళ్ళుండాలి..."

"ఇది కూడా పాజిబులే... ఆ శీతల్ ఇప్పుడు పోలీస్ కస్టడీలోనే ఉన్నాడు. మనం ముగ్గురమూ స్టేషన్‌కు వెళుతున్నాం. శీతల్‌ను తగిన విధంగా విచారణ చేస్తే అన్ని నిజాలూ బయటికొస్తాయి... హరిహరన్ ప్రస్తుత పరిస్థితి ఏంటో కూడా తెలిసిపోతుంది..."

"రండి వెళదాం..."

ముగ్గురూ హోటల్ పోర్టికోలో నిలిచి ఉన్న పోలీస్ జీప్‌లోకి ఎక్కగానే, అది గేట్‌ను దాటుకుని రోడ్డుమీదికి వచ్చింది.

ఎస్సై మల్హోత్రా కేసి తిరిగాడు దివాకర్. "సార్, ఓ ప్రశ్న అడగొచ్చా? "

"ఏంటీ? "

"ద్వారకనాథ్‌నూ, శీతల్‌నూ ఎలా ట్రేస్ చేసి - హరిహరన్ గదిలోకి వెళ్ళింది వాళ్ళేనని పోలీసులు కనిపెట్టారు? "

"అది చాలా సింపుల్. డాక్టర్లు ఇచ్చిన పోస్టుమార్టం రిపోర్టులో- చనిపోయిన వ్యక్తికి ముందు వరుస పళ్ళలో నాలుగు పళ్ళు కట్టుడు పళ్ళు అన్న వివరాలు తెలియగానే స్టేషన్‌లో ఉన్న ఎస్సై మఫత్‌లాల్‌కు ఒక అనుమానం కలిగింది. క్రిమినల్ నేరస్థుల పట్టికలోని రిపోర్ట్స్‌లో... ఎవరో ఒక

నేరస్థుడికి కట్టుడు పళ్ళున్న విషయం ఆయన మనసును తొలచడంతో... రికార్డులను వెదకసాగాడు. ఆయన ఆ పనిని ప్రారంభించగానే నేను మిమ్మల్ని విచారణ చేయడానికి వచ్చేశాను. గంట సమయంలో ఎస్సై మఫత్‌లాల్ రికార్డులనంతా క్షుణ్ణంగా పరిశీలించి కట్టుడు పళ్ళు కలిగిన వ్యక్తి ద్వారకనాథ్ అని కనిపెట్టేశారు. వెంటనే కానిస్టేబుళ్ళను వెంటబెట్టుకుని ద్వారకానాథ్ ఉండే అడ్రస్‌కు వెళ్ళినట్టున్నారు. ఆ ఏరియాలోకి పోలీస్‌జీప్ ఎంటర్ కాగానే, శీతల్ ఒక పాన్‌షాప్ వెనక్కెళ్ళి దాక్కోవటం మఫత్‌లాల్ కంటపడింది. అతణ్ణి పట్టుకుని స్టేషన్‌కు తీసుకొచ్చి విచారణ చేయగా, నిజాలన్నీ బయటికొచ్చాయి..."

రమణి అడ్డుపడి, "సార్! ఎస్సై మఫత్‌లాల్ శీతల్‌ను విచారణ చేస్తున్నప్పుడు హరిహరన్ ఎక్కడని అడగలేదా? "

"అడిగారట. ఆ ప్రశ్నకు వాడు తెలియదని బదులిచ్చాడట. తాళంవేసి ఉన్న హోటల్ గదిని డూప్లికేట్ తాళంచెవితో తెరిచి వస్తువుల్ని దోచుకున్న విషయాన్ని మాత్రం ఒప్పుకున్నాడు"

"దివాకర్ చెప్పినట్టు ద్వారకానాథ్, శీతల్ ఈ ఇద్దరి వల్లా హరిహరన్‌కు ఏమైనా ప్రమాదం జరిగి ఉంటుందేమోనని నా మనసుకూ అనిపిస్తోంది సార్..."

"భయపడకండి మిస్టర్ రమణీ. నా చేతిలోని లాఠీ ఇంకో అరగంట టైమ్‌లో అతని నుండి మిగిలిన నిజాలను కూడా కక్కించేస్తుంది. ఈ మల్హోత్రా చేతికి లాఠీ వచ్చిందంటే మూగకూ మాటొచ్చేసినట్టే."

సన్నగా కురుస్తున్న వర్షం ఇప్పుడు గాలిని వెంటేసుకొని వేగాన్ని అందుకుంది.

దివాకర్ దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నాడు, "సార్! సంఘటన జరిగి ఇప్పటికి ఇరవైనాలుగు గంటలు పైనే అయింది. హరిహరన్‌కు ఏ ప్రమాదమూ జరగకుంటే అతనీపాటికి హోటల్‌కు రావాలి కదా? "

మల్హోత్రా తలాడించాడు. "అదే నాకూ అర్థం కాకుండా ఉంది. బై... ద... బై... మీకు ముంబయిలో రిలేషన్స్ ఎవరైనా ఉన్నారా? "

"లేరు..."

"హరిహరన్‌కు దగ్గరి స్నేహితులు? "

రమణి అడ్డుపడి అన్నాడు "సార్! ముంబాయిలో మా కుటుంబానికి, కానీ, దివాకర్ కుటుంబానికి కానీ... రిలేటివ్స్ సర్కిల్‌లో, ఫ్రెండ్స్ సర్కిల్‌లో ఎవరూ లేరు... విదేశీ ప్రయాణం కోసం అన్నయ్య అప్పుడప్పుడు ముంబయికి వస్తారంతే!"

జీప్ పోలీస్‌స్టేషన్‌ను సమీపించేటంతలో వర్షం జోరందుకుని ముంబయిని ధ్వంసం చెయ్యసాగింది.

మల్హోత్రా వర్షంలో తడుస్తూ స్టేషన్‌లోకి వెళ్ళగా... రమణీ, దివాకర్‌లిద్దరూ అతణ్ణి అనుసరించారు.

ఎస్సై మఫత్‌లాల్ తన బాన కడుపును మోస్తూ ఎదురొచ్చాడు. సెల్యూట్‌తో అటెన్షన్‌లోకొచ్చి వెంటనే కదిలాడు.

రమణీ దివాకర్‌లను మఫత్‌లాల్‌కు పరిచయం చేశాడు మల్హోత్రా.

"హరిహరన్ ప్రాణానికి ద్వారకనాథ్, శీతల్‌ల వల్ల ఏమైనా ప్రమాదం జరిగి ఉంటుందేమోనని వీళ్ళు అనుమానిస్తున్నారు. వీళ్ళు అలా అనుమానించటంలో నిజం ఉందేమోనని నా మనసుకూ తోస్తోంది. శీతల్‌ను రెడ్‌సెల్‌కు తీసుకెళ్ళి సరిగ్గా విచారణ చేస్తే అన్ని నిజాలూ బయటికి వస్తాయి".

"సారీ సార్! శీతల్ ఇప్పుడు విచారణ చేయదగిన స్థితిలో లేడు..."

"ఏమిటి మీరంటున్నది? "

"శీతల్ నుండి నిజాన్ని రాబట్టటం కోసం హెడ్ కానిస్టేబుల్ అన్వర్ బూట్ కాళ్ళతో ఇష్టమొచ్చినట్టు తన్నటంతో తల వెనక గట్టి

దెబ్బ తగిలి చనిపోయాడు సార్"

★ ★ ★

"డాక్టర్..."

నోట్లో సిగార్ పైప్‌తో పచార్లు చేస్తున్న చతుర్వేది ఆర్యా కంఠం వినగానే ఆగాడు.

"జోషితో ఫోన్‌లో మాట్లాడావా? "

"లేదు డాక్టర్ జోరున కురుస్తున్న వర్షం వల్ల ఫోన్ డెడ్ అయిపోయింది. రిసీవర్‌ను తీసుకుని చెవికి ఆనించుకుంటే ఏ శబ్దమూ రావటం లేదు... ఇంతసేపూ బటన్‌ను ప్రెస్ చేసీచేసీ విసుగొచ్చేసింది"

"సమయమూ, సందర్భమూ లేకుండా అకాల వర్షం ఒకటి. ఈ విఠల్ బాడీని ఇప్పుడేం చెయ్యాలో తెలియటం లేదు? "

"డాక్టర్.. విఠల్ బాడీని మన కార్లో వేసుకుని జోషి దగ్గరకు తీసుకెళ్ళిపోదాం. బాడీని డిస్పోజ్ చేసే పనిని ఆయనకు అప్పగించేసి వెనక్కొచ్చేద్దాం".

"డెడ్‌బాడీని మన కార్లో తీసుకెళ్లడం రిస్క్ కదూ? "

"బాడీని ఇక్కడ ఉంచుకోవడం కూడా రిస్కే కదా డాక్టర్. నిషాను వెతుక్కుంటూ విఠల్ వచ్చినట్టు విఠల్‌ను వెతుక్కుంటూ ఇంకెవరైనా ఇక్కడికి రావచ్చు కదా? "

చతుర్వేది పొగ వదులుతూ కొన్ని క్షణాలు ఆలోచించాక ఆర్యాతో అన్నాడు, "సరే, స్టోర్ రూమ్‌లో భద్రపరిచిన పాలిథీన్ బ్యాగుల్లో నుండి చిరగకుండా బాగున్న ఓ బ్యాగును తీసుకురా..."

"కంప్యూటర్లను ప్యాక్ చేసి పంపిన పాలిథీన్ బ్యాగులే కదూ డాక్టర్? "

"ఔను"

ఆర్యా టార్చ్ వేసుకుని లోపలికి వెళ్లి పది నిమిషాల్లో చేతిలో ఒక పెద్ద పాలిథీన్ సంచిని పట్టుకుని వచ్చింది. మూడడుగుల వెడల్పు ఐదడుగుల పొడవూగల ఆ సంచిలో విఠల్ శరీరాన్ని ఉంచి మూతిని తాడుతో గట్టిగా కట్టి ముగించేసరికి చతుర్వేది, ఆర్యాలకు చెమట పట్టేసింది.

"ఆర్యా"

"డాక్టర్.." ఆయాసంతో అంది ఆర్యా.

"నువ్వెళ్లి పోర్టికోలోని మన కారు డిక్కీని తెరిచి ఉంచు. కారు తాళాలు ముందుగది గోడ చీలకు తగిలించి ఉంటాయ్, తీసుకో. నేను బాడీని తీసుకొచ్చేస్తాను"

ఆర్యా తలాడించి గబగబ ముందు గదిలోకి వెళ్లింది. పాలిథీన్ మూటను లాగాడు చతుర్వేది. ఆ మొజాయిక్ నేలమీద ఆ మూట ఈజీగా కదిలింది. మూటను పోర్టికో వరకూ లాక్కెళ్లాడు చతుర్వేది. ఆర్యా కారు డిక్కీ తెరిచి ఉంచింది.

చీకట్లో వర్షం మరింత జోరుగా కురుస్తోంది. నల్లటి పలకమీద చాక్‌పీస్‌తో గీసినట్టు మెరుపులు కళ్లను జిగేల్ మనిపిస్తున్నాయి. ఆర్యా ఆత్రుతగా చతుర్వేదిని చూసింది. "డాక్టర్ వర్షం ఎక్కువైనట్టుంది. మీరు కారును సరిగ్గా డ్రైవ్ చెయ్యగలరా? "

"తప్పదుగా... ఆర్యా.."

"డాక్టర్..."

"చెప్పు"

"రాగిణిని మేజామీద అలాగే పడేసి వచ్చేశాం. ఇప్పుడు జోషి ఇంటికి వెళ్లిపోతే ఎక్స్‌పెరిమెంట్ షెడ్యూల్‌ను మళ్లీ మార్చాల్సి ఉంటుంది. అలా మార్చే పక్షంలో మనకు దక్కాల్సిన ఫ్రూట్‌ఫుల్ రిజల్ట్స్ దక్కకపోవచ్చు"

చతుర్వేది నిట్టూర్చాడు. "ఆ పాయింట్‌ను నేనూ ఆలోచించాను. మనం వేసిన ఎక్స్‌పెరిమెంట్ షెడ్యూల్ మార్చకుండా ఉండాలంటే... మనిద్దరిలో ఎవరైనా ఒకరు ఇక్కడే ఉండి ఆ ఎక్స్‌పెరిమెంట్‌ను కంటిన్యూ చెయ్యాలి. నువ్వు చేస్తావా? "

"డా... క్ట...ర్..."

"నేను కారును డ్రైవ్ చేసుకుని వెళ్లి జోషికి బాడీని డిస్పోజ్ చేసే బాధ్యతను అప్పగించి వెంటనే వచ్చేస్తాను..."

"డా... డాక్టర్... నేను ఈ బంగళాలో ఒంటరిగా..."

"భయంగా ఉందా?"

"అ...వును.."

"భయమెందుకు? నేను జోషి ఇంటికెళ్లి ఓ గంటలో వచ్చేస్తాను. కాంపౌండ్ గేట్‌కు లోపలివైపు తాళం పెట్టుకుని ల్యాబ్ లోపల రాగిణి సంబంధించిన జీన్ మ్యానిపులేషన్ వర్క్‌ను షెడ్యూల్ ప్రకారం చేసుకుంటూ ఉంటావ్. కేజ్ రూమ్‌లో ఉన్న నిషా కొన్ని గంటలవరకూ లేవదు"

"కానీ డాక్టర్... జరిగిన సంఘటనలను చూస్తుంటే భయం కలుగుతోంది..."

"నువ్వు భయపడ్డం ఇప్పుడే చూస్తున్నాను. సరే, బంగళాలో నువ్వు ఉండొద్దు... నేను ఉండి రాగిణి ఎక్స్‌పెరిమెంట్ షెడ్యూల్‌ను చూసుకుంటాను. నువ్వు కారును డ్రైవ్ చేసుకొని వెళ్లి విఠల్ బాడీని జోషికి అప్పగించేస్తావా?"

"అదీ అదీ..."

"రెంటిలో నువ్వు ఏదో ఒకటి చేసేతీరాలి... ల్యాబ్‌లో ఉంటావా? జోషి ఇంటికి వెళతావా?"

"జో.. జోషి ఇంటికే వెళతాను..."

"దట్స్ గుడ్! ఒక చెయ్యి వెయ్యి... బాడీని డిక్కీలోకి ఎక్కించేద్దాం.."

పాలిథీన్ బ్యాగులోకి కుక్కబడిన విఠల్ బాడీని ఇద్దరూ కాస్త శ్రమపడి ఎత్తి డిక్కీలో పడుకోబెట్టారు.

"కారు నిదానంగా నడుపు, ఆర్యా!"

"ఊc.."

డిక్కీని మూసి లాక్ చేశాడు చతుర్వేది.

"జోషితో ఎక్కువసేపు మాట్లాడుతూ కూర్చోకు. విషయాన్ని బ్రీఫ్‌గా చెప్పి బాడీని అప్పగించేసి వెంటనే వచ్చేసేయి"

"అలాగే డాక్టర్"

"ఇక బయలుదేరు. సిటీ మొత్తం కరెంట్ పోయినట్టుంది... జాగ్రత్త."

ఆర్యా డ్రైవింగ్ సీట్లో కూర్చుని ఇగ్నీషన్‌కీ తిప్పింది. చతుర్వేది కాంపౌండ్ గేట్‌ను బార్లా తెరిచాడు. ఉన్నట్టుండి ఆకాశంలో ఓ మెరుపు మెరిసింది. ఆ వెంటనే ఓ పెద్ద ఉరుము ఉరిమింది.

ఆర్యా కారును జోరుగా కురుస్తున్న వర్షంలో కాంపౌండ్ గేట్‌ను దాటించింది.

కారు వెనకున్న ఎర్రటి బల్బులు కనుమరుగయ్యేంత వరకూ చూస్తూ నిలబడ్డ చతుర్వేది, ఆ తర్వాత కాంపౌండ్ గేట్‌ను లోపల తాళం పెట్టి బంగళాలోకి నడిచాడు.

★ ★ ★

కమలా నెహ్రూ పార్క్‌కు వెనకున్న జోషి బంగళా పోర్టికోలో ఆర్యా కారును ఆపినప్పుడు, ఆమె చేతి వాచీ పదిన్నర గంటలను సూచిస్తోంది.

"రా... ఆర్యా! నువ్విప్పుడు ఇక్కడికి రావటం చాలా మంచిదైంది... అరగంట నుంచి డాక్టర్ చతుర్వేదికి ఫోన్‌చేసి మాట్లాడదామని ప్రయత్నిస్తున్నా ప్రయోజనం లేకపోయింది. టెలిఫోన్ రెండు పక్కలా ఫాల్ట్ ఉన్నట్టుంది. వర్షం కాస్త ఆగాక నేనే బయలుదేరి వద్దామనుకున్నాను"

ఆర్యా నుదురు చిట్లించి అంది "మీరెందుకు డాక్టర్ దగ్గరికి వద్దామనుకున్నారు?"

"లోపలికి రా.. వివరంగా చెబుతా"

ఆర్యాను వెంటబెట్టుకొని జోషి లోపలికి తీసుకొచ్చాడు. హాలు దాటి ఎదురుగా ఉన్న మేడ మెట్లెక్కి జీరోవాల్ట్ వెలుగు నిండిన ముందు గదిలోకి వచ్చారిద్దరూ.

అతణ్ని అనుసరిస్తూ లోపలికి వచ్చిన ఆర్యా, అక్కడ కనిపించిన దృశ్యాన్ని చూసి అదిరిపడింది. ఆ గదిలో గోడవారగా ఓ వ్యక్తి స్పృహ లేకుండా పడున్నాడు. తలకు తగిలిన గాయానికి బ్యాండేజీ ఉంది.

జోషికేసి చూస్తూ అంది ఆర్యా, "ఎవరు సార్ అతను?"

జోషి చిరునవ్వు చిందించాడు. "గంట

క్రితం బోనులో చిక్కుకున్న ఎలుక అది. పేరు హరిహరన్"

"ఎలుక ప్రాణంతోనే ఉన్నట్టుంది"

"ఔను"

"తల మీద... గాయం? "

"మన వాచ్‌మేన్ వాల్‌చంద్ ప్రతాపం అది..." చెప్పి నవ్వాడు జోషి.

★ ★ ★

"మావయ్యా!"

కిటికీ పక్కన నిలబడి బయట ఆకాశం లోకి చూస్తున్న మాసిలామణి... వెనక నుండి వినిపించిన గీతాంబరి గొంతు విని వెనక్కు తిరిగి చూశాడు.

గీతాంబరి భారమైన కడుపుతో ఆయాస పడుతూ నిలబడి ఉంది. ఆమెకు పూర్తిగా ముఖం చూపకుండా "ఏమ్మా? " అన్నాడు.

"భోజనానికి రండి మావయ్యా" గీతాం బరి ఎదురుగా వచ్చి నిలబడింది.

"నాకేమీ వద్దమ్మా... ఓ గ్లాసుడు పాలు మాత్రం ఇవ్వు చాలు"

"పాలైనా తాగడానికి ఒప్పుకున్నారు. అత్తయ్య కన్నా మీరే మేలు. హాల్లో సోఫా లోకొచ్చి కూర్చోండి మావయ్యా... పది నిమిషాల్లో పాలు కాచి తీసుకొస్తాను..." కుడిచేతిని నడుముపై పెట్టుకుని ముందుకొ చ్చిన కడుపుతో వంట గదికేసి వెళుతున్న కోడలిని చూస్తూ ఉండిపోయాడు. తర్వాత హాలును దాటి తిలకం గదిలోకి వెళ్ళాడు. అటు తిరిగి పడుకున్న తిలకం, అడుగుల శబ్దం విని ఇటు తిరిగింది. కళ్ళంతా తడి తడిగా ఉన్నాయి.

"తిలకం..."

"ఏం.... ఏంటండీ? "

"మనసును రాయి చేసుకుని గీతాంబరి నిద్రపోయేంత వరకైనా హాల్లో సోఫాలో కూర్చో. ఆమె సంతోషంగా ఉండాలంటే మ నం సంతోషంగా ఉన్నట్టు నటించి తీరాలి"

"నా వల్ల కాదండీ... బరువెక్కిన హృద యంతో ఎలాగండీ పెదాలపై చిరునవ్వును ప్రదర్శించటం? "

"తిలకం" అంటూ ఇంకేదో చెప్పటానికి ప్రయత్నించిన మాసిలామణి, పనిమనిషి ఆదుర్దాగా గదిలోకి రావటాన్ని చూసి మాటలాపేసి ఆమెకేసి చూశాడు.

"ఏమైందీ? "

ఆమె చేతిని విదిలిస్తూ ఆదుర్దాతో కూడిన కంఠంతో అంది, "అయ్యా, వంటింటి నేలమీద ఒలికిన నూనెమీద చిన్నమ్మగారు అడుగు పెట్టి జారి పడిపో యారు..నోట మాట రావడంలేదు..."

"అయ్యో నా కోడలా!" అని తిలకం కంగారుగా వంటగదికేసి పరుగెత్తింది. మాసిలామణి ఆదుర్దాగా వెంబడించాడు.

★ ★ ★

హాస్పిటల్

లేబర్ వార్డ్‌కు బయట బద్దలవుతున్న హృదయాలతో తిలకమూ, మాసిలామణీ నిలబడున్నారు.

ఓ గంట తర్వాత డాక్టర్ మనోరంజితం దిగులుపడ్డ ముఖంతో బయటికొచ్చింది. నుదుటి నుండి చెమట ధార కడుతోంది. మాసిలామణి ఆదుర్దాగా అడిగాడు "డాక్టర్, గీతాంబరికి ఇప్పుడెలా ఉంది? "

మనోరంజితం ఆయనకేసి చూసింది. "గీతాంబరి కాలు జారిపడటం వల్ల కడు పుకు బలమైన దెబ్బ తగిలింది. అందువల్ల పెద్దప్రాణం, చిన్న ప్రాణం రెంటికీ ప్రమాదం ఏర్పడింది. రెండు ప్రాణాల్నీ కాపాడగలనా అని అనుమానం..."

"డా... డాక్టర్ మీరేమంటున్నారు? "

"ఎస్. నార్మల్ డెలివరీకి వీలులేదు. బిడ్డను కాపాడాలంటే వెంటనే ఆపరేషన్ చేసి బిడ్డను బయటికి తీయాలి. కానీ పెద్ద ప్రాణం ఇప్పుడు ఆపరేషన్ తట్టుకోలేదు"

పక్కనున్న తిలకం అడ్డుపడింది. "డాక్టర్ నా కోడల్ని ఎలాగైనా కాపాడండి..."

"మేమూ ఆ నిర్ణయానికే వచ్చేశాం. అందుకే ఆపరేషన్ చెయ్యదలచుకోలేదు" అని బదులిచ్చి డాక్టర్ లేబర్ వార్డ్‌కేసి వేగంగా నడిచింది. తిలకాన్ని అక్కడున్న కుర్చీలో కూర్చోబెట్టి డాక్టర్‌ను కలుసుకున్నాడు మాసిలామణి.

"డాక్టర్, మీ వెనకే నేనిప్పుడు రావటానికి గల కారణం మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడుదామనే..."

"ఏంటదీ? " డాక్టర్ ఆగి అడిగింది.

"ఇది బయట ఎవరికీ తెలియకూడదు... ముఖ్యంగా నా భార్యకు..."

"చెప్పండి... ఏంటదీ? "

"డాక్టర్, ఎలాగైనా ఆపరేషన్ చేసి నా కొడుకు వారసుణ్ణి కాపాడండి డాక్టర్..."

ఆశ్చర్యంగా చూసింది మనోరంజితం.

"మీరేమంటున్నారు... పెద్ద ప్రాణం అక్కరలేదా? "

"వొద్దు డాక్టర్... ఆమె కన్నా నాకు ఆ బిడ్డ కావాలి!"

"ఎందుకలా అంటున్నారు? "

ఓ ప్రమాదంలో తన కొడుకు హరిహరన్ మరణించిన సంఘటన నుండి అన్నీ డాక్టర్‌తో చెప్పాడు మాసిలామణి.

"డాక్టర్... భర్త చనిపోయాడని తెలిసిన ఆ షాక్‌లో ఆమె ప్రాణం పోయేదానికన్నా, వారసుణ్ణి ఇచ్చేసి ఆనందంగా వెళ్ళిపోనీ"

మనోరంజితం ఆశ్చర్యంగా తన కళ్ళకున్న అద్దాలను తీసింది.

"మీ కొడుకు హరిహరన్ చనిపోయిన విషయం తెలిస్తే గీతాంబరి ప్రాణానికి ప్రమాదమని భావిస్తున్నారా? "

"కచ్చితంగా! గీతాంబరి గురించి మాకు బాగా తెలుసు. ఆ అమ్మాయి మాకు కోడలే అయినా కూతురులాంటిది. ఆమెతో అభిమానంగా మెలిగిన పక్కింటి పెద్దాయన ఒకరు ఉన్నట్టుండి చనిపోతే తట్టుకోలేక స్పృహ కోల్పోయింది. పదిరోజులదాకా అన్నం కూడా తినలేదు. ఎవరో పరాయి వ్యక్తి మరణానికే ఇంతగా చలించిపోయిన గీతాంబరి, భర్త మరణాన్ని ఎలా తట్టుకోగలదని అనుకుంటున్నారు, డాక్టర్? "

"..........."

"డాక్టర్... గీతాంబరి రెండేళ్ళు ఆనందంగా సంసార జీవితాన్ని గడిపింది. ఓ బిడ్డకు తల్లైంది. ఈ సంతోషాలతో భర్త చనిపోయిన విషయం తెలియకుండానే ఆమె వెళ్ళిపోయినా ఫర్వాలేదు... ఆమెను ఈ లేతవయసులో విధవరాలిగా చూడ్డానికి మాకెవరికీ శక్తిలేదు డాక్టర్..."

"అంటే బిడ్డను కాపాడ్డానికి వెంటనే చర్య తీసుకోవాలంటారు... అంతే కదా? "

"ఔను డాక్టర్! గీతాంబరి జీవితం హరిహరన్‌తో ముగిసిపోయింది. కానీ ఆ శిశువు జీవితం ఇకపైనే ప్రారంభం కాబోతుంది. దాన్ని తుంచెయ్యకూడదు డాక్టర్"

"సరే... నాకు చేతనైనంత వరకూ రెండు ప్రాణాల్నీ కాపాడ్డానికి ప్రయత్నిస్తాను. ఆపరేషన్‌చేసి బిడ్డను కాపాడుతాను... ఆపైన భగవంతుడున్నాడు..." అని చెప్పి డాక్టర్ మనోరంజితం లేబర్ రూమ్‌లోకి వెళ్ళింది.

"అది చాలు డాక్టర్..." మాసిలామణి పైగుడ్డతో కళ్లద్దుకున్నాడు.

## 6




**రహదారిపై** నిలిచిన వర్షపు నీటిని చీల్చుకుంటూ హోటల్ సిల్వర్ శాండ్ కేసి దూసుకెళుతోంది పోలీస్ జీప్!

జీప్ లోపల రమణీ, దివాకర్, ఎస్సై మల్హోత్రా కూర్చుని ఉన్నారు.

రమణి మనసులో అర్థంగాని అయోమయం గూడుకట్టుకుని ఉంది. ప్రమాదంలో మరణించింది అన్నయ్య కాదని తెలియగానే ఆనందంతో ఒళ్ళంతా పులకించిపోయింది. కానీ కొత్త అనుమానం దాన్ని మింగేస్తోంది.

దివాకర్ మొదట మాట్లాడాడు, "ద్వారకనాథ్, శీతల్ ఇద్దరూ హరిహరన్‌కు ఏ హానీ కలిగించి ఉండరని మీరనుకుంటున్నారా సార్? "

"ష్యూర్! పోలీసుల రికార్డ్స్ ప్రకారం, ఆ ఇద్దరూ సూట్‌కేస్ లిఫ్టర్స్ మాత్రమే... హత్యలు చేసే రకం కారు. హరిహరన్ కనిపించకపోవటం గురించి హోటల్ స్టాఫ్‌ను విచారణ జరిపితే, క్లూ దొరకొచ్చు అది ఓ వైపు... మరోవైపు నా మనసులో కొన్ని అనుమానాలున్నాయి. అడగనా? "

"అడగండి ఇన్‌స్పెక్టర్..."

"హరిహరన్ లిక్కర్ పుచ్చుకునేవాడా? "

"నో..."

"అమ్మాయిలు..."

"నెవర్! సార్, మీరనుకొనే విధంగా హరిహరన్‌కు ఏ చెడు అలవాటూ లేదు. సెల్ఫ్ కంట్రోల్, సివిలైజేషన్ అన్నయ్యకు కాస్త ఎక్కువే... ఉన్నాయి..."

వాళ్ళు అలా మాట్లాడుకుంటూ ఉండగానే జీపు సిల్వర్ శాండ్ హోటల్ ముందు ఆగింది. ముగ్గురూ క్రిందికి దిగారు.

దివాకర్ అన్నాడు, "రమణీ! ముందు మీ ఇంటికి ఫోన్‌చేసి 'లారీ ప్రమాదంలో చనిపోయింది హరిహరన్ కాదు' అన్న విషయం చెప్పేద్దాం. దాంతో అక్కడున్నవాళ్ళకు ఓ తాత్కాలిక ఆనందం కలుగుతుంది"

టెలిఫోన్ కౌంటర్‌ను సమీపించాడు రమణి. "మద్రాస్‌కు ఓ ఎస్టీడీ కాల్ చేసుకోవచ్చా? " అడుగుతూ టెలిఫోన్‌ను తాకడానికి ప్రయత్నించగా, రిసెప్షనిస్ట్ నవ్వుతూ బదులిచ్చింది! "క్షమించాలి, వర్షం కారణంగా టెలిఫోన్ పనిచేయటంలేదు".

దాంతో దివాకరూ, రమణీ నిరాశగా ఒకరినొకరు చూసుకున్నారు.

మల్హోత్రా రిసెప్షనిస్టుతో హిందీలో మాట్లాడ్డం మొదలుపెట్టాడు.

"మిస్టర్ హరిహరన్ బసచేసిన గది తాళం చెవి కావాలి..."

"సీల్ వేసిన గదిదే కదు సార్? "

"ఔను..."

కీ తీసిచ్చింది రిసెప్షనిస్టు.

"ఆ గదికి సర్వీస్ బేరర్ ఎవరు? "

"యాదవ్"

"ప్లీజ్ కాల్ హిమ్"

రిసెప్షనిస్టు ఇంటర్‌కమ్‌లో ఎవరితోనో మాట్లాడింది. కాస్సేపట్లోనే ఇరవై ఏళ్ళ యాదవ్ యూనిఫామ్‌తో పరుగెత్తుకొచ్చాడు. అంత వర్షంలోనూ ముఖంలో చెమటలు పడుతున్నాయి.

"సాబ్"

"గదిలో బసచేసిన హరహరన్‌కు సర్వీస్ చేసింది నువ్వే కదూ? "

"ఔను సాబ్"

"ఆయన గదిలో ఉన్నప్పుడు ఆయన్ను కలవడానికి ఎవరైనా వచ్చారా? "

"నేను గమనించలేదు సాబ్..."

"ఆయనకు ఏమైనా సర్వీస్ చేశావా? "

"భోజనం తెమ్మన్నారు, తీసుకెళ్ళాను..."

"ఇంకేమైనా అడిగారా? "

"లేదు..."

"నువ్వు ఆయన గదిలో ఉండగా ఆయనకు ఫోన్ ఏమైనా వచ్చిందా? "

"ఫోన్ రాలేదు సాబ్... కానీ, ఓ టెలిఫోన్ నెంబరు కోసం డైరెక్టరీని తెప్పించి వెదకటం చూశాను"

ఆ మాటలు మల్హోత్రాలో కొంత ఉత్కంఠను పెంచాయి.

"ఏమన్నావ్? ఫోన్ డైరెక్టరీని తెప్పించి ఏదో నెంబరు కోసం వెదికాడా?"

ఎస్సై పెద్ద గొంతుతో అడగ్గా, బేరర్ యాదవ్ ఔనన్నట్టు తలాడించాడు.

"ఆ నెంబరుకి ఫోన్ చేశాడా?"

"లేదు. నేను భోజనం తీసుకెళ్ళి టీపాయ్ మీద పెట్టగానే డైరెక్టరీని అట్టే పడేసి ఫోం చెయ్యడానికి లేచి వచ్చారు. నేను క్రింద ఉన్న క్యాటరింగ్ సెక్షన్‌కు వెళ్ళి పాలు పట్టు కొచ్చేలోపు ఆయన భోజనం పూర్తిచేసి టెలి ఫోన్ పక్కన కూర్చుని డయల్ నెంబర్లను నొక్కుతూ కనిపించారు. నేను ఆయన భోజనం చేసిన చోటు శుభ్రం చెయ్యటం ప్రారంభించాను".

"హరిహరన్ ఫోన్‌లో ఎవరితోనైనా మాట్లాడాడా?"

"ఆయనకు ఇంకేమైనా కావాలేమోనని అడగడానికి ఓ నిమిషం నిలబడ్డప్పుడు, ఆయన టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌కు డయల్‌చేసి, ఓ పేరు చెప్పి నెంబరు అడిగాడు..."

రమణి ఆదుర్దాగా అడ్డుపడ్డాడు. "హరిహ రన్ ఎవరి పేరు చెప్పాడు?"

యాదవ్ తల గోక్కున్నాడు.

"గుర్తులేదు సాబ్..."

"కాస్త ఆలోచించు..."

"ఆయన టెలిఫోన్‌లో మాట్లాడుతున్న ప్పుడు వేగంగా ఇంగ్లీష్‌లో మాట్లాడారు సాబ్. చెవికి కొన్ని మాటలు వినిపించ లేదు. కానీ, ఏదో ఫోన్ నెంబరు తెలుసుకో వటం కోసం ప్రయత్నిస్తున్నట్టు మాత్రం అర్థమైంది."

"ఆయన అడిగిన నెంబరు దొరికిందా?"

"దొరికిందనే అనుకుంటున్నాను. ఎందు కంటే, నేను గదిని వదిలిపెట్టి బయటికి వెళ్తున్నప్పుడు ఆయన ఫోన్లో తన గొంతును పెంచి 'ఆc... అవును.. పేరు అదే... నెంబర్ చెప్పండి మేడమ్... నోట్ చేసుకుం టాను' అని చెప్పటం విన్నాను"

"నెంబరును ఎందులో నోట్ చేసుకు న్నారు?"

"తెలియదు సాబ్. చేతిలో బాల్‌పా యింట్ పెన్ను పట్టుకున్నారు. ఎందులో నోట్ చేసుకున్నారో గమనించలేదు..."

"చేతిలో బాల్‌పాయింట్ పెన్ పట్టు కున్న హరిహరన్, ఎక్స్ఛేంజ్‌లో చెప్పిన టెలి ఫోన్ నెంబర్‌ను తాను వెదుకుతున్న డైరెక్ట రీలోనో లేక గదిలో దొరికిన ఏదైనా చిన్న కాగితం ముక్కలోనే రాసుండాలే.."

"గదిలోకి వెళ్లి చూద్దామా సార్?"

"రండి..."

బేరర్ యాదవ్‌ను వెంటబెట్టుకొని ముగ్గురూ లిఫ్ట్‌కేసి దారితీశారు.

లిఫ్టులో ముప్పై సెకన్లు ప్రయాణం చేశాక ఐదో అంతస్తు చేరుకున్నారందరూ.

హరిహరన్ బస చేసిన 527వ నెంబరు గది సీల్‌ను తీయించి తాళం తెరిచాడు మల్హోత్రా. అంతా లోనికి వెళ్లారు.

విశాలమైన గది. సోఫాను దాటుకుని క్రింద పరిచిన కార్పెట్‌పై అడుగులు వేస్తూ టెలిఫోన్ సమీపానికి వెళ్లాడు మల్హోత్రా. టీపాయ్ మీద టెలిఫోన్ డైరెక్టరీ కనిపిం చింది. కుడిపక్కన మేజా... పొడవాటి అద్దమూ... దర్శనమిచ్చాయి.

"హరిహరన్ ఎక్కడ కూర్చొని ఫోన్ చేశాడు..." అని మల్హోత్రా అడగ్గా, యాదవ్ ఓ కుర్చీని చూపించాడు.

"ఇందులో కూర్చునే సాబ్..."

మల్హోత్రా ఆ కుర్చీలో కూర్చుని, టెలిఫోన్ రిసీవర్‌ను తీసుకున్నాడు. కుడిచేత్తో బాల్ పాయింట్ పెన్ పట్టుకున్నాడు.

"ఈ పొజిషనే కదూ?"

"ఔను సాబ్..."

"మిస్టర్ రమణీ..."

"సార్.."

"మీ బ్రదర్ హ్యాండ్‌రైటింగ్ మీకు పరిచ యమే కదూ?"

"అవును సార్..."

"ఆ టెలిఫోన్ డైరెక్టరీని తీసుకుని, మొదటి పేజీనుండి చివరి పేజీ వరకు జాగ్రత్తగా త్రిప్పి చూస్తూ హరిహరన్ చేతి రాతతో ఏదైనా నెంబర్ కనిపిస్తుందేమో చూడండి..."

రమణి టెలిఫోన్ డైరెక్టరీని తీసుకోగా, మల్హోత్రా దివాకర్ వైపునకు తిరిగాడు. "మిస్టర్ దివాకర్! యు డూ వన్‌థింగ్... ఈ గదిని కాస్త నిశితంగా పరిశీలించి, నెంబరు రాసిన కాగితపు ముక్క ఏదైనా కనిపిస్తుందేమో వెదకండి..."

దివాకర్ తలాడించి వార్డ్‌రోబ్ పక్కకు వెళ్లాడు. మల్హోత్రా చేతిలో బాల్‌పాయింట్ పెన్ పట్టుకుని తన దృష్టిని నాలుగువైపులా తిప్పాడు.

'హరిహరన్ ఆ టెలిఫోన్ నెంబర్‌ను తనకు అనుకూలంగా ఎక్కడ రాసుంటాడు?' బాల్‌పాయింట్ పెన్ పట్టుకున్న చెయ్యి అందేంత దూరంలో ఉన్న టీపాయ్‌ను, మేజాను నిశితంగా పరిశీలించాడు ఎస్సై. రోజ్ ఉడ్‌తో చేసిన ఆ రెండూ పాలిష్‌తో తళతళలాడుతున్నాయి. వాటిపై అంకెలేవీ కనిపించలేదు.

గదిలో కాసేపు నిశ్శబ్దం రాజ్యమేలింది. రమణి టెలిఫోన్ డైరెక్టరీని తిప్పి చూస్తుండగా, దివాకర్ సోఫా కిందకు వంగి కాగితం ముక్క ఏదైనా కనిపిస్తుందేమోనని వెదకసాగాడు. చేతులు కట్టుకుని గోడవారగా నిలబడున్న బేరర్ యాదవ్, తన వంతుగా దృష్టిని అటు ఇటు తిప్పుతున్నాడు. ఉన్నట్టుండి అతడి చూపులు ఓచోట ఆగిపోయాయి.

పెదాలు యాంత్రికంగా... "సాబ్... అక్కడ చూడండి!" అని పలికాయి.

★ ★ ★

హరిహరన్‌ను సమీపించి ముఖాన్ని పరిశీలనగా చూసి జోషి వైపు తిరిగింది ఆర్యా. "ఇది చెన్నై ఎలుకా సార్?"

## అగ్ర రాజ్యాలపై చెణుకు

కలకత్తాలోని రోటరీ సమావేశానికి అధ్యక్షత వహించిన సర్ సి.వి. రామస్వామి అయ్యర్ అద్భుతంగా ప్రసంగించి శ్రోతలను ముగ్ధుల్ని చేశారు. ఆ సభలో అమెరికా, రష్యా రాయబారులు కూడా ఉన్నారు. ముఖ్య అతి



థిగా రాజాజీ ఛలోక్తులు విసురుతూ అందరినీ ఉల్లాసపరిచారు. తన ప్రసంగం చివర్లో 'అమెరికా చమురు, రష్యా కాస్టిక్ సోడా.. రెంటినీ కలిపి తయారుచేసిన సబ్బు బిళ్లతో ప్రపంచంలోని కాలుష్యాన్నంతా పోగొట్టవచ్చు' అన్నారు.

శ్రోతల కరతాళధ్వనులతో సభా భవనం మారుమోగింది. అమెరికా, రష్యన్ రాయబారులిరువురూ ఆప్యాయంగా కరచాలనం చేసుకున్నారు. ఆ దేశాల మధ్య ప్రచ్ఛన్నయుద్ధం సాగుతున్న రోజుల్లో ఈ సంఘటన జరిగింది.

"ఔను..."

"గొప్పింటి బాపతులా ఉంది..."

"చాలా గొప్పింటి మనిషి. చేతిలో నాలుగైదు కంపెనీలున్నాయి. అన్నీ రెప్యూటెడ్ కన్‌సర్న్స్. పదే పదే విదేశాలకు ఎగిరిపోయే జాతి. బిజినెస్‌రీత్యా గత రెండు నెలలుగానే నాకు పరిచయం."

"కాస్త కాస్ట్లీ ఎలుకగా కనిపిస్తోంది. తర్వాత ఏ సమస్యా రాదుకదా సార్?"

"రాదు"

"సార్, ఈరోజు డాక్టర్‌కూ సరే, నాకూ ఏమీ బాగాలేదు. ఎన్నెన్నో సమస్యలు. రాగిణిని పెట్టుకుని జీన్ ట్రాన్స్‌ఫర్ ప్రయత్నాలు చేస్తుండగానే నిషా వచ్చింది.

ఆమెను ఫేస్ చేసి కేజ్ రూములో బంధించగానే విరల్ వచ్చాడు. అతణ్ణి హ్యాండిల్ చేస్తున్న సమయంలో ఊహించని చావు... విరల్ బాడీని డిస్పోజ్ చెయ్యటంకోసం మీ దగ్గరకొస్తే, మీరో ఎలుకను పట్టుకున్నారు. ఈ రాత్రి గడిచి తెల్లవారేలోపు ఇంకా ఎన్ని సమస్యల్ని ఎదుర్కోవలసి వస్తుందేమోనని నాకు భయంగా ఉంది..."

జోషి నిటారుగా కూర్చుని అన్నాడు. "విరలా... ఎవరతను? "

"నిషాను వెతుక్కుంటూ వచ్చినవాడు. నిషాను ప్రేమించే యత్నంలో ఆమెను ఫాలో అవుతున్న రోమియో. డాక్టర్ బంగళాకు నిషా వచ్చినప్పుడు అతనూ వెంబడించి వచ్చాడు. లోపలికెళ్లిన నిషా బయటకు రాలేదని తెలిసి కుతూహలాన్ని ఆపుకోలేక లోపలికొచ్చి చచ్చాడు."

"ల్యాబ్‌లోకి దూరిన వ్యక్తి అతడేనా? "

"ఔను! ప్రాణాలతో పట్టుకుని కేజ్ రూమ్‌కు తీసుకెళ్లాలని అనుకొన్నాం. కానీ వీలు కాలేదు! డాక్టర్ తుపాకీ తూటాకు అనుకోకుండా బలయ్యాడు. బాడీని బంగళా లోపల ఉంచుకోవటం ప్రమాదం అని డాక్టర్, దాన్ని డిస్పోజ్ చేసే పనిని మీకు అప్పగించమన్నారు.."

"బాడీ ఎక్కడ? "

"కారు డిక్కీలో ఉంది."

"డాక్టర్... బంగళాలోనే ఉన్నారా? "

"ఔను! రాగిణితో ఇవ్వాళ మొదలుపెట్టిన ఎక్స్‌పెరిమెంట్ షెడ్యూల్ ఈ రాత్రిలోపే పూర్తి చేయకపోతే, ఆశించిన ఫలితం దక్కదు. సో, ఎక్స్‌పెరిమెంట్‌ను కంటిన్యూ చెయ్యడానికి డాక్టర్ బంగళాలోనే ఉండి, నన్ను మాత్రం ఇక్కడికి పంపారు."

జోషి నవ్వాడు.

"నువ్వు చచ్చిన ఎలుకను తీసుకొచ్చావ్. నేనిక్కడ ప్రాణంతో ఉన్న ఎలుకతో నీ కోసం ఎదురుచూస్తున్నాను... ఎక్ఛేంజ్ చేసుకుందామా? "

హరిహరన్‌ను ఓసారి చూసి తర్వాత జోషిని చూసింది ఆర్యా. "ఎరవేసి పట్టిన ఎలుకా ? లేకతానుగా వచ్చి చిక్కిందా? "

జోషి పెద్దగా నవ్వాడు.

"తానుగా వచ్చి చిక్కిన ఎలుక..."

"ఎలా? "

"నీకు తెలుసుగా ఆర్యా! మార్కెట్‌లో ఏ కంపెనీ ప్రొడెక్ట్ ఫాస్ట్‌గా మూవ్ అవుతుందో, అదే మాదిరి నకిలీ ప్రొడెక్ట్‌ను తయారుచేసి మార్కెట్లో అమ్మి డబ్బు సంపాదించటం నా వ్యాపారమని..."

"ఔను..."

"ఆ విధంగానే హరిహరన్ కంపెనీ ప్రొడెక్ట్ ఒకదాన్ని తయారుచేసి మార్కెట్‌లో పెట్టాను. జర్మనీకి వెళ్లటానికి ముంబాయికి వచ్చిన హరిహరన్, దానికి సంబంధించి నాతో మాట్లాడ్డానికి ఫోన్లో ప్రయత్నించాడు. ఫోన్లో నేను దొరకనందు వల్ల నేరుగానే వచ్చేశాడు. మొదట్లో మాటలు క్యాజువల్‌గానే ఉన్నాయి. రాన్రానూ... హరిహరన్ మాటల్లో తీవ్రత కనిపించింది. ఓ దశలో దొమ్మీకి దిగటంతో... శబ్దం విని లోపలికొచ్చిన వాచ్‌మేన్ వాల్‌చంద్, తన చేతిలో ఉన్న లాఠీతో హరిహరన్ తలమీద ఒకే దెబ్బ.. మనిషి నోటిమాట లేకుండా పడ్డాడు" అంటూ బయటికి చూస్తూ అరిచాడు జోషి. "వాల్‌చంద్..."

అతడు వెంటనే పరుగెత్తుకుని వచ్చాడు. హిందీలో వినయంగా "అయ్యా" అన్నాడు.

"ఇలా రా..."

వాల్‌చంద్ జోషీ సమీపానికి వెళ్లాడు.

"ఆర్యా వచ్చిన కారు డిక్కీ తెరిచి, లోపలున్న బాడీని తీసుకొచ్చేయ్..."

"అలాగేనయ్యా..."

"ఆ పనిని పూర్తిచేశాక, ఈ మనిషిని తీసుకెళ్ళి ఆ కారు వెనకసీటు కింద పడుకో

బెట్టేయ్..."

"అలాగేనయ్యా..." వాల్‌చంద్ తలా డించి బయటికెళ్ళగా, జోషి వైపుకు తిరి గింది ఆర్యా.

"సార్... ఈ హరిహరన్‌ను... ఈ రాత్రికి ఇక్కడే ఉంచుకోండి. రేపు ఉదయం నేనూ డాక్టరూ వచ్చి తీసుకెళ్ళిపోతాం"

"ఎందుకూ? "

"కార్లో తీసుకెళుతున్నప్పుడు హరిహరన్‌కు ఏ క్షణాన్నైనా స్పృహ రావచ్చు. అలా జరి గిందంటే, కారును నడిపే నేను అతణ్ణి ఎదు ర్కోవడం కష్టం? "

"అది నాకు తెలియదా ఏం? వాల్‌చంద్ నీకు తోడుగా వచ్చి, హరిహరన్‌ను డాక్టర్‌కు అప్పగించి వస్తాడు, సరేనా? "

ఆర్యా ముఖంలో ఓ ఇన్‌స్టెంట్ ప్రశాం తత కనిపించింది. "అలా అయితే సరే..."

"విఠల్‌ను చీకటిపడేలోపు డిస్పోజ్ చెయ్యటం నా వంతు. హరిహరన్‌ను జీన్ ట్రాన్స్‌ఫర్ ఎక్స్‌పెరిమెంట్‌కు ఉపయోగిం చుకొని బాడీని లేకుండా చెయ్యటం మీ వంతు... ఏమైనా హరిహరన్ తప్పించుకో కూడదు..."

ఆర్యా చిన్నగా నవ్వింది "డాక్టర్ వద్ద ఏ ఎలుక చిక్కినా సరే... రెండురోజుల్లో దానికి కపాల మోక్షమే... అక్కడికి వచ్చిన ఏ ఎలుకా ఇందాకా తిరిగొచ్చింది లేదు..."

అంతలో వాల్‌చంద్ తన భుజమ్మీద విఠల్‌ను సునాయాసంగా మోసుకొ చ్చాడు...

"అయ్యా... ఎక్కడ పడేయమంటారు? "

"పనికిరాని సామాన్లు ఉంచే వెనక గదిలో పడేసి రా... ఈ హరిహరన్‌ను డాక్టర్ బంగళాకు తీసుకెళ్ళాలి..."

వాల్‌చంద్ తలాడించి వేగంగా బంగళా వెనక్కి వెళ్ళగా, జోషితో ఏదో చెప్పడానికి నోరు తెరిచింది ఆర్యా... ఇంతలో మనిషి మూలిగే శబ్దం వినిపించింది.

"మ్... మ్... మ్..." చప్పున ఇద్దరూ వెనక్కి తిరిగి చూశారు.

గోడవారగా పడున్న హరిహరన్, రెండు చేతుల్తో తన తలను పట్టుకొని లేచి కూర్చో వడానికి ప్రయత్నిస్తున్నాడు. జోషి కళ్ళు క్రమంగా ఎర్రబడ్డాయి. హరిహరన్‌కేసి వేగంగా నడవబోయాడు.

చప్పున ఆర్యా అతణ్ణి వారించి- "సార్... ఇప్పుడు అతణ్ణి ఏం చెయ్యబోతున్నారు? " అని అడిగింది.

"అతడి నోటికి ప్లాస్టర్ అతికించి, రెండు చేతుల్ని వెనక్కు కట్టేయాలి. లేకుంటే కార్లో బంగళాకు తీసుకెళ్ళటం కష్టమవుతుంది."

"అంత బాధ అతడికొద్దు..."

"మరి? "

"అతణ్ణి మళ్ళీ మత్తులోకి నెట్టేద్దాం"

"ఎలా? "

"కార్ డాష్‌బోర్డులో ఎప్పుడూ సెడిటివ్ ఇంజెక్షన్ తయారుగా ఉంటుంది. ఓ డోసు ఇస్తే సరిపోతుంది. మూడుగంటల వరకూ లేవలేడు. ఏ నిమిషంలోనైనా ల్యాబొరేటరీ పరిశోధనకు ఎలుకలు అవసరమవుతా యన్న కారణంగా డాక్టర్ తన కారు డాష్ బోర్డులో ఈ సెడిటివ్ ఇంజెక్షన్‌ను సిద్ధంగా పెట్టుకుంటారు."

జోషి ఊపిరి పీల్చుకుంటూ "మంచి పని చేశారు... వెళ్ళి తీసుకురా..."

ఆర్యా పోర్టికోలో నిలబెట్టి ఉన్న కారువ ద్దకు వెళ్ళి ఇంజెక్షన్‌ను తీసుకొచ్చింది.

రెండు చేతులతో తలను పట్టుకుని లేవ టానికి ప్రయత్నిస్తున్న హరిహరన్‌ను జోషీ కదలకుండా పట్టుకోగా, ఆర్యా ఇంజెక్షన్ మందును సిరంజిలోకి ఎక్కించి హరిహరన్ భుజంలోకి దింపింది.

పది నిమిషాలే!

హరిహరన్ తల పక్కకు వాలింది. ఆర్యా నవ్వింది. "ఇక దిగులు లేదు సార్... మూడు గంటల తర్వాత అతడి రక్తంలో

కలిసిన మందు బలహీనపడుతుంది. అంత వరకూ అతని శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరికినా నోరెత్తడు"

వాల్ చంద్ లోపలినుండి బయటికొచ్చాడు. జోషి అతనితో అన్నాడు "బాడీని భద్రంగా దాచావా? "

"దాచానయ్యా..."

"సరే, ఇతణ్ణి తీసుకెళ్ళి ఆర్యా కారు వెనకసీటు క్రింద పడుకోబెట్టేయ్. నువ్వా డాక్టర్ ఇంటిదాకా ఆర్యాకు తోడు వెళ్ళిరా"

"సరేనయ్యా..."

హరిహరన్‌ను ఓ పసివాడిలా రెండు చేతుల్తో పైకెత్తుకుని వాల్ చంద్ పోర్టికోలో నిలబెట్టున్న కారుకేసి నడిచాడు. జోషితో అంది ఆర్యా! "మరి వెళ్ళిరానా సార్..."

"ఒక్క నిమిషం!" జోషి చెయ్యి అడ్డుపెట్టాడు.

"ఏంటి సార్."

"నీతో కాస్త మాట్లాడాలి"

"చెప్పండి"

"నేనిప్పుడు చెప్పబోయే విషయం డాక్టర్‌తో నువ్వు చెప్పకూడదు"

"మీరు చెప్పొద్దన్నాక ఎందుకు చెబుతా"

"ఇలా కూర్చో ఆర్యా"

ఆర్యా కూర్చోగానే జోషి కూడా కూర్చున్నాడు. కాసేపు మౌనం తర్వాత నోరు విప్పాడు "డాక్టర్ చతుర్వేది చేస్తున్న జీన్ ట్రాన్స్‌ఫర్ పరిశోధన గురించి నీకున్న నిజమైన అభిప్రాయమేంటి? "

"గొప్ప పరిశోధన. దాని గురించి తెలియగానే రేపు వైద్యరంగమే ఆశ్చర్యపోతుంది"

"వైద్యరంగం రేపు ఆశ్చర్యపోవటం మాట అటుంచు ఆర్యా... ఆ జీన్ ట్రాన్స్‌ఫర్ పరిశోధన ప్రస్తుత పరిస్థితి ఏంటి? పరిశోధన విజయవంతమవుతుందా? కాదా? "

"అదీ... అదీ... దాని గురించి..."

"నీ మనసుకేంతోస్తే అదే చెప్పు ఆర్యా!"

"డాక్టర్ చతుర్వేది పరిశోధన ప్రారంభ దశలను దిగ్విజయంగా దాటేశారు. త్వరలోనే విజయాన్ని అందుకోవచ్చు"

"నీ అంచనాలో నిజం ఉందా? ... లేక అనుమానాలున్నాయా? "

ఆర్యా నవ్వింది "సార్, మీకు డాక్టర్ మీద నమ్మకం లేదనుకుంటున్నాను"

"కొంతవరకూ!"

"యూ ఆర్ రాంగ్ సార్. జీన్ ట్రాన్స్‌ఫర్ పరిశోధనలో డాక్టర్ ఆశించిన ఫలితం దక్కగానే మీ కొడుకు నకుల్ మెదడులో ఏర్పడిన లోపాన్ని నెలలోపే కచ్చితంగా నయం చేసేస్తారు..."

జోషి దీర్ఘంగా నిట్టూర్చాడు. "దాన్ని నమ్మటానికే నాకు కష్టంగా ఉంది"

"నమ్మండి సార్... జీన్ ట్రాన్స్‌ఫర్ పరిశోధనలో డాక్టర్ చతుర్వేదికి మహత్తరమైన విజయం లభించి తీరుతుంది..."

"నాకింకో అనుమానం కూడా ఉంది.."

"ఏంటి సార్? "

"జీన్ ట్రాన్స్‌ఫర్ ద్వారా నా కొడుకు మెదడులోని లోపం సరిచేసిన తర్వాత వాడికి మరే సమస్యలూ రావు కదా? "

ఆర్యా నవ్వింది. "సార్, ఈ పరిశోధన గురించి మీరు సరిగ్గా అర్థం చేసుకున్నట్టు లేదు. డాక్టర్ చతుర్వేది మీ కొడుక్కు ఏం చెయ్యబోతున్నారో మీకు అర్థమయ్యేలా చెప్పాను. మెదడులో పిట్యూటరీ గ్రంథిలో లక్షలకొద్దీ కణాలు ఉంటాయన్న విషయం మీకూ తెలుసు. ఆ కణాల లోపల ఉండే డి.ఎన్.ఎ. అంశంలో ఒక భాగమే ఈ జీన్. మన ఒంట్లో జరిగే అన్ని రకాల కార్యకలాపాలకూ... ఒక మనిషి నడుచుకునే తీరుతెన్నులకూ ఈ జీనే ప్రధాన కారణం. మీ కొడుకు మెదడులో ఏర్పడ్డ లోపానికి కూడా ఈ జీనే కారణం. మెదడులోని లోపానికి కారణమైన ఆ జీన్లను తొలగించి, వాటి స్థానంలో ఆరోగ్యకరమైన వ్యక్తి యొక్క పిట్యూటరీ గ్రంథిలోని మంచి

జీన్లను తీసి అమర్చే పనినే డాక్టర్ చెయ్యబోతున్నారు. మీ కొడుకు మెదడు భాగంలో ఆ ఆరోగ్యకరమైన మంచి జీన్‌లు వృద్ధి చెంది ఓ నిర్ణీత సమయం లోపల మెదడు లోని లోపం సరైపోతుంది. సైడ్ ఎఫెక్ట్స్ రావటానికి అవకాశమే లేదు"

అప్పటికిగానీ జోషి ముఖంలో ఆనందం కనిపించలేదు.

"డాక్టర్ వద్ద ఈ అనుమానాలన్నీ అడిగితే ఆయన కోపగించుకుంటారన్న కారణంగానే నిన్ను అడిగాను ఆర్యా"

"సార్! మీ అబ్బాయి గురించి మీకిక దిగులు అక్కరలేదు. ఇప్పుడు ప్రస్తుతం మా వద్ద నిషా, హరిహరన్ అన్న రెండు ఆరోగ్యకరమైన ఎలుకలున్నాయి. అందులో ఏదో ఒక ఎలుక యొక్క పిట్యూటరీ గ్రంధి జీన్‌లు తీసి నకుల్‌కు అమరుస్తారు డాక్టర్ చతుర్వేది. పరిశోధన అంతిమ ఘట్టానికి చేరుకుంది" అంది ఆర్యా. మళ్లీ తన గొంతు తగ్గించి "మీ అబ్బాయి నకుల్ ఇప్పుడెక్కడున్నాడు సార్? " అడిగింది.

"పూనాకు పక్కనున్న లోనావాలా గెస్ట్‌హవుజ్ బంగళాలో, ఓ ఫ్యామిలీ డాక్టర్ పర్యవేక్షణలో ఉన్నాడు. నకుల్‌కు ఏర్పడ్డ మెదడు లోపం బయటి ప్రపంచానికి తెలియటానికి ముందే జీన్ ట్రాన్స్‌ఫర్ ద్వారా అతడికి నయమైపోవాలి..."

ఆర్యా చిరునవ్వు చిందించింది. "అనుమానం వద్దు సార్. డాక్టర్ చతుర్వేది మీ కోరికను తప్పక నెరవేరుస్తారు. ఆయన ఈ పరిశోధనలో ఓడిపోరు"

వాల్‌చంద్ చెమట కారుస్తూ వచ్చాడు.

"అయ్యా! మీరు చెప్పినట్లే ఆ మనిషిని కారు వెనక సీటు క్రింద పడుకోబెట్టేశాను"

జోషి ఆర్యాతో అన్నాడు "వాల్‌చంద్‌ను వెంటబెట్టుకుని ఇక బయలుదేరు ఆర్యా నేను రేపు ఉదయం వస్తాను"

"సార్... మరి విఠల్ బాడీ..."

"రేపు ఉదయంలోగా ఆ విఠల్ శరీరం బూడిదగా మారి, తోటలోని మొక్కలకు ఎరువుగా మారిపోతుంది"

★ ★ ★

డాక్టర్ మనోరంజితం లేబర్ వార్డులోకి వెళ్ళేంతవరకూ ఆగి వెనక్కు తిరిగిన మాసిలామణి... తన వెనకే నిలబడున్న తిలకాన్ని చూసి అదిరిపడ్డాడు. తిలకం ముఖం కోపంతో ఎర్రబడి ఉంది.

"తి...ల...కం..."

"డాక్టర్‌తో ఏం మాట్లాడారు? "

"అదీ... అదీ..."

"ఊc... చెప్పండి..."

"పెద్ద ప్రాణం, చిన్నప్రాణం ఇద్దరినీ ఎలాగైనా కాపాడమని చెప్పాను"

"అబద్ధం"

"తి....తిలకం..."

"మీరు మాటాడింది విన్నాను"

"తి... తిలకం..."

"పెద్దప్రాణం పోయినా సరే, ఆపరేషన్ చేసి బిడ్డను కాపాడమని చెప్పటానికి మీకెలా మనసొచ్చిందండీ? "

"నేనెందుకు అలా అన్నానంటే..."

తిలకం గొంతు పెంచుతూ ఆవేశంగా అంది. "అదే మీ అమ్మాయి అయితే, ఇలాంటి మాట మీ నోట వచ్చిందేదా? "

మాసిలామణి నోట మాటరాక అలాగే నిశ్చేష్టుడైపోయాడు.

తిలకం కళ్ళలో నీళ్ళు తిరుగుతుండగా అంది "మన అబ్బాయి హరిహరన్ చనిపోయిన విషయాన్ని గీతాంబరి తట్టుకోలేదని మీరుగా నిర్ణయించుకుని, డాక్టర్‌తో అలా చెప్పటం ఏమీ బాలేదండీ".

"డాక్టరమ్మ ఇద్దరి ప్రాణాల్నీ కాపాడ్డానికి ప్రయత్నిస్తానని చెప్పేకదా లేబర్ రూమ్ లోకి వెళ్ళింది".

"ఒకవేళ ఆవిడ మనసు మారిపోతే? "

"తిలకం, ఏంటి నువ్వంటున్నది? "

"ఆపరేషన్ కష్టమై పెద్ద ప్రాణమా? చిన్న ప్రాణమా? అన్న నిర్ణయం తీసుకోవలసివస్తే... డాక్టరమ్మ మీరు చెప్పిన విషయాన్ని గుర్తుంచుకుని బిడ్డను మాత్రం కాపాడ్డానికి ప్రయత్నిస్తే..."

"డాక్టరమ్మ అలా ఏం చెయ్యదు".

"ఒక వేళ చేస్తే? "

"ఆమె ఏం మాట్లాడిందో నువ్వు విన్నావా? వృత్తి ధర్మాన్ని మంటగలిపేలా ఆమె ఎన్నటికీ నడుచుకోదు"

"నడుచుకుంటే? "

విసుగ్గా చూశాడు మాసిలామణి.

"ఇప్పుడు నన్నేం చెయ్యమంటావ్? "

"గీతాంబరి ప్రాణానికి ఏ ప్రమాదమూ జరగకూడదని లోపలికెళ్ళిన డాక్టరుకు సమాచారం ఇవ్వండి. ప్రమాదం అనుకుంటే ఆపరేషన్ ఆపమనండి"

"తిలకం, నువ్వు అనవసరంగా భయపడుతున్నావ్. ఏ ప్రాణం ముఖ్యమో డాక్టర్‌కు తెలియదా ఏం? "

"నాకు నమ్మకం లేదండీ... చాలా భయంగా ఉంది. లేబర్ వార్డ్‌లో ఇంటర్ కమ్ ఉండొచ్చు. వెళ్లి వెంటనే లేబర్ వార్డులో ఉన్న డాక్టరమ్మతో మాట్లాడండి"

"తిలకం... ఇది అనవసరం. నువ్వు భయపడే విధంగా ఏమీ జరగదు".

"మీరిప్పుడు వెళతారా, లేక నన్ను వెళ్ళి మాట్లాడమంటారా? "

"నే... నేనే వెళతాను".

"వెళ్ళండి... తొందరగా వెళ్ళండి".

"మాసిలామణి గబగబ టెలిఫోన్ ఆపరేటర్ ఉన్న గదిలోకి వెళ్ళాడు.

"ఇంగ్లీష్ నవల చదువుతున్న యువతి తలపైకెత్తి చూసింది.

"లేబర్ రూమ్‌లో ఉన్న డాక్టరమ్మతో ఇంటర్‌కమ్‌లో మాట్లాడాలి".

"సారీ సార్, ఉదయం నుండే ఇంటర్ కమ్ పనిచేయటం లేదు. నర్సులెవరైనా బయటికొస్తే డాక్టరమ్మకు సమాచారం చెప్పి పంపండి".

ముఖానికి పట్టిన చెమటను తుడుచుకుంటూ మాసిలామణి తిలకం వద్దకు రావటంతో, ఆమె కంగారుగా అడిగింది:

"డాక్టరమ్మతో మాట్లాడారా? "

"లేదు... లేబర్ రూమ్‌లో ఉన్న ఇంటర్ కమ్ పనిచేయటం లేదట".

"అయ్యయ్యో... ఇప్పుడేం చేద్దామండి? "

"రా... లేబర్ రూమ్ ముందుకెళ్ళి నిలబడదాం. నర్సులెవరైనా బయటికొస్తే సమాచారం చెప్పి పంపుదాం".

"నర్సులు.. బ... బయటికి రాకపోతే? "

"తిలకం, నువ్వు భయపడి... నన్నూ భయపెట్టి చంపకు. గీతాంబరి ప్రాణానికే

## కొత్తగాలి...

**నిత్య చావులకు**
**ఏడ్చేదెవ్వడు?**
**ఛత్తీస్‌గఢ్ కాష్ఠం**
**ఆర్పేదెవ్వడు?**

– ఎస్.రజని,
రాయపూర్, ఛత్తీస్‌గఢ్

డాక్టరమ్మ ఎక్కువ ప్రాధాన్యతనిస్తుంది"

"అది... పెద్ద ప్రాణం పోయినా ఫరవా లేదు అని మీరు చెప్పకపోయి ఉంటే, డాక్టరమ్మ ఆ నిర్ణయానికే వచ్చేది. హరిహరన్ ప్రాణంతో లేడన్న విషయం డాక్టరమ్మకు తెలిసిన ఈ పరిస్థితిలో ఆమె ఏ నిర్ణయానికైనా రావచ్చుగా!"

మాసిలామణి గుండెను చిక్కపట్టుకుని గోడకు ఆనుకున్నాడు.

★ ★ ★

"సాబ్... అక్కడ చూడండి!" అని బేరర్ యాదవ్ చెయ్యి చూపించిన దిశగా

మల్హోత్రా, రమణీ, దివాకర్ ముగ్గురూ దృష్టిని సారించారు.

అతని చెయ్యి డ్రెస్సింగ్ టేబుల్‌పై నిల బెట్టి ఉన్న నిలువుటద్దాన్ని చూపిస్తోంది.

మల్హోత్రా చూశాడు... ఏమీ కనిపించ లేదు. కళ్ళు చిట్లిస్తూ బేరర్‌ను చూశాడు.

"అద్దానికి కుడి పక్క అంచున చూడండి సాబ్. పెన్నుతో రాసిన ఏదో నెంబర్ కని పిస్తోంది? "

మల్హోత్రా దీక్షగా చూసి తల అడ్డంగా తిప్పాడు.

"నాకు కనిపించటంలేదే"

"ఇక్కడ నుండి చూడండి... అక్కడ నుండి 'గ్లేర్' వల్ల కనిపించకపోవచ్చు"

మల్‌హోత్రా లేచి యాదవ్ నిలబడున్న చోటు నుండి ఆ నిలువుటద్దాన్ని చూశాడు.

అద్దానికి కుడివైపు ఉన్న అంచులో పె న్నుతో రాసిన ఆ అంకెలు ఏవో గీతల్లా కనిపించాయి. అలాగే ముందుకు కదిలి అంకెల్ని చూశాడు.

మొత్తం ఏడు అంకెలు - 3536759

ఆసక్తిగా చూస్తూ రమణీ, దివాకరూ అక్కడకొచ్చి నిలబడ్డారు.

"ఇది హరిహరన్ చేతిరాతేనా? "

రమణి తలాడించాడు. "ఔను సార్... అన్నయ్య చేతిరాత లాగేఉంది"

మల్హోత్రా కుర్చీలో కూర్చొని చూశాడు. నిలువుటద్దం అందేంత దూరంలో కూర్చు న్నాడు. "సో...! మీ బ్రదర్ హరిహరన్ ఈ ఫోన్ నెంబర్ కోసమే డైరెక్టరీ ఎంక్వయి రీలో ట్రైచేసి ఉండాలి. ఇది ఎవరి నెంబరో తెలిస్తే... కేసు చిక్కుముడి వీడినట్టే..."

రమణీ దివాకరూ ఆ టెలిఫోన్ అంకెల్ని ఉచ్ఛరిస్తూ తలలాడించారు. రమణి అన్నాడు, "సార్, ముంబయిలో మాకు ఫ్రెండ్స్ సర్కిల్లో, రిలేటివ్స్ సర్కిల్లో లేరని ఇంతకు ముందే చెప్పాం. కానీ, అన్నయ్యకు వ్యక్తిగతంగా ఫ్రెండ్స్ ఉండొచ్చేమోనని నాకి ప్పుడు అనిపిస్తోంది. ఎక్స్ఛేంజ్‌కు ఫోన్ చేసి అడిగితే ఈ టెలిఫోన్ నెంబర్ ఎవ రిదో తెలిసిపోతుంది. అన్నయ్య ఆ వ్యక్తి ఇంటికే వెళ్ళుండొచ్చు".

"ఈ వర్షంవల్ల ముంబయి టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ పనిచేస్తున్నట్టులేదు. ఇక్కడ నుండి ఫోన్ చేయడం కుదరదు. నేరుగా ఎక్స్ఛేంజ్‌కు వెళ్ళి సమాచారం తెలుసుకో వటం ఉత్తమం"

హోటల్ గదికి తాళం పెట్టి బయటికొ చ్చారందరూ, వర్షం తన ప్రతాపాన్ని తగ్గించి సన్నటి తుంపరగా కురుస్తోంది. రిసెప్షన్ కౌంటర్లోని యువతిని అడిగాడు మల్హోత్రా, "టెలిఫోన్ పనిచేస్తోందా? "

"ఇంకా లేదు సార్..."

ముగ్గురూ నడుచుకుంటూ పోర్టికోలో ఆపి ఉన్న పోలీసు జీపు ఎక్కి టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ చేరారు.

టెలికాం సెక్షన్ సూపర్‌వైజర్ తన బట్ట తలమీద కుడిచేత్తో తడుముకుంటూ, మల్హోత్రా ఓ కాగితం ముక్కమీద రాసిచ్చిన అంకెలను నోటితో పలుకుతూ... ఎదురుగా ఉన్న ఇంటర్‌కమ్ రిసీవర్‌ను చెవికి ఆనిం చుకుని ఓ బటన్‌ను నొక్కి, మరాఠీలో ఎవ రితోనో మాట్లాడాడు. ఐదు నిమిషాల్లో వివ రాలు లభించాయి.

"మీరిచ్చిన టెలిఫోన్ నెంబర్ యజమాని ఒక లాయర్, పేరు లక్ష్మణదాస్. నందాన గర్ ఎక్స్‌టెన్షన్ సెవెన్త్ క్రాస్‌లో ఉంది ఆయన ఇల్లు. డోర్ నెం. 1529."

మల్హోత్రా తన పాకెట్ డైరీలో ఆ వివ రాలను రాసుకుని అతనితో అన్నాడు. "ఈ టెలిఫోన్ నెంబర్‌ను వెంటనే కాంటాక్ట్ చేయాలి, వీలవుతుందా? "

"వర్షం కారణంగా డెడ్ అయిన ఫోన్లన్నీ ఇప్పుడిప్పుడే ప్రాణం పోసుకుంటున్నాయి. మీరు ఈ టెలిఫోన్లో ప్రయత్నించి చూడండి." మేజా మీద ఉన్న నాలుగైదు

# ఎం.ఎస్.సుబ్బులక్ష్మి ఔదార్యం !



విశాఖపట్టణంలో వినాయకుని గుడి కట్టేందుకు నిధుల సేకరణకోసం ఎం.ఎస్. సుబ్బులక్ష్మి సంగీత కచ్చేరి ఏర్పాటయింది. ఆమె సంగీతం వినాలని వేలాదిమంది టికెట్లు కొన్నారు. సుబ్బులక్ష్మి, సదాశివం దంపతులూ ఆ ఉదయమే వచ్చారు. అప్పటివరకూ అంతా సవ్యంగానే ఉన్నా సాయంత్రమవుతున్నకొద్దీ ఆకాశం మేఘావృతమై కచ్చేరి నిర్వాహకుల్లో దడ పుట్టించింది. మరునాటి ఉదయమే సుబ్బులక్ష్మి దంపతులు మద్రాసు ప్రయాణం పెట్టుకున్నారు. దిక్కుతోచని స్థితిలో నిర్వాహకులు ఆమెను కలిసి తమ భయాలను వెలిబుచ్చారు. సదాశివం వారి పరిస్థితి అర్థం చేసుకుని, ధైర్యం చెప్పారు. తాము దైవకార్యం కోసం వచ్చామని, కనుక కచ్చేరీకి ఏ ఆటంకమూ ఉండదన్నారు. అవసరమైతే ప్రయాణం వాయిదా వేసుకుంటామని హామీ ఇచ్చారు.

నిన్నటి నిజం

అనుకున్నట్టే భారీ వర్షం కురిసింది. కానీ కచ్చేరీ విషయంలో మర్నాడు చేస్తారన్న ధీమా కుదిరింది. ఇంతలో నిర్వాహకులలో కొందరికి కొత్త ఆలోచన కలిగింది. ఖాళీగా ఉండే సుబ్బులక్ష్మి దంపతులను మరునాడు ఉదయం లేడీస్ క్లబ్బుకు ఆహ్వానించి సన్మానించాలని వెళ్ళి ఆహ్వానించారు. ఆమె అంగీకరించారు. కానీ ఒక షరతు పెట్టారు. కచ్చేరీ చేయాల్సిన తను చలిగాలిబయటకి వెళ్లకూడదు కాబట్టి క్లబ్బు సభ్యులే తమ వద్దకు రావాలని కోరారు. ఆ మేరకు మరునాటి ఉదయం లేడీస్ క్లబ్బు సభ్యులతో సమావేశమూ, సన్మానమూ సాయంత్రం సంగీత కచ్చేరీ దిగ్విజయంగా ముగిశాయి. సుబ్బులక్ష్మి దంపతుల సహకార గుణాన్ని, ఔదార్యాన్ని విశాఖ వాసులు పరిపరివిధాల కొనియాడారు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

ఫోన్లలో ఒకదాన్ని చూపించాడు.

"థాంక్ యూ వెరీమచ్." మల్హోత్రా ఆ ఫోన్ నుండి 3536759 నెంబర్‌కు డయల్ చేశాడు. అటువైపు రింగ్ అవుతున్న శబ్దం వినిపిస్తోంది.

ఎవరో తీశారు. "హలో..."

"హలో లాయర్ లక్ష్మణదాస్‌గారేనా? "

"హోల్డింగ్..."

మల్హోత్రా ఆంగ్లంలో సంభాషించడం మొదలుపెట్టాడు. "నేను ఇన్‌స్పెక్టర్ మల్హోత్రాని మాట్లాడుతున్నాను. ఓ కేసు విషయంగా మిమ్మల్ని విచారణ చేయాలి"

"దేనికి సంబంధించి..."

"మీకు హరిహరన్ అన్నవ్యక్తి తెలుసా? "

"హరిహరన్? "

"ఔను, చెన్నైకు చెందినవారు."

"అలా ఎవరూ నాకు తెలియదే."

"బాగా ఆలోచించి చెప్పండి మిస్టర్ లక్ష్మణదాస్. నిన్న రాత్రి తొమ్మిది తర్వాత ఆయన మీకు ఫోన్ చేసి మాట్లాడాడు"

"ఒక్క నిమిషం... నా డైరీ చూసి చెప్తా. నాకు రోజూ వచ్చే ఫోన్ కాల్సన్నింటినీ డైరీలో నోట్ చేస్తా. డైరీని చూస్తే అర్థమవుతుంది." అంటూ ఓ నిమిషం తర్వాత లక్ష్మణదాస్ గొంతు మళ్ళీ వినిపించింది.

"మీరు చెప్పింది కరెక్టే ఇన్‌స్పెక్టర్. చెన్నైకు చెందిన హరిహరన్ అన్న వ్యక్తి నిన్న రాత్రి నాతో టెలిఫోన్‌లో మాట్లాడాడు. అతని కంపెనీ ప్రొడెక్ట్‌లాంటిదే నకిలీ ప్రొడెక్ట్‌నొకదాన్ని ఎవరో తయారు చేసి మార్కెటింగ్ చేస్తున్నట్టూ, అతని మీద చట్టరీత్యా చర్య తీసుకునేందుకు నా సలహా కోరుతున్నట్టూ చెప్పాడు. అలాంటి వాటికంతా చట్టరీత్యా చర్యలు తీసుకొనేందుకు వీలుకాదూ... కేసూ, కోర్టూ అంటూ పోతే న్యాయం జరగటానికి పదీ, పదిహేనేళ్ళు

పట్టొచ్చా.. కనుక సదరు పార్టీని నేరుగా కలిసి ఈ సమస్యకు ఫుల్‌స్టాప్ పెట్టండి. పార్టీ దారికి రాని పక్షంలో పోలీసులకు కంప్లైంట్ చేసి, పనిని సానుకూలం చేసుకోవడం తెలివైన పని అని అతనికి చెప్పాను. నేను చెప్పిన విషయాలను అంగీకరించి అలాగే చేయనున్నట్టు చెప్పాడు."

"ఆ నకిలీ పార్టీ ఎవరో చెప్పారా?"

"చెప్పలేదు."

"మీరూ అడగలేదా?"

"లేదు."

"ఈ ముంబాయిలో ఎందరో లాయర్లుండగా మీకే ఫోన్ చేయవలసిన అవసరం ఏమిటీ?"

"సాధారణంగా ట్రేడ్‌మార్క్ మోసాలు, నకిలీ ప్రొడెక్ట్స్, ఫోర్జరీ... ఇలాంటి కేసుల్ని డీల్ చేసేది నేనే. ఎవరైనా నా పేరును ఆయనకు సిఫారసు చేసి ఉండొచ్చు. బైద బై ఇప్పుడు ఆ హరిహరన్‌కు ఏమైంది? నన్నెందుకు విచారణ చేస్తున్నారు?"

"హరిహరన్ నిన్నరాత్రి నుండి కనిపించటంలేదు. చెన్నై నుండి అతణ్ణి వెతుక్కుంటూ అతడి బ్రదర్, బ్రదర్ ఇన్ లా వచ్చారు. హరిహరన్ ఆచూకీకోసం ప్రయత్నిస్తున్నాం."

"మై గుడ్‌నెస్."

"మీరు చెప్పినదాన్నిబట్టి చూస్తుంటే... హరిహరన్ ఆ నకిలీ ప్రొడక్ట్ పార్టీని కలిసేందుకు వెళ్ళుండాలి. వెళ్లినచోట ఏదైనా అనుకోని సంఘటన జరిగి ఉండాలి"

"అదే నాకూ అనిపిస్తోంది."

"ఆలోచించి చెప్పండి లాయర్ సార్. హరిహరన్ మీతో మాట్లాడినప్పుడు ఆ నకిలీ ప్రొడెక్ట్ పార్టీ పేరేమైనా చెప్పారా?"

"చెప్పలేదు..."

"చెప్పలేదని కచ్చితంగా తెలుసా?"

"నాకు బాగా గుర్తుంది. ఆయన ఆ పార్టీ పేరును చివరివరకూ చెప్పలేదు."

"మిమ్మల్ని రేపు ఉదయం ఇంటి వద్ద కలుసుకోవచ్చా?"

"నిరభ్యంతరంగా"

మల్హోత్రా రిసీవర్‌ను పెట్టేసి రమణీ, దివాకర్లకు జరిగిన విషయమంతా చెప్పి, "మిస్టర్ రమణీ, ఆ నకిలీ ప్రొడెక్ట్ పార్టీ ఎవరో మీకు తెలుసా?"

రమణి ఆశ్చర్యంగా చూశాడు. "సార్ ఈ విషయం నాకు కొత్తగా ఉంది. ఆ నకిలీ ప్రొడెక్ట్ వ్యవహారం గురించి చెన్నైలో ఉన్నప్పుడు అన్నయ్య నాతో చెప్పనేలేదు"

"అది ఏ ప్రొడెక్ట్?"

"ఎలక్ట్రానిక్స్‌కు సంబంధించిన ఎన్నో కాంపోనెంట్స్‌ను మేము తయారుచేస్తున్నాం. వాటిలో ఏదో చెప్పలేంసార్..."

"ఒకవేళ మీ ఫాదర్‌కు ఈ నకిలీ ప్రొడెక్ట్ వ్యవహారం తెలిసి ఉండొచ్చు. ఫోన్ చేసి అడిగి చూడండి..." అని రమణితో చెప్పి, సెక్షన్ సూపర్‌వైజర్ వైపునకు తిరిగి అడిగాడు మల్హోత్రా, "మద్రాస్‌కు ఎస్‌టీడీ లైన్ దొరుకుతుందా? వెంటనే మాట్లాడాలి. బయట టెలిఫోన్‌లు పనిచేయటంలేదు."

"నో ప్రాబ్లెమ్" పక్కగదిలోకి తీసుకెళ్ళి మేజా మీదున్న టెలిఫోన్‌ను చూపించాడు అతడు. రమణి రిసీవర్‌ను తీసుకొని డయల్ చేశాడు. అటువైపు ఫోన్ రింగ్ అవుతున్న శబ్దం వినిపిస్తోంది. రమణి ఒళ్ళంతా ఆదుర్దాతో నిండిపోయింది.

'నాన్న రిసీవర్ తియ్యగానే ముందు లారీ ప్రమాదంలో చనిపోయింది అన్నయ్యకాదని చెప్పాలి. అమ్మా నాన్నా ఆనందంతో ఉబ్బితబ్బిబ్బై పోతారు.' అటు ఫోన్ రింగ్ అవుతూనే ఉంది... 'రిసీవర్ తియ్యడానికి ఎందుకింత ఆలస్యం?'

రమణి ఆత్రుతగా ఎదురుచూడసాగాడు.

★ ★ ★

ఆర్యా చిన్నగా కారును నడుపుకుంటూ డాక్టర్ చతుర్వేది బంగళాకు చేరేసరికి వర్షం

పూర్తిగా ఆగిపోయింది. ఆకాశమంతా నిర్మ లంగా ఉంది.

గేటు ముందు కారును ఆపి హారన్ మోగించింది ఆర్యా. బంగళా మొత్తం కటిక చీకటి అలుముకుని ఉంది. అంతటా నిశ్శబ్దం. కరెంటు వచ్చినట్టు లేదు.

ఒక్క నిమిషం ఎదురుచూసి మళ్లీ హారన్ మ్రోగించింది. ఈ మారు కొంచెం దీర్ఘంగా. లోపల ఎటువంటి అలికిడీ కని పించలేదు.

ఆర్యా ఆశ్చర్యపోయింది.

'హారన్ శబ్దం వినగానే డాక్టర్ ఎందుకు బయటికి రాలేదు?... ఒకవేళ నిద్రగానీ పోతున్నారా? నిద్రపోరే..'

కారు వెనుకసీట్లో కూర్చుని ఉన్న వాల్ చంద్ అడిగాడు "అమ్మా, నేను గోడెక్కి దూకి లోపలికెళ్లి డాక్టర్‌ను పిలవనా? "

మూడోసారి దీర్ఘంగా ఓ హారన్ ఇచ్చి.. ఆర్యా ఎదురుచూడసాగింది.

ఐదు నిమిషాలు గడిచాయి.

ఆర్యా మనసులో ఏవో అనుమానాలు బలపడసాగాయి. వాల్ చంద్‌వైపు తిరిగి అంది, "డాక్టర్ ఇలా మౌనంగా ఉండరే? "

"నేను లోపలికెళ్లి చూడనా? "

ఆర్యా తల ఆడించగానే వాల్ చంద్, కారు దిగాడు.

"జాగ్రత్త వాల్ చంద్...లోపల నీళ్లూ, బురదగా ఉండొచ్చు. కరెంట్ కూడా లేదు. చీకట్లో నిదానంగా నడిచి వెళ్లాలి"

"అలాగేనమ్మా"

"కాలింగ్ బెల్ పనిచెయ్యదు. బంగళా కుడిపక్కనున్న రెండో కిటికీ వద్దకెళ్లి పిలు"

వాల్ చంద్ తలాడించి గేటు పక్కనున్న కాంపౌండ్ వాల్‌ను సమీపించాడు. ఎగిరి దాని పైభాగాన్ని పట్టుకుని ఒంట్లోని శక్తి నంతా కూడదీసుకుని పైకెక్కాడు. గోడపై నుండి ఆ చీకట్లో జాగ్రత్తగా చూసుకుని కిందికి దూకాడు. దబ్బుమంటూ కాళ్లు నేలను తాకడంతో వర్షపు నీరు చిందింది.

మెల్లగా నడిచి బంగళా పోర్టికోలోకి వెళ్లాడు. చీకటీ, నిశ్శబ్దమూ అక్కడ దోబూ చులాడుతున్నాయి. పోర్టికో మెట్లెక్కి గుమ్మం తలుపు లాగి చూశాడు. అది రాలేదు. పిలిచాడు "అయ్యా అయ్యా" అని.

లోపల నిశ్శబ్దం. ఓ నిమిషం చూసి మెల్లగా బంగళా కుడిపక్కకు వెళ్లాడు.

రెండో కిటికీని సమీపించాడు... వీస్తున్న గాలికి కిటికీ తలుపులు కిర్రు కిర్రుమంటూ శబ్దం చేస్తూ కొట్టుకోసాగాయి.




**నర్సులెవరైనా** లేబర్‌రూమ్‌లో నుండి బయటికి రాకపోతారా? అన్న ఆదుర్దాతో ఎదురుచూస్తూ నిలబడున్నారు మాసిలా మణి, తిలకం.

'తలుపు తట్టి విషయం చెప్పేద్దామా? డాక్టర్‌కు కోపం వస్తుందేమో!... రానీ' అన్న సందిగ్ధావస్థలో కొట్టుమిట్టాడుతుండగానే ఆ ఫోన్ ఆపరేటర్ పరుగెత్తుకొచ్చింది.

"సార్, మీకు ఫోన్..."

తిలకాన్ని అక్కడే ఉండమని చెప్పి ఆ ఆపరేటర్ వెనకే వెళ్లాడు మాసిలామణి.

"ఫోన్ ఎక్కడనుండి? "

"మీ పక్కింటి మహేష్‌బాబు నుండి? అగ్రి కాలేజీలో ప్రొఫెసరట.."

"హలో"

"మాసిలామణిగారా? "

"ఔను."

"సార్, మహేష్‌బాబును"

"చెప్పండి మిస్టర్ మహేష్‌బాబూ..."

"సార్, తాళం వేసున్న మీ ఇంట్లో నుండి టెలిఫోన్ మోగుతున్న శబ్దం వినిపిస్తూనే ఉంది. కిటికీ పక్కగా ఫోన్ ఉండటంతో వెళ్లి అటెండు చేశాను. ముంబాయి నుండి మీ అబ్బాయి మాట్లాడాడు. నేను అతడికి గీతాంబరిని డెలివరీ కోసం హాస్పిటల్లో అడ్మిట్ చేసిన విషయం చెప్పి, హాస్పిటల్ ఫోన్ నెంబర్ ఇచ్చాను. అతను మీతో ఏదో ఓ ముఖ్యమైన విషయం గురించి మాట్లాడాలట! హాస్పిటల్‌ఫోన్ దగ్గరే మిమ్మల్ని ఉండమన్నాడు. ఏ క్షణాన్నైనా మీకు కాల్ రావొచ్చు. ఫోన్ పక్కనే ఉండండి సార్."

"థాంక్యూ వెరీమచ్ ఫర్ యువర్ కైండ్ ఇన్‌ఫర్‌మేషన్ మహేష్‌బాబు."

"గీతాంబరికి డెలివరీ అయిందా సార్?"

"లేదు. లేబర్ రూమ్‌లోనే ఉంది."

"నేను ఫోన్ పెట్టేస్తున్నా. మీ అబ్బాయి కాల్ అటెండ్ చెయ్యండి. అతనెందుకో ఎమోషనల్‌గా ఉన్నాడు" అని ఫోన్ పెట్టేశాడు మహేష్‌బాబు.

మాసిలామణి కూడా రిసీవర్ పెట్టేసి కొడుకు ఫోన్‌కోసం ఎదురు చూడసాగాడు. రెండే రెండు నిమిషాలు.. ఫోన్ మోగింది. రిసీవర్ అందుకుని "హలో..." అన్నాడు.

"నాన్నా, నేను రమణిని"

"ఏంటి, నీ నుండి ఫోనే లేదు? ముంబాయి నుండి నువ్వూ, దివాకరూ ఎప్పుడు వస్తున్నారు?"

"నాన్నా! ఓ సంతోషకరమైన వార్త. ముందు అమ్మకిది చెప్పండి. లారీ ప్రమాదంలో చనిపోయింది అన్నయ్య కాదు..."

"మ...ణీ... ఏ...ఏమంటున్నావ్?"

"ఔను నాన్నా... లారీ గుద్ది చనిపోయింది అన్నయ్య కాదు. ద్వారకనాథ్ అన్న దొంగ. అన్నయ్యా హోటల్ గదిలో లేని సమయం చూసి డూప్లికేట్ తాళంతో లోపలికి ప్రవేశించి, అన్నయ్య బ్రీఫ్‌కేస్‌ను తీసుకుని, అతని సఫారీ డ్రెస్ వేసుకుని బయటికి వచ్చాడు. లారీ అతన్నే గుద్దింది. పోలీసుల విచారణలో నిజాలు తెలిసాయి.."

"భగవంతుడా!" చేతులు జోడించాడు మాసిలామణి.

"రమణీ! నువ్వు చెప్పేది నిజమా? !"

"అవును నాన్నా! చనిపోయింది అన్నయ్య కాదు"

"అలా అయితే హరిహరన్ ఎక్కడ?"

"ఎక్కడికి వెళ్లాడో తెలియడం లేదు.. పోలీసుల సాయంతో వెతుకుతున్నాం"

"హరిహరన్ ప్రాణానికి ఏ ప్రమాదమూ జరగలేదు కదా?"

"ఏమీ తెలియడం లేదు నాన్నా... హరిహరన్ ముంబాయికి రాగానే ఓ లాయర్‌కు ఫోన్ చేసి, మన కంపెనీ ప్రాడెక్ట్‌లాంటివే నకిలీ ప్రాడెక్ట్ తయారుచేసే ఒకతనిపై కేసు పెట్టడం గురించి మాట్లాడాడు. అయితే ఆ లాయర్ 'ఆ విషయంలో కోర్టూ... కేసూ అని వెళ్లొద్దనీ, సంబంధిత పార్టీని నేరుగా వెళ్లి కలిసి మాట్లాడు' అని చెప్పినట్టున్నారు. ఒకవేళ అన్నయ్యా ఆ పార్టీని కలవడానికి వెళ్లి ఉండాలని ఇన్‌స్పెక్టర్ అంటున్నారు."

"ఆ నకిలీ పార్టీ ఎవరో తెలిసిందా?"

"లేదు నాన్నా."

"లాయర్‌తో చెప్పలేదా?"

"చెప్పలేదు."

"జర్మనీకి వెళ్ళటానికి ముంబయిలో దిగిన మనిషి, ఈ పనులన్నీ ఎందుకు చేశాడు? చెన్నైలో ఉన్నంతవరకూ ఈ నకిలీ ప్రాడెక్ట్ గురించి నాకు చెప్పనేలేదే?"

"ఒకవేళ ముంబయి వచ్చాక అన్నయ్యకు ఈ విషయం తెలిసుండాలి. ఈ విషయంలో ఏం చర్యలు తీసుకోవాలో తెలుసుకునేందుకే లాయర్‌ను కన్సల్ట్‌చేసి ఉండొచ్చు. ఆయన ఇచ్చిన సలహా ప్రకారం పార్టీని నేరుగా కలవడానికి వెళ్ళుండొచ్చు."

"నువ్వు చెబుతున్నదాన్ని బట్టి ఆ పార్టీని కలవడానికి వెళ్ళిన చోటే హరిహరన్‌కు ఏదో జరిగి ఉండాలి."

"ఇన్‌స్పెక్టర్ కూడా ఆ కోణంలోనే విచారిస్తున్నారు... వదిన డెలివరీ అయిందా?"

"ఇంకా లేదు." అని చెప్పిన మాసిలామణి వెంటనే డాక్టర్ మనోరంజితాన్ని కలిసి హరిహరన్ ప్రాణంతో ఉన్న విషయాన్ని చెప్పాలనుకున్నాడు. ఫోన్లో గబగబ అన్నాడు "రమణీ... నువ్వు ఓ గంట తర్వాత మళ్ళీ ఫోన్ చెయ్. మిగతా విషయాలు మాట్లాడుకుందాం."

"నా...న్నా...." రమణి సాగదీశాడు.

"ఏంటీ? ..."

"అన్నయ్య గురించిన మంచి న్యూస్ లభించేంతవరకూ వదినకు ఇవేమీ తెలియనివ్వకండి."

"తెలియకుండా నేను చూసుకుంటాను. నువ్వూ దివాకరూ హరిహరన్‌ను కనిపెట్టడానికి ప్రయత్నించండి...."

"సాయంత్రం నుండి ఆ పని మీదే తిరుగుతున్నాం. ఎలాగైనా అన్నయ్యను కనిపెట్టేస్తాం. ధైర్యంగా ఉండండి నాన్నా..."

"సరే, ఓ గంట తర్వాత మళ్ళీ ఇదే హాస్పిటల్‌కు ఫోన్ చెయ్యి." అని మాసిలామణి రిసీవర్‌ను పెట్టేసి లేబర్ వార్డుకేసి దాదాపు పరుగెడుతున్నట్టు వెళ్ళాడు.

"హరిహరన్ ప్రాణంతో ఉన్న విషయాన్ని ముందు డాక్టర్‌కు చెప్పాలి. లేకపోతే పెద్ద ప్రాణమా, చిన్న ప్రాణమా అన్న సమస్య వచ్చినపుడు- డాక్టర్‌తో నేను చెప్పిన విషయం గుర్తుంచుకొని అలా చర్యలు తీసుకుంటే ప్రమాదం."

లేబర్ రూమ్‌కు ఎదురుగా ఉన్న గోడకు ఆనుకొని కూర్చుని ఉన్న తిలకం భర్తను చూసి లేచి నిలబడింది.

"ఫోన్‌లో ఎవరండీ?"

"ముంబాయి నుండి రమణి.. మన హరి

ఆక్సిడెంట్‌లో చనిపోలేదట. చనిపోయింది మరెవరోనట"

తిలకం ఆనందంతో పులకించిపోయింది. "మీ.... మీరు... ఏమంటున్నారండీ? "

"తర్వాత అన్నీ చెబుతాను. ముందు డాక్టర్‌కు ఈ విషయాన్ని చెప్పాలి."

"ఎ.... ఎలా చెప్పాలండీ? "

"తలుపును తట్టయినా చెప్పితీరాలి."

మాసిలామణి తలుపుకేసి వేగంగా కదల బోయేంతలో... "కి...ర్...ర్రు..." మంటూ లేబర్ రూమ్ తలుపు తెరుచుకుంది.

డాక్టర్ మనోరంజితం బయటికొచ్చింది. ఆమె కళ్ళల్లో ఆదుర్దా..!.

★ ★ ★

ఇన్‌స్పెక్టర్ మల్హోత్రా విచారణను తీవ్ర తరం చేశాడు. హరిహరన్ గురించి తెలుసు కోవడానికి టెలిఫోన్ ఎక్స్‌ఛేంజ్ నుండి మళ్ళీ హోటల్ సిల్వర్ శాండ్‌కు రాగానే కౌంటర్‌లో ఉన్న రిసెప్షనిస్టు పిలిచింది "సార్, ఒక్క నిమిషం."

రమణీ, దివాకరూ వెంటరాగా మల్హోత్రా రిసెప్షనిస్టును సమీపించాడు.

"ఎస్? "

"ఇక్కడ బసచేసిన మిస్టర్ హరిహరన్ నిన్న రాత్రి ఎక్కడికెళ్ళాడన్న ప్రశ్నకు సమా ధానం దొరికింది."

ముగ్గురూ ఒకరినొకరు చూసుకున్నారు.

"ఈజిట్? ఎక్కడికెళ్ళాడట? "

"అతను మలబార్ హిల్స్ వెళ్ళాడు. ఎవ రిని కలవడానికి వెళ్ళాడో తెలియదు."

"ఇది ఎవరి ద్వారా తెలిసింది? "

రిసెప్షనిస్టు గెస్ట్ రూమ్ సోఫాకేసి చెయ్యి చూపించింది. ముగ్గురూ ఆత్రుతగా అటు వైపు చూశారు.

సోఫాలో కూర్చొని ఉన్న ఆ వ్యక్తి లేచి నిలబడి ఎస్సైకి నమస్కరించాడు.

అతడికి ఇరవై ఏళ్ళు ఉండొచ్చు. ఒంటి మీద ఖాకీ ఫ్యాంటు, ఖాకీ షర్టూ.. ముఖంలో ఏదో కంగారు కనిపిస్తోంది.

ఎస్సై మల్హోత్రా అతణ్ణి తీక్షణంగా "ఎవరు నువ్వు? " అని ప్రశ్నించాడు.

అతడు చేతులు కట్టుకుంటూ "సాబ్, నేనొక టాక్సీ డ్రైవర్‌ను. నాపేరు సహాదే. నిన్న రాత్రి తొమ్మిదిన్నరవేళ ఈ హోటల్లో బసచేసిన ఒక వ్యక్తి- ఎదురుగా ఉన్న టాక్సీ స్టాండ్‌కు వచ్చాడు. ఆ సమయంలో బాగా వర్షం పడుతోంది. స్టాండ్‌లో నా టాక్సీ మాత్రమే ఉంది."

మల్హోత్రా, రమణీ, దివాకర్ ముగ్గురూ సహాదేనే చూడసాగారు. అతడు గుటక మ్రింగి తన మాటల్ని కొనసాగించాడు "...మలబార్ హిల్స్ వరకూ వెళ్ళి రావాలి... వస్తావా? " అని అడిగాడు. వర్షానికి భయపడి రానన్నాను. మీటర్ పైన రెండింతలు ఇస్తానని చెప్పటంతో ఒప్పుకున్నా. మలబార్ హిల్స్‌లో ఏదో ఒక అవెన్యూ పేరు చెప్పాడు. ఇప్పుడది గుర్తుకు రావటంలేదు సాబ్..."

"ఫరవాలేదు, ఆ తర్వాత ఏం జరిగింది"

"టాక్సీ మలబార్ హిల్స్ కమలా నెహ్రూ పార్క్‌ను సమీపిస్తుండగా ఉన్న ట్టుండి ఇంజన్‌లో ఏదో ట్రబులొచ్చి బండి ఆగిపోయింది. దిగి సరిచెయ్యడానికి ప్రయ త్నించాను. కుదరలేదు.. అరగంటకు పైగానే పట్టేట్టు అనిపించింది. బండిలో వచ్చిన సార్‌తో పరిస్థితిని చెప్పాను. దానికి అతను 'పరవాలేదు. బండిని ఇక్కడే నిల బెట్టి సరిచెయ్యి. నేను కలవాల్సిన వ్యక్తి ఇల్లు ఇక్కడికి దగ్గర్లోనే ఉండొచ్చు. వెళ్ళి కలసి వచ్చేస్తా'నని చెప్పాడు. నేను నసు గుతూ అతణ్ణి చూడగానే అతడు చిన్నగా నవ్వాడు. 'ఏం... నామీద నమ్మకం లేదా? హోటల్ సిల్వర్ శాండ్ రూమ్ నెంబర్ 527 లో దిగాను. నా మీద నీకు నమ్మకం లేకపోతే... డబ్బు ఇచ్చే వెళతా'నని అన్నాడు. నేను డబ్బు తీసుకోకుండా అతణ్ణి

వెళ్ళి రమ్మన్నాను. అతను వర్షంలో తలకు కర్చీఫ్‌ను చుట్టుకుని పార్కు పక్కనున్న రోడ్డు మీదికి వెళ్ళాడు..."

సహాడే మళ్ళీ ఓ గుటక మింగి కొనసాగించాడు. "... ఆయన వెళ్ళిన తర్వాత నేను టాక్సీ బాగుచేసి ఆయన కోసం ఎదురు చూశా.. వెళ్ళినవాడు మళ్ళీ తిరిగి రాలేదు. రెండు గంటల సేపు వెయిట్ చేసి నేను దాదర్‌లో ఉన్న మా ఇంటికి వెళ్ళిపోయాను. రేపు హోటల్‌కు వెళ్ళి టాక్సీ చార్జ్‌ను వసూలు చేసుకుందామన్న ఆలోచనతో వెళ్ళిపోయాను. కానీ, ఉదయం నేను లేవలేకపోయాను. వర్షంలో తడుస్తూ రిపేర్ చేసినందువల్ల జ్వరమొచ్చి సాయంత్రం వరకూ కోలుకోలేకపోయాను. మాత్ర వేసుకుని జ్వరం కాస్త తగ్గాక, పార్టీ వద్ద టాక్సీ చార్జ్ వసూలుచేసుకుందామని హోటల్‌కు వచ్చి కౌంటర్‌లో అడిగాను. వెంటనే ఆ అమ్మాయి 'రూమ్ నెంబర్ 527లో బసచేసిన వ్యక్తి కనిపించడం లేదని పోలీసులు వెతుకుతున్నారు. ఇంకాసేపట్లో పోలీసులు ఇక్కడికి వస్తారు. వాళ్ళతో నిన్న జరిగిన విషయాలన్నీ చెప్పాల్సి ఉంటుంది. సోఫాలో కూర్చోండి' అని చెప్పి నన్ను ఇక్కడే కూర్చో పెట్టేసింది."

రమణీ, దివాకర్‌లను చూస్తూ మల్హోత్రా అడిగాడు "మలబార్ హిల్స్‌లో మీకు తెలిసిన వాళ్ళెవరైనా ఉన్నారా? "

"లేరు సార్..."

"బాగా ఆలోచించి చెప్పండి. ప్లీజ్..."

"కచ్చితంగా లేరు సార్!"

"మీ బిజినెస్ వాళ్ళెవరైనా? "

రమణి దీర్ఘంగా తలాడించాడు. "అలా ఎవరూలేరు సార్... ఈ విషయంలో నాకు ఏ అనుమానమూ లేదు."

మళ్ళీ మల్హోత్రా చూపులు టాక్సీడ్రైవర్ వైపుకు తిరిగాయి. "నీ టాక్సీలో వచ్చిన వ్యక్తి టాక్సీ దిగి, కమలా నెహ్రూ పార్కు పక్కనున్న రోడ్డుమీదికి వెళ్ళాడని చెప్పావ్ కదా, బండి రిపేరయ్యాక అతని కోసం నువ్వు మళ్ళీ వెతకలేదా? "

"లేదు సాబ్"

"ఏం? "

"వర్షం జోరున కురవసాగింది. ఆకలీ, చలీ వెయ్యసాగింది... ఆగలేక చార్జీని రేపు తీసుకోవచ్చని ఇంటికెళ్ళిపోయాను."

"బాగా ఆలోచించు... నీ టాక్సీలో ఆయన ఎక్కుతున్నప్పుడు వెళ్ళాల్సిన అడ్రస్ చెప్పాడా? "

"సరైన అడ్రస్ చెప్పలేదు సాబ్. ఓ అవెన్యూ పేరు చెప్పి వెంటనే మలబార్ హిల్స్ అని చెప్పాడు."

"సరే, వచ్చి జీపెక్కు"

"సాబ్..."

"భయపడకు... ఇప్పుడు మలబార్ హిల్స్ వెళుతున్నాం. నీ టాక్సీ చెడిపోయి ఆగిపోయిన చోటూ, ఆయన వెళ్ళిన రోడ్డు చూపించు చాలు"

"సాబ్, నేను పిల్లలుగలవాణ్ణి. ఈ కేసులో నన్ను ఇరికించి లోపల ఏసెయ్యకండి సార్."

మల్హోత్రా సన్నగా నవ్వి టాక్సీ డ్రైవర్ భుజం తట్టాడు.

"నీకు ఏ ఇబ్బందీ ఉండదు. రా... వచ్చి ఆ చోటు చూపించు. మిగతా విషయాలు మేం చేసుకుంటాం."

★ ★ ★

వాల్‌చంద్ గాలికి కొట్టుకుంటున్న కిటికీ వద్దకెళ్ళి లోపలికి తొంగి చూశాడు.

ఆ చీకట్లో అతడికి ఏమీ కనిపించలేదు.

మెల్లగా పిలిచాడు... "డాక్టర్ సాబ్..."

లోపల నిశ్శబ్దం.

"డాక్టర్ సాబ్..." గొంతు పెంచాడు వాల్‌చంద్. బదులులేదు. అన్ని దిక్కులా నిశ్శబ్దం ఆవరించి ఉంది. వర్షపు నీరు ఎక్కడో టప్ టప్ మంటూ పడుతున్న

శబ్దం వినిపిస్తోంది.

వాల్‌చంద్ చుట్టుపక్కలంతా చూసి, గ్రిల్స్ పట్టుకుని కిటికీ అంచు పైకెక్కి నిల బడి బంగళాలోకి దృష్టిని సారించి చూపు ఆనినంతవరకూ చూశాడు.

మొదట మసక మసకగా కనిపించిన వస్తువులు క్రమంగా బాగా కనిపించ సాగాయి.

అద్దాలు బిగించిన బీరువాలు, పొడవాటి మేజాలు, అల్మైరాలు, ఎత్తైన స్టూళ్ళు ఇవన్నీ కనిపించసాగాయి.

'డాక్టర్ ఎక్కడికెళ్ళాడు?' మళ్ళీ గొంతెత్తి పిలిచాడు. "డాక్టర్ సాబ్!" బదులులేదు.

'ఏం చేద్దాం? బంగళా వెనక్కెళ్ళి అక్క డున్న కిటికీలో నుండి పిలిచి చూద్దామా?'

ఆ నిర్ణయానికొచ్చి, క్రిందికి దిగటానికి ప్రయత్నించిన వాల్‌చంద్ దృష్టి చప్పున ఒక చోట ఆగిపోయింది.

లోపల 'ఆ చెక్క బీరువాకు పక్కన ఏదో నల్లగా పడుంది. ఏంటదీ?' కళ్ళు చిట్లించు కుని చూశాడు. 'ఎవరో క్రిందపడి ఉన్నారు... అది ఎవరై ఉంటారు, డాక్టరా? లేక ఇంకెవరైనానా?' వాల్‌చంద్ ఎటూ నిర్ణయించుకోలేక, కిటికీ అంచుపై నుండి క్రిందికి దూకాడు. అలా దూకటంతో వాన నీళ్ళు చెదిరి పక్కలకు పడింది. దబ్బు దబ్బు మంటూ నీళ్ళలో అడుగులు వేస్తూ కాంపౌండ్ గేటుకేసి పరుగెత్తాడు.

గేటుకు అటువైపు కార్లో కూర్చున్న ఆర్యా, వాల్‌చంద్ వేగంగా రావడాన్ని చూసి కారుదిగి ఎదురొచ్చింది.

"ఏంటి వాల్‌చంద్? ఎందుకలా పరుగె త్తుకొస్తున్నావ్"

"అమ్మా, డాక్టర్... డాక్టరని నేను పిలిచిన పిలుపుకు లోపలి నుండి ఎలాంటి బదులూ లేదు. అయితే లోపలున్న బీరువా పక్కన ఎవరో క్రింద పడున్నారు"

ఆర్యా గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"క్రి...క్రింద పడున్నది డాక్టరా?"

"తెలియటం లేదమ్మా... లోపల చాలా చీకటిగా ఉంది."

"వాల్‌చంద్... ఈ గేటుకున్న తాళాన్ని తియ్యగలవేమో చూడూ..."

"తియ్యలేమమ్మా... తాళం పెద్దదిగా ఉంది. పగలకొట్టడానికీ వీలు కాదు."

"బంగళా లోపల ఏదో జరిగింది. నేను కారు లాక్‌చేసి లోపలికొస్తా"

"ఎలా వస్తారమ్మా?"

"గోడెక్కి దూకి.." అన్న ఆర్యా కారు వద్ద కెళ్ళి నాలుగు డోర్లూ మూసి లాక్‌చేసి కాంపౌండ్ గోడ వద్దకు వచ్చింది.

రోడ్డు పక్కగా పడున్న ఓ పెద్ద రాయిని కష్టపడి దొర్లించుకుంటూ వెళ్ళి గోడ పక్కగా వేసి, దానిమీద నిలబడి గోడ ఎక్కి అటు వైపుకు దూకింది. బంగళావైపు నడిచింది.

ఆ నడకలో ఆదుర్దా కనిపిస్తోంది. ఇద్దరూ కిటికీ వద్దకు చేరుకున్నారు.

"కిటికీ అంచుమీద నిలబడి ఎడమ పక్కగా ఉన్న బీరువా వద్ద చూడండమ్మా"

ఆర్యా పైకెక్కి చూసింది. "క్రింద పడు న్నది ఎవరు?... డాక్టరా?... లేక మరెవ రైనానా?"

"వాల్‌చంద్"

"అమ్మా"

"నీ దగ్గర అగ్గిపెట్టె ఉందా?"

"ఉందమ్మా"

"రెండు మూడడుగుల పొడవున్న ఏదైనా కర్రపుల్ల దొరుకుతుందేమో చూడు?"

"దేనికమ్మా"

"ప్రశ్నలు అడగొద్దు... వెళ్ళి తీసుకురా"

వాల్‌చంద్ ఆ చీకట్లో నడిచి వెళ్ళి ఓ చెట్టు కొమ్మను విరిచి మూడడుగుల పొడవు, బొటనవేలి లావుతో పుల్ల నొక దాన్ని తీసుకొచ్చాడు. ఆర్యా ఆ పుల్లకొనకు తన కర్చీఫ్ చుట్టింది.

"వాల్‌చంద్... ఓ అగ్గిపుల్లను గీసి దీన్ని

# నన్ను శిక్షించండి



మైసూరు సంస్థానాన్ని చామరాజు ఒడెయార్ పరిపాలిస్తుండిన రోజులు. బూదిహాళ్ పద్మనాభయ్యగారు సంగీత విద్వాంసులుగా అప్పటికే బాగా గుర్తింపు పొందారు. రాజధానిలో మహారాణిగారి చొరవతో అక్కడి బాలికల ఉన్నత పాఠశాలలో, రాజుగారి చొరవతో మహారాజ సంస్కృత సంగీత పాఠశాలలో సంగీత అధ్యాపకుడిగా నియమితులయ్యారు.

నిన్నటి నిజం

ఆయనకు విద్యార్థులపై అభిమానం ఎక్కువ. దయాపూర్ణ హృదయులు. కాని ముక్కుమీద కోపం. అపశ్రుతి - అప లయలను భరించలేరు.

బాలికల పాఠశాలలో ఓసారి కె.డి. రుక్మిణియమ్మ, శ్రీరంగమ్మ అనే విద్యార్థినులు తప్పు చేస్తే, "అంట్లు తోమే చేతితో వీణ వాయిస్తానంటే అదెలా సాధ్యం?" అంటూ వెక్కిరింపు ధోరణిలో ఆక్షేపించి మాట్లాడారు. తరువాత తన దుందుడుకుతనానికి పశ్చాత్తాపపడ్డారు. వెంటనే పై అధికార్ల వద్దకు వెళ్లి తను అపరాధం చేశానని జరిగిన సంగతిని పొల్లుపోకుండా అంతా విడమరచి చెప్పారు. తర్వాత, "అయ్యా, నేను అపరాధం చేశాను. నన్ను పనినుంచి తొలగించి శిక్షించండి" అని ప్రార్థించారు.

ఆయన కథనం విన్న అధికార్లకు నవ్వాలో కోపగించుకోవాలో అర్థం కాలేదు. అంతటి సున్నిత హృదయులుంటారా అని అచ్చెరువొంది, "ఇది మొదటిసారి గనుక హెచ్చరిస్తున్నాం. మళ్లీ ఇలా జరగకుండా చూసుకోండి" అని చెప్పి పంపారు.



వెలిగించు..."

అతడు వెలిగించగా, తయారైన ఓ ఇన్‌స్టెంట్ కాగడా అక్కడి చీకటిని దూరం చేసింది. ఆ కాగడాను కిటికీ చువ్వల మధ్య నుంచి లోపలికి చాపింది ఆర్యా.

గదిలో డాక్టర్ చతుర్వేది పడున్నాడు.

బియ్యం మూటలా పడున్న ఆయన బట్ట తలపైని ఓ గాయం! గాయం వద్ద రక్తం గడ్డకట్టి ఉంది. చేతులూ కాళ్ళూ, భిన్న కోణాల్లో పడి ఉండగా, టార్చ్‌లైట్ అద్దం చిన్న చిన్న ముక్కలుగా పగిలి కింద చెదిరిపడి ఉన్నాయి. ఆర్యాలో అంతులేని ఆదుర్దా ఒళ్ళంతా కమ్మేసింది.

★ ★ ★

లేబర్ రూమ్‌లో నుండి బయటికొచ్చిన డాక్టర్ మనోరంజితం ముఖం ఎందుకో కలత చెందినట్టుగా అనిపిస్తోంది.

"డా... డాక్టర్..."

"మీకు మనవడు పుట్టాడు."

"చౌడేశ్వరీ..." తిలకం రెండు చేతుల్నీ జోడించింది.

మాసిలామణి డాక్టరమ్మను ఆత్రుతగా అడిగాడు

"డాక్టర్! గీతాంబరికి ఎలా.. ఉంది?"

"సారీ టు సే దిస్... ఏ క్షణాన ఏమైనా జరగొచ్చు. షి ఈజ్ కౌంటింగ్ హర్ మినిట్స్..."

"డా... డాక్టర్..."

"రెండు ప్రాణాల్నీ కాపాడ్డానికి నేను ప్రయత్నించాను. కానీ విధిరాత మరో విధంగా ఉంటే మనమేం చెయ్యగలం? వి ఆర్ హెల్ప్‌లెస్..." అంటూ కదిలి వెళ్ళబోయిన డాక్టర్ రెండూ చేతుల్నీ గట్టిగా పట్టుకుని ఏడుస్తూ అంది తిలకం, "డాక్టర్, మా కోడల్ని ఎలాగైనా కాపాడండి. మా అబ్బాయి హరి ప్రాణంతోనే ఉన్నాడని ముంబాయి నుండి శుభవార్త తెలిసిన ఈ సమయంలో, ఆమె మమ్మల్ని వదిలి వెళ్ళి




## మే -2010
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

త్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.




1. **పి.నాగలక్ష్మి** - చింతల్, హైదరాబాద్
2. **జి.సత్యవతీ సుజాత** - బొబ్బిలి, విజయనగరం జిల్లా
3. **బి.నాగభూషణం** - కృష్ణానగర్, గుంటూరు
4. **కొర్రపాటి అంకమ్మ** - పూనూరు, ప్రకాశం జిల్లా
5. **ప్రభాకర్ తల్లాప్రగడ** - మదీనాగూడ, హైదరాబాద్

### సరైన జవాబులు

**1. సీత 2. శకుంతలమ్మ 3. రాఘవరెడ్డికి 4. ఉత్తారెడ్డి 5. గంగులు 6. కాలిస్టో 7. జగన్ 8. మనస్సినక్కరె 9. కిత్నీ నావేంమే కిత్నీ బార్ 10. వనజ**

పోకూడదు డాక్టర్.."

మనోరంజితం పేలవంగా నవ్వింది..

"రెండు ప్రాణాలనూ కాపాడ్డానికి లోపల అన్ని ప్రయత్నాలూ చేస్తున్నారు. పల్స్ రేట్ మామూలు స్థితికి వచ్చినా, గీతాంబరికి ఫిట్స్ వచ్చే అవకాశాలూ ఉన్నాయి. ప్రసవమైన అమ్మాయికి ఫిట్స్ వస్తే అది కచ్చితంగా మరణానికి దారి తీస్తుంది."

"డా... డాక్టర్..."

"మీరు నమ్మే దేవుళ్ళను మొక్కుకోండి. పల్స్‌రేట్ కంట్రోలై ఫిట్స్ రాకుంటే.. గీతాంబరిని ప్రాణాలతో చూడొచ్చు"

మాసిలామణి వణుకుతున్న చేతులతో మొక్కాడు.

"డా... డాక్టర్..."

"సారీ, ఫాల్స్ హోప్ ఇచ్చి మిమ్మల్నీ, మీ భార్యనూ మోసం చెయ్యలేను.. ఐ ట్రైడ్ మై లెవల్ బెస్ట్..."

"లో.. లోపలికి వె.. వెళ్ళి గీతాంబరిని చూడొచ్చా డాక్టర్?"

"నిరభ్యంతరంగా! అయితే, ఏడ్చి హంగామా చెయ్యకండి. బిడ్డను ఇప్పుడు ఎత్తుకోకండి. వెయిట్‌లెస్ చైల్డ్. ఓ రోజంతా లైట్ బాక్స్‌లో పెట్టాలి" చెప్పి అక్కణ్ణించి కదిలింది డాక్టరమ్మ.

మాసిలామణి, తిలకం తలుపు తోసుకుని లేబర్ రూమ్‌లోకి వెళ్ళారు.

పల్స్‌రేట్‌ను అబ్జర్వ్ చేస్తూ తల వద్ద ఓ నర్సు కూర్చుని ఉంది. గీతాంబరి పాలిపోయిన ముఖంతో పడుకుంది. పక్కకు చాపిన చేతులు.. తెరుచుకున్న నోరు, పైకి కిందికీ నిదానంగా కదులుతున్న ఛాతీ...

తిలకం కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. "అమ్మా. చౌడేశ్వరీ! నాకోడల్ని కాపాడు.. నీకు బిందెలు బిందెలు పాలు పోసి, అభిషేకం చేస్తా.." తిలకం మొక్కు ఇంకా పూర్తికాలేదు.

గీతాంబరి పల్స్‌రేట్‌ను గమనిస్తున్న నర్స్ ముఖం ఆందోళనకు గురైంది. ఆమె ముందున్న మానిటర్‌లో నుండి బీప్... బీప్... బీప్... అంటూ శబ్దం రావటం మొదలుపెట్టింది.




**మలబార్ హిల్స్...** నిశ్శబ్దంగా ఆ రాత్రి వేళ నిద్రిస్తోంది. నిన్న కురిసిన వర్షం వల్ల వీస్తున్న గాలిలోని తేమ చల్లగా ఒంటికి తగులుతోంది.

కమలా నెహ్రూ పార్కు వెనక కమ్ము కున్న చీకటిలో పోలీస్ జీపును నిలిపాడు మల్హోత్రా. టాక్సీ డ్రైవర్ సహాడే ముందుగా క్రిందికి దిగాడు. అతని వెనకే రమణీ, దివా కరూ దిగారు. అక్కడ పెట్రోమాక్స్ లైట్ వెలుగులో పానీపూరీ వ్యాపారం జోరుగా సాగుతోంది.

సహాడేను అడిగాడు మల్హోత్రా "ఆయన ఏ రోడ్డు మీదికి వెళ్ళాడు."

"పక్క రోడ్డు మీదికి సాబ్..."

"నడువ్..."

సహాడే ముందుగా దారితీశాడు. వెనకే ముగ్గురూ అనుసరించారు. రోడ్డు ప్రారం భంలో సెవెన్త్ క్రాస్ రోడ్ అన్న నేమ్ బోర్డు హిందీలో కనిపించింది.

"బాగా తెలుసా... ఈ రోడ్డే కదూ?" అడిగాడు మల్హోత్రా.

"అవును సాబ్."

రోడ్డు మీదికొచ్చారు అందరూ. కాస్త ఇరు కైన రోడ్డు. రోడ్డుకిరువైపులా బంగళాలు ఒక దాని పక్కన ఒకటి ఉన్నాయి. ఇండ్లలోని అద్దాల కిటికీల ద్వారా ట్యూబ్‌లైట్ వెలుగు బయటికి ప్రసరిస్తోంది.

"రమణీ..." మల్హోత్రా పిలిచాడు.

"సార్..."

"ఈ రోడ్లో ఇళ్ళు చాలానే ఉన్నాయ్.. మీ బ్రదర్ ఎవరిని కలవడానికి ఇక్కడికి వచ్చాడో ఎలా కనిపెట్టటం?"

"అదే అర్థం కావటం లేదు సార్."

"సార్, నాకో ఆలోచన తోస్తోంది" చెప్పాడు దివాకర్.

"చెప్పండి!"

"హరిహరన్ కలవడానికి వచ్చింది ఒక ఇండస్ట్రియలిస్టును కదా?"

"ఔను."

"ఈ సెవెన్త్ క్రాస్ రోడ్లో ఉన్న ఇండ్లలో ఇండస్ట్రియలిస్టులు ఎవరెవరో తెలుసుకుని వాళ్ళను విచారణ చేస్తే సరి. అందరినీ ఇ బ్బంది పెట్టకుండా"

"ఇదీ మంచి ఆలోచనే.. విచారణ చెయ్య వలసిన వాళ్ళు తగ్గిపోతే లోతుగా విచారణ చెయ్యడానికి అవకాశం ఉంటుంది."

దివాకర్ ఓ ఇంటిని చూపించి అన్నాడు. "సార్... ఇది ఓ ఆడిటర్ ఇల్లులా ఉంది. గుమ్మంలో బోర్డును చూశారా మంగల్ పాండే, చార్టర్డ్ అకౌంటెంట్ అని ఉంది. ఈయన్ను అడిగితే ఈ రోడ్డులో ఉన్న వాళ్ళలో ఇండస్ట్రియలిస్టులెవరెవరో తెలిసే అవకాశం ఉంది."

"అడిగేద్దాం."

మల్హోత్రా ఆ ఇంటి కాంపౌండ్ గేటును ముందుకు తోశాడు. ఆ శబ్దం విని లోప లున్న కుక్క మొరగటం మొదలుపెట్టింది. వెంటనే కిటికీలో నుండి ఒక స్త్రీ తొంగి చూసి "కోన్" అని గట్టిగా అరిచింది.

మల్హోత్రా హిందీలో బదులిచ్చాడు.

"ఆడిటర్ ఉన్నారా?"

"ఉన్నారు... లోపలికి రండి".

"భౌ... భౌ..."

"రోజర్, కీప్ క్వయిట్!" ఆ స్త్రీ గొంతును మిలట్రీ ఆర్డర్‌లా భావించి కుక్క మొర గటం ఆపేసింది. నలుగురూ గుమ్మం వద్దకు వెళ్లగానే, నల్లటి వెయిస్ట్ కోటు ధరిం



చిన యాభై ఏళ్ల మంగల్‌పాండే బయటికొచ్చాడు. మల్హోత్రా పోలీస్ యూనిఫామ్‌ను చూడగానే అతని నుదురు మీద గీతలు మెలికలు తిరిగాయి.

"ఎస్..."

"జెస్ట్ ఫర్ యాన్ ఎంక్వయరీ"

"వాట్ అబౌట్? "

మల్హోత్రా హరిహరన్ గురించి ఏమీ చెప్పకుండా నకిలీ ప్రొడెక్ట్‌కు సంబంధించిన ఓ విచారణ కోసం వచ్చినట్టు చెప్పాడు.

"ఈ సెవెన్త్ క్రాస్ రోడ్లో ముఖ్యమైన ఇండస్ట్రియలిస్టులు ఎవరైనా ఉన్నారా? " అని అడిగాడు.

మంగల్‌పాండే తన కనుబొమ్మల మధ్య చూపుడువేలితో గోక్కుంటూ అర క్షణం ఆలోచించి చెప్పాడు.

"ప్రత్యేకించి ఈ సెవెన్త్ క్రాస్ రోడ్‌లో ఉన్నవాళ్ల గురించి చెప్పాలా? లేక ఈ ఏరియాలో ఉన్నవాళ్ల గురించి చెప్పాలా? "

"ఈ రోడ్‌లో ఉన్నవాళ్ల గురించి చెప్పండి, చాలు..."

"ఇండస్ట్రియలిస్టులు అని లెక్క తీసుకుంటే ఈ రోడ్‌లో ఏడెనిమిది మంది ఉన్నారు"

"వాళ్లెవరెవరో లిస్ట్ ఇవ్వగలరా? "

"అదీ... అది రేపు ఏదైనా ప్రాబ్లమ్ వస్తే నాకు ఇబ్బంది అవుతుందేమో? "

"నో... నో... మిస్టర్ మంగల్‌పాండే! ఇది ఓ రహస్య ఎంక్వయిరీ... మీరిచ్చే వివ



రాలను దగ్గర పెట్టుకుని రహస్యంగా విచారణ జరుపుతాం. మీ పేరును ఎక్కడా బయటపెట్టం".

"ఇట్స్ ఓకే. పోలీస్ విచారణకు సహకరించడం ప్రతి భారతీయుడి బాధ్యత... నాకు తెలిసినంతవరకూ ఇండస్ట్రియలిస్టుల పేర్లను చెబుతాను. నోట్ చేసుకోండి"

మల్హోత్రా తన పాకెట్ డైరీ, పెన్ తీసుకున్నాడు. ఆడిటర్ మంగల్‌పాండే ఆలోచిస్తూ ఒక్కో పేరునూ చెప్పసాగాడు.

"కరియాలాల్... దేశ్‌ముఖ్... మురళీధర్ పవార్... జోషి... నారాయణ ప్రకాష్.. శంకర్ టక్కలే..."

ఆ పేర్లన్నీ రాసుకున్నాక మల్హోత్రా అడిగాడు "ఇప్పుడు చెప్పిన వ్యక్తుల్లో మీకు ఎవరు బాగా పరిచయం? "

"ఎవరూ లేరు. వాకింగ్ వెళుతున్నప్పుడు ఎదురుపడితే నవ్వటంతో సరి..."

"ఈ లిస్టులో మొదట ఎవరిని విచారణ చెయ్యొచ్చు? "

"మిస్టర్ జోషిని. నాలుగైదు బంగళాలు దాటాక రోడ్డు మలుపులో ఉంది ఆయన బంగళా. చాలా మంచి మనిషి. ఆయనకు ఎన్నో బిజినెస్‌లున్నాయి. ముందు మీరు ఆయనతో మాట్లాడిన తర్వాత మిగతా వాళ్లను విచారణ చెయ్యొచ్చు. అన్నివిధాలా ఆయన మీకు సహాయకారిగా ఉంటారు".

"థాంక్ యూ వెరీమచ్ మిస్టర్ మంగల్

పొందే!" ఆయన చేతిని షేక్‌చేసి మల్హోత్రా బయటకు నడిచాడు. రమణీ, దివాకరూ, సహదేవ్ ఆయన వెంట నడిచారు. ఆ రోడ్డు మలుపులో ఉన్న జోషి బంగళాకేసి నడిచారు ఆ నలుగురూ.

★ ★ ★

కిటికీ నుండి ఆదుర్దాగా కిందికి దూకింది ఆర్యా.

వాల్‌చంద్ అడిగాడు "అమ్మా... లోపల పడున్నది ఎవరు?"

"డా... డాక్టర్..."

"ఏ... ఏంటీ? ... డాక్టరయ్యగారా?"

"ఔను. తలకు బలమైన గాయమైంది. రక్తం బాగానే కారి మడుగు కట్టింది."

"ఏంటమ్మా... ఆశ్చర్యంగా ఉంది. బంగళా లోపలివైపు తాళం పెట్టి ఉంది. వెనక నుండి దారిలేదు. కాంపౌండ్ గేటూ మనం వస్తున్నప్పుడు లోపలివైపుగా తాళం పెట్టి ఉంది. అలాంటప్పుడు బయటి వ్యక్తి లోపలికి వెళ్లి డాక్టరయ్యపై దాడి చెయ్యడానికి వీల్లేదు కదమ్మా!"

ఆర్యా కంఠం వణికింది "వా.. వాల్‌చంద్ డాక్టర్‌పై దాడి చేసింది బయటి నుండి వచ్చిన వ్యక్తి కాదు."

"మ... మరి...!"

"లోపలున్న ఒక అమ్మాయే"

"అమ్మాయా?"

"ఔను! ఆమె పేరు నిషా... పత్రికాఫీసు నుండి వచ్చానని చెప్పి డిటెక్టివ్ పని చెయ్యబోయింది. మత్తుమందిచ్చి కేజ్ రూమ్‌లో బంధించాం. నేను విఠల్ డెడ్‌బాడీని తీసుకుని కారులో బయలుదేరి వెళ్లగానే, డాక్టర్ ఒంటరిగా ఎక్స్‌పెరిమెంట్ షెడ్యూల్లో మునిగిపోయి ఉన్నప్పుడు నిషాకు స్పృహ వచ్చి కేజ్ రూమ్ నుండి బయటికొచ్చి డాక్టర్‌పై దాడి చేసుండాలి"

"అలా జరిగి ఉంటే... ఆ నిషా బయటికి తప్పించుకుని పారిపోయిుండాలి కదమ్మా? మరి తలుపుకు లోపలివైపు తాళం పెట్టుందే?"

"వాల్‌చంద్, తలుపు లాక్ కాస్త లాఘవంగా తియ్యాలి. దాన్ని హ్యాండిల్ చెయ్యడం నాకూ, డాక్టర్‌కూ మాత్రమే తెలుసు".

వాల్‌చంద్ ముఖంలో కలవరం..

"మీరు చెప్పేదాన్నిబట్టి డాక్టర్‌పై దాడిచేసిన ఆ అమ్మాయి లోపలే ఉండాలి"

"ఔను. చీకట్లో దాక్కుని ఉండొచ్చు. నేనెలాగూ లోపలికి వస్తానని తెలిసి నా కోసం లోపల కాచుకుని ఉండచ్చు. ఆమె చేతిలో ఏదైనా ఆయుధం ఉండొచ్చు."

"ఇప్పుడేం చేద్దామమ్మా"

"ఆలోచించాలి వాల్‌చంద్!" అని ఆలోచనలో పడింది ఆర్యా.

కొన్నిక్షణాల తర్వాత ఉన్నట్టుండి ఆర్యా అంది "వాల్‌చంద్, డాక్టర్ పడున్న తీరును చూస్తుంటే ఆయన ప్రాణంతో ఉన్నట్టు అనిపించటం లేదు. డాక్టర్ మరణానికి కారకురాలైన ఆ నిషా తప్పించుకోవడానికి వీల్లేదు. ఎలాగైనా ఆమెను పట్టుకోవాలి"

"ఈ బంగళాలోకి వెళ్లడానికి వెనకపక్కగా ఏదైనా దారి ఉందామ్మా?"

"లేదే"

"ఏదో రకంగా నేను బంగళాలోకి వెళ్లగలిగితే, ఆ అమ్మాయిని పట్టుకోగలను"

ఆర్యా సాలోచనగా చూడసాగింది.

"అమ్మా"

"ఊఁ"

"లోపలికెళ్లడానికి ఏదైనా మార్గం దొరుకుతుందేమోనని బంగళా చుట్టూరా ఓసారి చూసొస్తానమ్మా, మీరు ఇక్కడే ఉండండి"

"ఆగు... వాల్‌చంద్, నేనూ వస్తా"

ఇద్దరూ ముందుకు దారి తీశారు. వాళ్ళు నడుస్తుంటే నేలమీద నిలిచి ఉన్న వాన నీరు చెదిరిపడుతోంది. అప్పుడప్పుడూ వీస్తున్న గాలులకు చెట్టు కొమ్మల్లోంచి

తుంపర రాలిపడుతోంది.

"అమ్మా, జోషి అయ్యగారిని కలవడానికి మీరూ డాక్టరూ కలిసి రావాల్సింది. బంగళాలో ఆయన్ను ఒంటరిగా వదిలేసి ఎందుకొచ్చారు? "

"నువ్వు ఇప్పుడు చెప్పిన విషయాన్నే నేనూ డాక్టర్‌తో చెప్పాను. ఆయన వినలేదు... 'నేను ల్యాబ్‌లో ఉంటాను. నువ్వెళ్లి వచ్చేయ్' అని చెప్పారు"

"ఆ అమ్మాయికి ఇచ్చిన మత్తు ఇంజెక్షను ఎన్ని గంటలవరకూ పనిచేస్తుందమ్మా"

"నాలుగ్గంటలు... లోపల జరిగిన సంఘటనను బట్టి చూస్తుంటే ఆమెకు తొందరగానే స్పృహ వచ్చి ఉండాలి. కేజ్ బయటికొచ్చి ల్యాబ్ పనిలో మునిగిపోయి ఉన్న డాక్టర్‌పై దాడి చేసి ఉండాలి. ఆ తర్వాత తప్పించుకోవడానికి ప్రయత్నించి తలుపు కున్న లాక్‌ను తెరవడానికి వీలుకాక లోపలే దాక్కొని ఉండాలి. కరెంట్ వచ్చాక మళ్ళీ తప్పించుకునే ప్రయత్నం చెయ్యొచ్చు"

మాట్లాడుకుంటూ బంగళా వెనక భాగానికి చేరుకున్నారిద్దరూ.

నడుస్తున్న వాల్‌చంద్ ఆగిపోయాడు.

"అమ్మా"

"ఏంటి వాల్‌చంద్? "

అతడి చూపులు ఇంటి పైభాగాన నిలిచి ఉన్నాయి.

"అది చిమ్నీనే కదమ్మా"?

ఆర్యా తన చూపుల్ని ఇంటిపైనున్న సిమెంట్ పిల్లర్‌లా ఉన్న పొగగొట్టంపై కేంద్రీకరించింది.

"అవును, అది చిమ్నీనే. పనికిరాని వస్తు

# మనసున ఉన్నదీ...

★ తెలుగు నవలా సాహిత్యంలో 'మర్రిమాను సాక్షిగా..' ఓ మంచి రచన. శైలి, శిల్ప పరంగా, చిత్తూరి మాండలికంలో, నేటి సాంఘిక సంఘర్షణను ఆవిష్కరించిన తీరు అద్భుతం. ఏ దృక్కోణం నుంచి చూసినా ఈ నవల ప్రతిభావంతంగా కన్పిస్తుంది.

– కె.ఎన్.రావు, కోడంబాకం, చెన్నై

★ సమాజంలోని సంఘటనలకు చక్కటి కల్పన జోడించిన వాస్తవికతావాద రచన 'మర్రిమాను సాక్షిగా..' చాలా బాగుంది. నయనతార తన సౌందర్య రహస్యాలను చక్కగా విశ్లేషించింది. చతురకత, జ్ఞానపీఠాలు, టాంక్‌బండ్ కథ 'బతుకుదారి', కొత్త గాలులు ఎంతో ఆకట్టుకున్నాయి.

–ఎన్.జగన్‌మాధవరావు,
బోయిన్‌పల్లి, కరీంనగర్ జిల్లా

★ మే చతుర నవలను ఏకబిగిన చదివాను. గ్రామీణ వాతావరణం కళ్లకు కట్టినట్లు చూపించారు. పోలీసులు, నక్సలైట్లతో గ్రామీణులు పడుతున్న కష్టాలు వాస్తవానికి దగ్గరగా ఉన్నాయి. ఈ నవలలో తలమానికం రాఘవరెడ్డి పాత్ర చిత్రణ. అతడి వ్యక్తిత్వం మనసుపై చెరగని ముద్ర వేసింది.

– కన్నెగంటి గౌరీ శంకర్, హైదరాబాద్

★ ఏప్రిల్ నవల 'ఇల్లు' ముగింపును మరవకముందే ఈనెల 'మర్రిమాను సాక్షిగా..' ముగింపూ అలాగే ఉండడం బాధించింది. సీత అమాయకత్వం, ధైర్యం ఆకట్టుకున్నాయి. పెళ్లి కుదిరిన తర్వాత రాఘవరెడ్డి ఆ అనుభూతి నుండి తేరుకోకముందే జరిగిన ఘోరం 'మన కళ్లముందే ఇలా జరిగిందే? ' అని మనసును కలచివేసింది.

–కె.అంకమ్మ, పూనూరు, ప్రకాశం జిల్లా

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా:
vipula.chatura@gmail.com

వున్ని కాల్చడానికి డాక్టర్‌గారే కట్టించారు. దాన్నిప్పుడు ఉపయోగించడం లేదు"

"దారి దొరికిందమ్మా" వాల్ చంద్ పళ్ళు చీకట్లో చాక్‌పీస్ గీతల్లాగా కనిపించాయి.

"వాల్ చంద్... నువ్వేమంటున్నావ్? "

"బంగళాలోకి వెళ్ళడానికి ఆ చిమ్నీనే నమ్మా మనకు దారి"

"దాని ద్వారా ఎలా వెళ్ళగలం? అది ఓ గొట్టం. పట్టుకోవడానికి ఏమీ ఉండదు. అందులోకి దిగితే ఇరవై అడుగుల ఎత్తు నుండి సరాసరి కిందపడి చెయ్యీకాలూ విరగ్గొట్టుకోవాలి"

"లేదమ్మా, నేను అందులోకి దూరి జాగ్రత్తగా కిందికి వెళ్ళగలను"

## కొత్తగాలి...



**కష్టం**
**కస్టమరుది!**
**సుఖం**
**కార్పొరేటుది!!**

– *గుడిమెట్ల గోపాలకృష్ణ*, అరసవిల్లి

"ఎలా? "

"గొట్టం లోపలికి దిగి, ఓ పక్కకు వీపును ఆనించి మరోపక్క కాళ్ళను గట్టిగా ఆనించుకుని అంగుళం అంగుళంగా దిగాలి"

"సాధ్యమేనా? "

"సాధ్యమేనమ్మా!"

"సరే కానీ... లోపల ఏమైనా జరగరానిది జరిగుంటే కిటికీలోనుండి చెప్పు"

"సరేనమ్మా!"

"లోపల నిషా ఎలాంటి ఆయుధాన్ని చేతబట్టుకుని ఎక్కడ దాక్కుని ఉందో తెలియదు... నువ్వు లోపల వేసే ప్రతి అడుగూ జాగ్రత్తగా వేయాలి. వీలైతే ఆమెను ప్రాణాలతో పట్టుకోవడానికి ప్రయత్నించు... లేకుంటే చంపేయ్"

"సరేనమ్మా" అంటూ తలాడించి వాల్ చంద్ ముందుకు కదిలాడు. కిటికీ గ్రిల్స్ మీద కాలుపెట్టి సన్‌షేడ్ పైకెక్కి, అక్కడ నుంచి ఇంటి మీదికి ఎక్కాడు.

ఇంటిపైనంతా తడితడిగా ఉంది. వాల్ చంద్ జాగ్రత్తగా నడిచి పొగగొట్టాన్ని చేరుకుని... దానిపైన మూసి ఉన్న కాంక్రీట్ పలకను అతి కష్టం మీద పక్కకు జరిపి... దాన్ని అలాగే పైకెత్తి పక్కనపెట్టి లోపలికి తొంగి చూశాడు. కటిక చీకటిగా ఉంది. చెయ్యిని లోపలికి చాపి చుట్టూ తడిమాడు. వ్రేళ్ళకంతా బూజు చుట్టుకుంది. ఒక్కసారిగా పైకెగిరి దాని ముఖభాగంపైన కూర్చుని మెల్లగా లోపలికి జరిగాడు. గొట్టానికి వీపును ఆనించి కాళ్ళతో ఎదురుగా తన్నిపట్టి కొద్దికొద్దిగా క్రిందికి జారసాగాడు.

పది నిమిషాల తర్వాత బంగళా నేల మీద వాల్ చంద్ పాదాలు ఆనాయి.

★ ★ ★

గీతాంబరి తల్లి పార్వతమ్మ అదురుతున్న గుండెతో హాస్పిటల్లోకి అడుగుపెట్టింది. లేబర్ వార్డును ఆనుకుని విచార వదనాలతో కూర్చుని ఉన్న మాసిలామణి, తిలకం ముందుకెళ్ళి నిలబడింది. ఆమె ఆయాసంతో వగరుస్తోంది.

"విషయం విని పరుగెత్తుకొస్తున్నాను. గీతాంబరికి ప్రసవం అయిందా? "

"అయింది, కొడుకు పుట్టాడు"

"పరాశక్తీ!" అంటూ సంతోషపడ్డ పార్వతమ్మకు తిలకం ముఖంలోనూ, మాసిలామణి ముఖంలోనూ కనిపించిన దిగులును గమనించి భయం పట్టుకుంది.

"ఎందుకలా ఉన్నారు? "

తిలకం బదులివ్వలేక కొంగును నోటికి అడ్డం పెట్టుకుని ఏడ్వసాగింది.

మాసిలామణి కీచుగొంతుతో అన్నాడు.

"చూడమ్మా... గీతాంబరికి కొడుకు పుట్టాడన్న సంతోషం వార్తతోపాటు మరో శుభవార్త కూడా ఇంతకు ముందే ముంబయి నుంచి అందింది. లారీ ప్రమాదంలో చనిపోయింది హరిహరన్ కాదట. రమణీ, దివాకరూ ఫోన్‌చేశారు"

"పరాశక్తీ!" మళ్ళీ పార్వతమ్మ కంట్లో ఆనందబాష్పాలు..

మాసిలామణి కొనసాగించాడు "కానీ, ఈ సంతోషాన్నంతా మనం అనుభవించకుండా గీతాంబరి అన్యాయం చేసేలా ఉంది"

"ఏ...ఏంటి మీరంటున్నది"

"గీతాంబరి ఇప్పుడు ఐ.సి.యూలో ఉంది. పల్స్‌రేటు బాగా పడిపోతోందని సమాచారం.. లోపల నలుగురైదుగురు డాక్టర్లు పరీక్షిస్తున్నారు."

"నా... బంగారు... తల్లీ" పార్వతమ్మ గొంతెత్తి ఏడవటం మొదలుపెట్టేసరికి, అక్కడికి వేగంగా పరుగెత్తుకొచ్చిన ఓ నర్సు, ఆమె భుజాన్ని పట్టుకుని ఊపింది.

"ఇదిగో చూడండమ్మా... ఏడ్చి గీపెట్టకుండా ఆ కుర్చీలోకెళ్ళి కూర్చోండి. మీ అమ్మాయికి ఏమీ కాదు"

మాసిలామణి పార్వతమ్మను ఓదార్చి కూర్చోబెట్టాడు.

"గీతాంబరి మనల్ని వదిలి వెళ్ళదు, ధైర్యంగా ఉండండి. స్టేట్స్ నుండి వచ్చిన డాక్టర్ మహాలక్ష్మికి ఫోన్‌లో సమాచారం ఇవ్వగానే వచ్చి చూస్తున్నారు."

"నా కూతురిని ఇప్పుడే చూడాలి" పట్టుబట్టింది పార్వతమ్మ.

"చూడొచ్చు ప్రశాంతంగా ఉండండి. హరిహరన్ మరణించలేదన్న సంతోషకరమైన వార్తను మనకు అందించిన ఆ దేవుడు గీతాంబరిని మాత్రం తీసుకెళ్ళిపోతాడా ఏం? " మాసిలామణి అలా అంటూండగానే, ఓ నర్సు వేగంగా అక్కడికి వచ్చింది.

"సార్..."

"ఏంటమ్మా? "

"డాక్టరమ్మ మిమ్మల్ని రమ్మంటున్నారు"

మాసిలామణి గాభరాగా పైకి లేచాడు.

"గీతాంబరి ఇప్పుడెలా ఉందమ్మా? "

"నాకు తెలియదు సార్. ఐ.సి. యూనిట్‌లోకి మిమ్మల్ని వెంటనే రమ్మని చెప్పి ఇంటర్‌కమ్‌లో చెప్పారు"

మాసిలామణి వరండాలో వేగంగా ముందుకు నడుస్తూంటే, ఆయన వెనుకే ఆదుర్దాగా తిలకమూ, పార్వతమ్మా అనుసరించారు. రెండు నిమిషాల నడక తర్వాత వాళ్ళు ఐ.సి.యూ చేరుకున్నారు.

గది బయట డాక్టర్ మనోరంజితం, మహాలక్ష్మి నిలబడి ఉన్నారు.

"డా... డాక్టర్...."

## కొత్తగాలి... 

**అర్చనలూ, అభిషేకాలు**
**అన్నీ రేటే**
**దేముడు కూడా**
**కార్పొరేటే?**

**– దూసి ఆపిల్,**
మారతహళ్ళి, బెంగళూర్

"డోంట్ బి ఎమోషనల్. గీతాంబరి ప్రమాదస్థితిని దాటేసింది."

"డా.... డాక్టర్..." మాసిలామణి ఆ ఆనందాన్ని తట్టుకోలేకపోయాడు. ఆనందంతో కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

డాక్టర్ మహాలక్ష్మి చిన్నగా నవ్వింది. "మీ కోడలు కళ్ళు తెరవగానే రెండు ప్రశ్నలు వేసింది. మొదటిది 'ఏం బిడ్డ? ' అని, రెండోది- 'మావయ్య ఎక్కడ? ' అని"

"లోపలికెళ్ళి చూడొచ్చా డాక్టర్? "

"అందుకేగా రమ్మన్నది.. వెళ్ళి చూడండి. ఎక్కువసేపు మాట్లాడనివ్వకండి..."

మాసిలామణి, తిలకం, పార్వతమ్మ ముగ్గురూ ఐసి యూనిట్‌లోకి వెళ్ళారు. పైకిలేపి ఉంచిన మంచంపై గీతాంబరి కళ్ళు మూసుకుని పడుకుని ఉంది.

ముగ్గురూ మంచాన్ని చుట్టుముట్టారు.

మాసిలామణి పిలిచాడు "అమ్మా.... గీతాంబరీ..."

"............"

"మావయ్యను వచ్చానమ్మా."

గీతాంబరి మెల్లగా కళ్ళు తెరిచింది. నీర సించిన ఆ కళ్ళు మాసిలామణి మీద నిలి చాయి. పెదాలు మెల్లగా విచ్చుకున్నాయి.

"మా.... మావయ్యా"

"ఏమ్మా"

"బి... బిడ్డ పుట్టిన... వి.. విష యాన్ని... జ... జర్మనీలో... ఉ... ఉన్న మీ... అబ్బాయికి.. ఫోన్‌లో చెప్పారా?"



9

**ఇన్‌స్పెక్టర్** మల్హోత్రా, రమణి, దివాకర్ ముగ్గురూ మెల్లగా నడుచుకుంటూ రోడ్డు మలుపులో ఉన్న జోషి బంగళాను సమీపిం చారు. గాల్లో ఏదో తెలియని పరిమళం వారిని స్పృశించింది.

కాంపౌండ్ గేటు దగ్గరికి వేసుంది. మల్హోత్రా దాన్ని నెట్టాడు. అది నిశ్శబ్దంగా తెరుచుకుంది... లోపలికి నడిచారు. పోర్టి కోలో ఉన్న కాంటెస్సా కారును తుడుస్తున్న యూనిఫామ్ ధరించిన డ్రైవర్, ఇన్‌స్పెక్ట రును చూసి చేస్తున్న పనిని ఆపాడు.

మల్హోత్రా అతణ్ణి సమీపించి అడిగాడు: "జోషీని కలవాలి.. ఉన్నారా?"

"ఉన్నారు... సాబ్..."

"ఫ్రీగా ఉన్నారా.. బిజీగా ఉన్నారా...?"

"హాల్లో ఫ్రీగానే ఉన్నారు."

"వెళ్ళి అనుమతి తీసుకురా"

డ్రైవర్ తలాడించి లోపలికి వెళ్ళి వెంటనే బయటికొచ్చాడు.

"రమ్మంటున్నారు సాబ్"

పోర్టికో మెట్లెక్కి ముగ్గురూ లోపలికి వెళ్ళారు. వెడల్పైన ఆ హాల్లో ఉన్న సోఫాలో జోషి కూర్చుని ఉన్నాడు. నోట్లో పైప్. ఎదురుగా ఉన్న సోఫాను చూపిస్తూ అన్నాడు జోషి, "వెల్‌కమ్ ఇన్‌స్పెక్టర్. అయాం జోషి"

"మిమ్మల్ని ఇబ్బంది పెడ్తున్నందుకు క్షమించాలి. చిన్న విచారణకు వచ్చాం"

గుండెల్లో గుబులుగా ఉన్నా దాన్ని ప్రద ర్శించకుండా నవ్వాడు జోషి, "ప్లెషర్ ఈజ్ మైన్! ఏం విచారణ?"

మల్హోత్రా సోఫాలో వెనక్కు వాలుతూ అడిగాడు, "మీకు హరిహరన్ తెలుసా?"

జోషి ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. గుండెలో పేలుతున్న అగ్నిపర్వ తాలను బయటికి కనిపించనీయకుండా ముఖాన్ని మామూలుగా ఉంచుకుని ఇన్ స్పెక్టర్ మల్హోత్రాతో అన్నాడు,

"పేరేమిటన్నారు?"

"హరిహరన్"

"ఈ ప్రాంతానికి చెందినవారేనా?"

"కాదు, చెన్నై"

జోషి ఆలోచిస్తున్నట్టు ముఖం పెట్టి చివ రకు అడ్డంగా తలూపాడు.

"తెలియదు."

"హరిహరన్ చెన్నైలో పెద్ద బిజినెస్ మేన్. నిన్న ముంబాయికి వచ్చి ఇవ్వాళ ఉదయం ఫ్రాంక్‌ఫర్ట్‌కు వెళ్ళటానికి

హోటల్ సిల్వర్ శాండ్‌లో బసచేశారు. మలబార్ హిల్స్‌లో ఎవరినో కలవడానికి నిన్న రాత్రి టాక్సీ మాట్లాడుకొని వచ్చారు. ఆ తర్వాత ఆయన కనిపించలేదు."

తన ముఖం మీదికి ఓ ఆశ్చర్యాన్ని అద్దెకు తెచ్చుకుని- "ఏ... ఏంటీ... కనిపించడం లేదా...? "

"ఎస్..."

"హరిహరన్ మలబార్ హిల్స్‌కు వచ్చాడని మీకెలా తెలుసు? "

"ఆయన్ను ఇక్కడికి తీసుకొచ్చిన టాక్సీ డ్రైవర్ చెప్పాడు. టాక్సీ రోడ్డు మొదట్లో చెడిపోవటంతో హరిహరన్ టాక్సీని అక్కడే వెయిట్ చేయమని చెప్పి, ఈ వీధిలోకి వచ్చాడు. అలా వచ్చినవాడు... మళ్ళీ తిరిగిరాలేదని చెప్పిన డ్రైవర్‌ను తీసుకొచ్చాం. అతను బయట నిలబడి ఉన్నాడు"

జోషి లోలోన కంగారుపడ్డాడు.

మల్హోత్రా కొనసాగించాడు. "ఓ నకిలీ ప్రాడెక్ట్ విషయంగా హరిహరన్ ఓ వ్యక్తిని కలవడానికి ఇక్కడికి వచ్చాడు. ఆ పార్టీ ఎవరో కనిపెట్టే ప్రయత్నమే ఈ విచారణ"

జోషి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు, "మిస్టర్ ఇన్‌స్పెక్టర్, ముంబాయిలో నేను ఓ వెల్‌నోన్ బిజినెస్ మ్యాన్. నాకు లెక్కలేనన్ని బిజినెస్‌లున్నాయి. ఇండియాలో ఉన్న అన్ని ముఖ్యమైన బిజినెస్ పార్టీలన్నీ నాకు తెలుసు. కానీ మీరంటున్న ఈ హరిహరన్ గురించి నాకు తెలియదు. ఆయన ఏం ప్రాడెక్ట్స్ తయారు చేస్తారు? "

రమణి అడ్డుపడి చెప్పాడు, "ఎలక్ట్రానిక్స్‌కు సంబంధించిన ప్రాడెక్ట్స్... కంపెనీ పేరు ఫ్యూచర్ బ్రైడ్...."

"సారీ. ఆ పేరును నేను విన్నదే లేదే."

రమణి చేతులు జోడించి నమస్కరించాడు. "మిస్టర్ జోషి... నా పేరు రమణి, హరిహరన్ బ్రదర్‌ను. ఇతను దివాకర్ హరిహరన్‌కు బ్రదర్ ఇన్ లా అవుతారు. ఇద్దరూ పోలీసుల సాయంతో హరిహరన్‌ను కనిపెట్టేందుకు నానా కష్టాలూ పడుతున్నాం. హరిహరన్ కచ్చితంగా ఎవరో ఓ బిజినెస్ పార్టీని కలిసి 'నకిలీ ప్రాడెక్ట్' విషయంగా మాట్లాడ్డానికి వచ్చాడు. ఆ పార్టీ ఎవరో తెలిస్తే చాలు.. ఆ పార్టీని కనిపెట్టేందుకు మీరూ మాకు సాయపడాలి."

జోషి తన కంఠంలో దిగులును కనబరుస్తూ రమణితో అన్నాడు, "సారీ, మిస్టర్ రమణీ. ఈ మలబార్ హిల్స్‌లో ఉన్న వ్యాపారస్తులలో సగం మంది నాకు తెలియదు. కొత్త కొత్తగా ఎవరెవరో బిజినెస్‌లు ప్రారంభిస్తున్నారు. అందులో నకిలీ ప్రాడెక్ట్ తయారు చేసేది ఎవరో కనిపెట్టడం కష్టం. నాకు తెలిసినంతవరకూ మనం చేస్తున్న వ్యాపారం దైవంతో సమానం. తయారు చేస్తే నాణ్యమైన వస్తువులే తయారుచేయాలి. లేకపోతే వ్యాపారమే వదిలెయ్యాలి. ఇదే నా పాలసీ. మీ బ్రదర్ హరిహరన్ ఈ ఏరియాలో ఉన్న ఎవరిని కలవడానికి వచ్చి ఉంటాడో నాకు తెలియటం లేదు. అయినా కొంతమంది పార్టీల పేర్ల జాబితాను ఇస్తాను. మీరు పోలీసుల సాయంతో విచారణ చేసి చూడండి. ఈ విషయంలో నా పూర్తి సహకారం మీకుంటుంది"

"థాంక్యూ వెరీమచ్ సార్..." రమణి మళ్ళీ చేతులు జోడించాడు.

★ ★ ★

పొగగొట్టం ద్వారా క్రిందికి దిగిన వాల్‌చంద్, కళ్ళు చీకటికి అలవాటు పడేంతవరకూ నిలబడ్డాడు. తర్వాత దేనికీ గుద్దుకోకుండా పిల్లిలా ల్యాబరేటరీకేసి నడిచాడు.

బంగళాలో నిశ్శబ్దం రాజ్యమేలుతోంది.

ఉన్నట్టుండి ఏదో ఓ పక్క నుంచి నిషా వచ్చి తనపై దాడి చేస్తుందేమోనన్న భయంతో అటు ఇటు చూస్తూ ఎంతో జాగ్రత్తగా ముందు భాగంలోకి వచ్చాడు.

బీరువా పక్కన డాక్టర్ చతుర్వేది పడు న్నాడు. ధైర్యాన్ని కూడదీసుకుని డాక్టర్ సమీపానికి వెళ్ళాడు. చూపుల్ని ఓ సారి బీరువా వెనకాల సారించి, చతుర్వేది పక్కన మోకాళ్ళపై కూర్చున్నాడు.

డాక్టర్‌ను వెల్లకిలా తిప్పడానికి చేతుల్ని పట్టుకున్నాడు. రక్తం చేతికి అంటుకుంది.

"వాల్‌చంద్..." మెత్తటి గొంతు విని పించి పక్కకు చూశాడు.

కిటికీ బయట ఆర్యా కనిపించింది.

"డాక్టర్ ప్రాణాలతో ఉన్నారా...."

వాల్‌చంద్ ఎడమచేతి వేలిని చతుర్వేది ముక్కుక్రింద పెట్టి చూశాడు.

బలహీనంగా శ్వాస ఆడుతోంది.

ఆదుర్దాగా కిటికీ కేసి చూస్తూ పిలిచాడు "అ..మ్మా..."

"ఏంటి వాల్‌చంద్? "

"ఊపిరి ఆడుతోంది."

"ఏంటీ? " ఆనందంతో అంది ఆర్యా.

"అవునమ్మా..." కిటికీ పక్కకు పరుగెత్తు కొచ్చి చెప్పాడు. "బలహీనంగా ఊపిరి వదు లుతున్నారు..."

"రక్తస్రావం ఎక్కువగా అయినట్టుంది. గాయం ఎలా అయిందో చూడూ..."

వాల్‌చంద్ పక్కకెళ్ళి ఓ అగ్గిపుల్లను గీసి పదిహేను సెకన్ల వెలుగులో డాక్టర్ ముఖాన్ని చూశాడు. తలకు ముందు భాగంలో ఓ గాయముంది. ఒంట్లో ఇక ఏ భాగంలోనూ గాయాలు లేవు. కారిన రక్తం మాత్రం అక్కడక్కడా ఎండిపోయి ఉంది.

అగ్గిపుల్ల ఆరిపోవటంతో మళ్ళీ కిటికీ పక్కకొచ్చాడు.

"అమ్మా! డాక్టరయ్యకు పెద్దగా గాయా లేమీ కాలేదు. తలమీద మాత్రమే గాయ మైంది. భయపడేలా ఏమీ కాలేదు."

"వాల్‌చంద్! వెంటనే ఓ పని చేయ్..."

"చెప్పండమ్మా..."

"డాక్టర్‌పై దాడి చేసిన నిషా ఇదే బంగ ళాలో ఏదో ఓ చోట దాక్కొని ఉండాలి. లే దా, భయంతో మూర్ఛపోయుండాలి..."

"చూస్తానమ్మా..."

"జాగ్రత్త! చేతిలోకి ఏమైనా తీసుకో. నిషా నీపై దాడికి ప్రయత్నిస్తే, ఇంకేమీ ఆలోచించకు... ఒక్క దెబ్బతో సఫా చేసేయ్...."

"సరేనమ్మా"

"మొదట కేజ్ రూమ్ పక్కకెళ్ళి చూడు.. అక్కడ లేదని తెలిస్తే ల్యాబ్ తలుపును మూసేసి గుమ్మం తలుపు దగ్గరికి రా..."

"మీరు ధైర్యంగా ఉండడమ్మా... ఆ సైతాన్ సంగతి నేను చూసుకుంటాను" అని గోడకు ఆనించి ఉన్న టెస్ట్‌ట్యూబ్ ఇను పస్టాండ్‌ను చేతిలోకి తీసుకుని కేజ్‌రూమ్ వద్ద ఉన్న ల్యాబొరేటరీకేసి నడిచాడతను.

ఆర్యా కిటికీ బయట ఆత్రుతగా ఎదురు చూడసాగింది.

క్షణాలు గడుస్తున్నాయి.

ఒక నిమిషం... రెండు నిమిషాలు.... బంగళాలోని చీకటినే చూడసాగింది ఆర్యా. ఏ కదలికలూ కనిపించలేదు.

మూడు నిమిషాలు పూర్తవుతుండగా ఆర్యాలోని అడ్రినల్ గ్రంథి అంతకంతకూ భయాన్ని అధికం చెయ్యసాగింది.

'ల్యాబరేటరీలోకి వెళ్ళిన వాల్‌చంద్ ఇంకా రాలేదేమిటబ్బా? పిలిచి చూద్దామా? వద్దు ఇంకొక నిమిషం ఆగిచూద్దాం. వాల్ చంద్‌కు అంతగా అలవాటులేని చోటు ఇది... అందుకే ఆలశ్యం కావచ్చు.'

ఆర్యా చీకట్లో కిటికీ చువ్వలను పట్టుకుని ఎదురుచూస్తోంది. నాల్గవ నిమిషం, ఐదో నిమిషం కూడా కరిగిపోయింది. ఆరోని మిషం ఆరంభమైంది.

ఆర్యా చెవికి ఏ చిన్న శబ్దమూ వినిపిం చలేదు. 'ఇక ఆలశ్యం చెయ్యకూడదు!... పిలవాల్సిందే...'

"వాల్ చంద్..." అని గొంతెత్తి పిలుస్తున్న క్షణాన... బంగళాలో నుండి ఆ శబ్దం వినిపించింది.... "కి...ర్...ర్రు..." ల్యాబొరేటరీ తలుపు మూస్తున్న శబ్దం. ఆర్యా తన చూపుల్ని గుచ్చి గుచ్చి ఆ చీకట్లోకి చూడసాగింది. ఓ ఆకారం మెల్లగా కదిలి రాసాగింది.

★ ★ ★

గీతాంబరి మాసిలామణికేసి చూసింది.

"ఏ... ఏంటి మామయ్యా... మాట్లాడకుండా మౌనంగా ఉన్నారు?"

మాసిలామణి సర్దుకుని, పెదాలపై నవ్వు తెచ్చుకుని కోడలిని చూశాడు.

"నువ్వు ఏం అడిగావమ్మా?"

"బిడ్డ... పుట్టిన... విషయాన్ని జర్మనీలో ఉన్న మీ అబ్బాయికి ఫోన్ చేసి చెప్పారా మావయ్యా?"

"ఇక చెప్పాలమ్మా..."

"ఇంకా చెప్పలేదా? ..."

"ఇప్పుడే చెప్పేస్తానమ్మా..."

"మా... మావయ్యా...."

"చెప్పమ్మా..."

"ఆయనతో మాట్లాడాలని ఉంది..."

"చూడమ్మా... నువ్విప్పుడున్న పరిస్థితిలో నీకు ఏ కష్టమూ కలగకూడదని డాక్టరమ్మ చెప్పింది... నువ్వు ప్రసవించి కళ్ళు తెరిచి చూసేలోపు... మేము పడ్డ టెన్షన్ ఆ చౌడేశ్వరిదేవికే తెలుసు. ఆరోగ్యం కుదురుకున్నాక నీ భర్తతో మాట్లాడుదువులే. ఇప్పుడేం తొందర?"

"అత్తయ్యా... ఆయన గొంతు వినాలని ఉంది. ఆయన ఆనందంతో పొంగిపోతుంటే చూడాలనిపిస్తోంది."

"రేపు ఫోన్‌చేసి మాట్లాడుదువులే."

"ఇప్పుడే మాట్లాడాలి..."

"చెబితే వినాలి" తిలకం అలా అంటూ ఉండగానే... తలుపు తెరిచి లోపలికి తొంగి చూసిన నర్సు మాసిలామణితో అంది, "సార్, ముంబాయి నుండి మీకు ఫోన్! మీ సన్ రమణి లైన్‌లో ఉన్నారు. వస్తారా?"

'ముంబాయి నుండి రమణి కాలా?' మనసులో ఏదో అనుమానం పీడిస్తుంటే, గీతాంబరి ముఖంలో కలవరం..

గీతాంబరి ముఖంలో కనిపిస్తున్న మార్పుల్ని గమనిస్తున్న మాసిలామణి తన ముఖాన్ని ప్రశాంతంగా పెట్టుకొని అన్నాడు "ఏంటమ్మా అలా చూస్తున్నావ్?"

"మా... మావయ్యా... రమణి కొచ్చికి వెళ్ళినట్టు చెప్పారుగా... ఇప్పుడు ముంబాయి నుండి ఫోన్ అంటోందేంటీ?"

"అదీ... రమణి కొచ్చికే వెళ్ళాడు. హరిహరన్ జర్మన్ వెళ్లే ముందు ముంబయిలో బిజినెస్ పార్టీ ఒకరిని ఎక్స్‌పోర్టు ఆర్డర్ గురించి మాట్లాడాలని రమణిని రమ్మన్నాడు. దాంతో ముంబయికి వెళ్ళాల్సివచ్చింది."

ఎంతో సులభంగా అబద్ధమాడేస్తున్న భర్తను తిలకం ఆశ్చర్యంగా చూస్తుండగానే, గీతాంబరి హీన స్వరంతో ప్రశ్నించింది.

"రమణి కొచ్చి నుండి ముంబయికెప్పుడు వెళ్ళాడు మావయ్యా."

"ఇ... ఇవ్వాళే... ఉదయం వెళ్ళాడు."

"మా... మావయ్యా..."

"ఏంటమ్మా?"

"ఇలా.. నా... పక్కకు రండి" వెళ్ళాడు.

గీతాంబరి మెల్లగా అంది, "నేను ఓ విషయం అడిగితే తప్పుగా అనుకోరుగా"

"అడుగమ్మా"

"నాకు మగపిల్లాడు పుట్టడం సంతోషకరమైన విషయమే కదు మావయ్యా?"

"ఏంటమ్మా అలా అడిగేశావ్... ఎంత పెద్ద సంతోషకరమైన విషయం ఇదీ..."

"మరెందుకు మావయ్యా... మీ ముఖంలోనూ సరే, అత్తయ్యా ముఖంలోనూ సంతోషం కొద్దిగా కూడా కనిపించడంలేదు. నిన్న ఇంట్లో ఉన్నప్పుడూ సరే, ఇవ్వాళ హాస్పిటల్లోనూ సరే, మీరిద్దరూ ఒక్కసారి

కూడా నవ్వింది నేను చూడలేదు. ఏదో బాధపడుతున్నట్టుగా అనిపిస్తోంది. అది నాకు తెలియకూడదని మీరనుకోవటమూ నాకు తెలుసు."

మాసిలామణి బదులిచ్చేంతలో తిలకం అడ్డుపడి చెప్పింది, "నువ్వు అనుకునే దేమీ లేదమ్మా... మీ మావయ్యకు కాస్త బిజినెస్ టెన్షన్. నాకు నీ గురించే దిగులు. నువ్వు సుఖంగా ప్రసవించి బతికి బట్టకడితే అంతే చాలని మొక్కని దేవుళ్ళు లేరు..."

"అత్తయ్యా..."

"ఏంటమ్మా...."

"నాకు మీ అబ్బాయితో మాట్లాడాలని ఉంది. అదీ ఇప్పుడే..." గీతాంబరికి శ్వాస పీల్చటం కష్టంగా తోచింది.

"కాస్త.. నీ ఆరోగ్యం కుదుటపడనీ...."

"నాకేమీ కాదు అత్తయ్యా... ఫోన్లో ఆయన గొంతు వింటే నాకు ఉత్సాహం వచ్చేస్తుంది... నాకు ఫోను ఏర్పాటు చెయ్యమనండి అత్తయ్యా..."

ఇంతలో డాక్టర్ మనోరంజితం లోపలికి వచ్చింది. "ఇదిగో- చూడమ్మా గీతాంబరీ, నువ్విప్పుడు నీ భర్తతో మాట్లాడాలి. అంతే కదా. నేను ఏర్పాటు చేస్తాను. దానికి ముందు... నువ్వీ ఇంజెక్షన్ వేసుకో."

చేతిలో ఉన్న ఇంజెక్షను గీతాంబరి చేతికి చేస్తూ పక్కన నిలబడి ఉన్న మాసిలామణితో అంది. "మీరు వెళ్ళి ముంబయి ఎస్టిడి కాల్‌ను అటెండ్ చెయ్యండి."

"డా... డాక్టర్."

మనోరంజితం గీతాంబరికి తెలియకుండా కన్ను గీటింది. "గీతాంబరి తన భర్తతో మాట్లాడాలని కోరుకోవటంలో తప్పేమీ లేదు. ఆ ఏర్పాట్లు చేద్దాం...."

మాసిలామణి డాక్టర్ మాటల్ని అర్థం చేసుకుని బయటికెళ్ళాడు.

కాసేపటికంతా గీతాంబరి కళ్ళు మెల్లగా మూసుకుపోయాయి.

మనోరంజితం తిలకాన్నీ, పార్వతమ్మనూ చూస్తూ అంది, "ఇక ఉదయం వరకూ ప్రాబ్లం లేదు. కానీ రేపూ గీతాంబరిని ఇలా మోసగించడం కుదరదు. ఈ లోపల ఆమె తన భర్తతో మాట్లాడేందుకు ఏదైనా ఏర్పాట్లు చేసే తీరాలి. ఆదుర్దా కలిగించే ఏ విషయాన్నైనా తట్టుకునే మానసికస్థితి గానీ, శారీరకస్థితి గానీ ప్రస్తుతానికి ఆమెకు లేవు. ఆ కారణంగా ఫిట్స్ వస్తే, గీతాంబరిని మనం పోగొట్టుకోవలసి వస్తుంది."

★ ★ ★

రమణి టెలిఫోన్‌లో గొంతు తగ్గించి మాట్లాడసాగాడు.

"నాన్నా నేను రమణిని. ఫోన్ దగ్గరకు రావటానికి ఎందుకింత ఆలశ్యం?"

"నువ్వు ముంబాయి నుండి ఫోన్ చేసినట్టు ఒక నర్సు వచ్చి గీతాంబరి ముందే చెప్పేసింది. గీతాంబరికి అనుమానం వచ్చి ప్రశ్నల మీద ప్రశ్నలు.. ఎలాగో సర్దిచెప్పి వచ్చేలోపు ఇంత ఆలశ్యమైంది"

"వదినకు డెలివరీ...?"

"అయింది... మగబిడ్డ... వెయిట్‌లెస్ చైల్డ్! లైట్ బాక్స్‌లో పెట్టున్నారు! బిడ్డ పుట్టినందుకు సంతోషిద్దామన్నా వీలు కావడంలేదు"

"నేను ఏ కారణంగా ముంబాయి వెళ్ళానని మీరు వదినతో చెప్పారు నాన్నా?"

## కొత్తగాలి...

**పుడుతూనే ఏడుస్తాడు**
**చనిపోయీ ఏడ్పిస్తాడు**
**జీవిత కాలంలో**
**ఇదే మనిషి నైజం**

– శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు,
వాకాడు

"బిజినెస్ విషయంగా నువ్వు కొచ్చి నుండి ముంబాయికి వెళ్లినట్టు చెప్పాను..."

"వదిన నమ్మిందా?"

"నమ్మలేదనుకుంటున్నాను. హరిహరన్‌తో వెంటనే మాట్లాడాలని మొండికేస్తోంది. నాకేం చెయ్యాలో తోచటం లేదు రమణీ. హరిహరన్ సమాచారం ఏమైనా తెలిసిందా?"

"లేదు! కానీ అన్నయ్య నకిలీ ప్రొడెక్ట్ విషయంగా ఎవరినో కలవడానికి మలబార్ హిల్స్ ఏరియాకు వెళ్ళినట్టున్నాడు. ఎస్సై మల్హోత్రా నన్నూ, దివాకర్‌నూ ఆ ఏరియాకు తీసుకెళ్ళి, అక్కడున్న బిజినెస్ పార్టీలతోనూ హరిహరన్ గురించి విచారణ చేశారు. కానీ ఎవరికీ అన్నయ్య గురించి తెలియదన్నారు".

"ఎస్సై ఇంకా ఏయే ప్రయత్నాలు చెయ్యబోతున్నారు?"

"ఆయన వెక్స్ అయిపోయారు నాన్నా! మలబార్ హిల్స్ పెద్ద పెద్ద ధనవంతులు ఉండే ఏరియా... విచారణ, వెతకటం అంటూ రెండోసారి అక్కడికి వెళ్ళడానికి వీల్లేదు. వెళితే పరువు నష్టం అంటూ కేసులు పెట్టి పోలీసులనే కోర్టుకు లాగుతారు. సో, ఈ విషయంలో ఓర్పు వహించి హరిహరన్‌ను కనిపెట్టడానికి మరేదైనా మార్గం ఆలోచిద్దామన్నారు. ఇప్పుడు నేను పోలీస్‌స్టేషన్ నుండే మాట్లాడుతున్నాను."

"రమణీ..." మాసిలామణి గొంతు బలహీనంగా పలికింది.

"చె... చెప్పండి నాన్నా"

"ఈ రాత్రి తెల్లారేలోపు హరిహరన్‌ను కనిపెట్టేస్తే సరి... లేకుంటే గీతాంబరిని కంట్రోల్ చెయ్యటం చాలా కష్టం. టెలిఫోన్‌లో హరిహరన్‌లాగా మాట్లాడడం ఇప్పుడు నీకూ కుదరకపోవచ్చు ఒకవేళ కుదిరినా మీ వదిన కనిపెట్టేయ్యొచ్చు"

"నువ్వు చెప్పింది కరెక్ట్ నాన్నా. వదినతో అన్నయ్యలాగా నేనే నేచురల్‌గా మాట్లాడలేను. తప్పకుండా పట్టుబడిపోతాను."

"ఇప్పుడేం చేద్దాం రమణీ?"

"నాన్నా, మీరు ధైర్యంగా ఉండండి... ఇన్‌స్పెక్టర్ మల్హోత్రా అన్నయ్యను కనిపెట్టడానికి ఇంకేం చేస్తారో చూద్దాం."

"పన్నెండు గంటల్లోపు హరిహరన్ మీ వదినతో మాట్లాడి తీరాలి... రమణీ! ఈ రాత్రంతా నేను హాస్పిటల్లోనే ఉంటాను. నువ్వు ఎప్పుడైనా ఫోన్ చెయ్యొచ్చు.."

"స.. సరే నాన్నా..." కన్నీళ్లతో రిసీవర్‌ను పెట్టేసి ఎదుట కూర్చొనున్న మల్హోత్రాను చూశాడు రమణి.

"సార్... అక్కడ వదిన హెల్త్ కండీషన్ బాగా లేదట. అన్నయ్య ఉన్న చోటును ఎలాగైనా ట్రేస్ చేసి, వదినతో మాట్లాడించాలని నాన్న అంటున్నారు"

మల్హోత్రా ఓ కొత్త పాన్‌ను నోట్లో పెట్టుకుని చేతుల్ని తుడుచుకున్నాడు.

"మిస్టర్ రమణీ, మీరూ మీ నాన్నా తొందరపడితే- ఇది జరిగే పనికాదు... ముంబాయి ఓ కుగ్రామం కాదు. మహానగరం. దాదాపు రెండుకోట్ల జనాభా. అందులో హరిహరన్ ఎక్కడున్నాడని వెతకాలి? రేపు ఉదయం అసిస్టెంట్ కమీషనర్‌తో మాట్లాడి ఓ పోలీస్ స్క్వాడ్‌ను నియమించమని చెప్పి, వాళ్ళకు వెతికే పనిని అప్పగించాలి..."

"సా... సార్" రమణి ఏదో చెప్పడానికి నోరు తెరిచేలోపు ఓ కానిస్టేబుల్ మల్హోత్రా ముందుకొచ్చి సెల్యూట్ చేశాడు. తర్వాత అతను హిందీలో "సార్... కుర్లా పోలీస్ ఇన్‌స్పెక్టర్ షిండే మిమ్మల్ని కలవడానికి వస్తున్నారు" అన్నాడు.

"ఆ కుర్చీని ఇక్కడ వెయ్"

కానిస్టేబుల్ కుర్చీని వేసేలోపే మధ్య వయస్కుడైన షిండే లోపలికి వచ్చాడు. పరస్పరం షేక్ హ్యాండ్ ఇచ్చుకున్నాక

హిందీలో ఏదో మాట్లాడి, అసలు విషయం లోకి వచ్చాడు షిండే.

"మిస్టర్ మల్హోత్రా! హోటల్ సిల్వర్ శాండ్‌లో బసచేసిన హరిహరన్ అన్న వ్యక్తి నిన్న రాత్రి నుండి కనిపించకుండా పోయాడనీ, ఆ కేసును మీరే హ్యాండిల్ చేస్తున్నారనీ విన్నాను... నిజమేనా?"

"ఔను"

"ఆ హరిహరన్ గురించి ఏవైనా వివరాలు తెలిశాయా?"

"లేదు. దాని గురించే మాట్లాడుకుంటున్నాం. ఇతను ఆ హరిహరన్ బ్రదర్ రమణీ, ఇతను బ్రదర్ ఇన్ లా దివాకర్"

వాళ్ళనోసారి చూసి మల్హోత్రాతో అన్నాడు షిండే, "ఆ హరిహరన్ కనిపించకుండా పోయిన అదేరోజు రాత్రే, కుర్లా ప్రాంతం నుండి మరో ఇద్దరు వ్యక్తులు కూడా కనిపించకుండా పోయారు. ఓ ఆడా, ఓ మగా! మగవాడి పేరు విఠల్. అమ్మాయి పేరు నిషా. నిషా పత్రికా విలేఖరి. నిషా నిన్న సాయంత్రం వర్షం పడక ముందే బయటికెళ్ళింది. ఈ క్షణం వరకూ ఇంటికి తిరిగి రాలేదు. విఠలూ కనిపించడం లేదు. విచారణలో నిషా తమిళనాడు అమ్మాయని తెలిసినందువల్ల... అది హరిహరన్‌కు సంబంధించిన వ్యవహారంగా ఏమైనా ఉండొచ్చేమోనని భావించి మిమ్మల్ని ఓ ఫార్మల్ ఎంక్వయిరీ చేద్దామని వచ్చాను.."

మల్హోత్రా రమణిని చూశాడు.

"పత్రికా విలేఖరి నిషా మీకు తెలుసా?"

"తెలియదు సార్..."

"విఠల్?"

"ఆ పేరును విన్నది కూడా లేదు."

"దివాకర్, మీరూ?"

"నాకూ తెలియదు సార్."

షిండే తన షర్టు జేబులో నుండి నిషా, విఠల్ ఫొటోలు తీసి మేజామీద పడేశాడు.

"సీ... ద... ఫొటోస్..."

రమణీ, దివాకర్‌లిద్దరూ ఆ ఫొటోలను చూసి అడ్డంగా తలాడించారు.

## 10



**ఆర్యా** ఆ చీకటిలో గుచ్చి గుచ్చి చూస్తూ లీలా మాత్రంగా కనిపిస్తున్న ఆ ఆకారాన్ని ఎవరో అంచనా వేయలేకపోతోంది.

'వస్తున్నది ఎవరు? .. వాల్ చందా? ... లేక నిషానా...? '

మెల్లగా ఆ ఆకారం దగ్గరగా వచ్చాక కానీ గుర్తించలేకపోయింది.

అది వాల్ చందే! కిటికీ సమీపానికి వచ్చాక అతని గొంతు వినబడింది.

"అమ్మా"

"ఏంటి వాల్ చంద్? "

"మీరు చెప్పిన ఆ అమ్మాయి నిషా కేజ్ రూమ్‌లో స్పృహలేకుండా పడుంది. వేసిన తాళం వేసినట్టే ఉంది" ఆర్యా అదిరిపడింది ఆ మాటలకు. 'అయితే డాక్టర్‌పై దాడి చేసింది ఇంకెవరు? '

"వాల్ చంద్..."

"అమ్మా..."

"టేబుల్ మీద ఓ అమ్మాయి ఉందా? "

"గుండు కొట్టిన అమ్మాయే కదా? "

"ఔను"

"ఆమె శవంలాగా పడుందమ్మా..."

"వాళ్ళిద్దరూ డాక్టర్‌పై దాడి చెయ్యలేదంటే మరి ఎవరు చేసుంటారు? "

ఆర్యా ఒళ్ళంతా భయం ఆవరించింది.

"అమ్మా... ఈ తాళాల గుత్తి టేబుల్ మీద కనిపించింది."

వాల్ చంద్ ఆ తాళాల గుత్తిని కిటికీ గుండా బయటికి చాపాడు. ఆర్యా దాన్ని అందుకుని చూసి చెప్పింది, "వాల్ చంద్ ఇది డాక్టర్ తాళాల గుత్తే. ఇందులోని పెద్ద తాళం చెవిని ఉపయోగించి గుమ్మం తలుపును తెరవచ్చు వెళ్ళి తియ్. నేనూ లోపలికి వచ్చేస్తాను..."

"సరేనమ్మా..."

మరో మూడు నిమిషాల్లో మెల్లగా తలుపు తెరుచుకోగా, ఆర్యా అదుర్దాగా లోపలికి దారితీసింది.

"ముందు డాక్టర్‌ను చూడాలి."

చీకటికి అలవాటుపడ్డ కళ్ళతో దేనికీ గుద్దుకోకుండా వేగంగా నడిచింది. క్రిందపడున్న చతుర్వేది దగ్గరకి వెళ్ళి మోకాళ్ళపై కూర్చుంది. చేత్తో శ్వాసను పరిశీలించి ఆయన ఛాతీపై చెవిని ఆనించింది.

గుండె బలహీనంగా కొట్టుకుంటోంది.

"డా... డాక్టర్..."

"............"

"డాక్టర్..."

వాల్ చంద్ ఒక అగ్గిపుల్ల వెలిగించి, ఆ వెలుగును డాక్టర్ ముఖానికి దగ్గరగా తీసుకు రావటంతో కనుబొమ్మలు సన్నగా కదిలినట్లనిపించింది.

"వాల్ చంద్... ఆ మగ్‌తో వాష్ బేసిన్‌లో నీళ్ళు పట్టుకురా..."

అతను పట్టుకొచ్చాడు.

ఆర్యా కుడి అరచేతిలోకి నీళ్ళు ఒంపుకొని డాక్టర్ ముఖంపై ఛెళ్ళుమని కొట్టింది.

దాంతో చతుర్వేది శరీరంలోకి ఒక్కసారిగా చలనం వచ్చినట్లయింది.

"డా..క్ట..ర్..."

"..........."

"డాక్టర్... నేను ఆర్యాను..."

"మ్... మ్..."

ఫట్ ఫట్ మంటూ ఆయన చెంపలపై చరిచి, మళ్ళీ నీళ్ళు ముఖంపై చల్లింది. చతుర్వేది కళ్ళు మెల్లగా తెరుచుకున్నాయి. వాల్ చంద్ మరో అగ్గిపుల్లను గీశాడు.

"మ్... మ్... మ్..."

"డాక్టర్... నేను ఆర్యాను."

చతుర్వేది పెదాలు మెల్లగా కదిలాయి. చెయ్యి మెల్లగా పైకి లేచింది...

"ఆ... ఆర్యా..."

"డా... డాక్టర్... మీకేమైంది? ఎవరు మీపై ఇలా దాడి చేశారు?"

చతుర్వేది కళ్ళు ఇప్పుడు పూర్తిగా తెరుచుకున్నాయి...

"ఆ...ఆ...ఆర్యా..."

"చె... చెప్పండి... డాక్టర్... మీ తలపై కొట్టి మిమ్మల్ని గాయపరిచింది ఎవరు?"

చతుర్వేది గట్టిగా శ్వాసపీల్చి వదులుతూ లేచి కూర్చున్నాడు "ఆర్యా... నువ్వు... జో... జోషి... ఇంటికి వెళ్ళొచ్చావా?"

"డాక్టర్... నా విషయం సరే. విఠల్ బాడీని జోషికి అప్పగించి వాల్ చంద్‌తో కలిసి వచ్చేశాను. ఇక్కడ మీ పరిస్థితే బాగా లేదు. బంగళాలోకి ప్రవేశించి మీపై దాడి చేసింది ఎవరు?"

చతుర్వేది తల అడ్డంగా ఊపి హీనస్వరంతో- "ఎ... ఎవరూ కారు..." అన్నాడు.

ఆర్యా ఆశ్చర్యానికి లోనైంది.

"ఏంటీ ఎవరూ కారా? అయితే తలపై ఇంత పెద్ద గాయమెలా అయింది డాక్టర్"

"అ... అదీ... నేను స్పృహ తప్పి క్రింద పడిపోతున్నప్పుడు చెక్కబీరువా తగిలి గాయమైనట్టుంది. రక్తం కారుతుండగానే అన్‌కాన్షియస్ స్టేజీకి వెళ్ళిపోయాను."

ఆర్యా ఆశ్చర్యం ద్విగుణీకృతమైంది.

"డాక్టర్! మీకెందుకు ఉన్నట్టుండి స్పృహ తప్పింది?"

చతుర్వేది శ్వాసను కంట్రోల్ చేస్తూ వాలిపోతున్న కళ్ళను పైకెత్తి ఆర్యాను చూశాడు.

"నువ్వు విఠల్ డెడ్‌బాడీని తీసుకెళ్ళగానే జీన్ మానిప్యులేషన్ కంటిన్యూ చెయ్యడం కోసం ల్యాబ్‌లోకి వెళ్ళాను. ఉన్నట్టుండి గుండెపోటు వచ్చింది. రాత్రి నుండే నాకు విపరీతమైన టెన్షన్. బి.పి. ఎక్కువ కావ డాన్ని కూడా పట్టించుకోకపోవటంతో మైల్డ్ హార్ట్ అటాక్ వచ్చినట్టుంది. నొప్పి ఎక్కువైంది... గబగబ బీరువాను తెరిచి మాత్రలు వేసుకున్నాను. శ్వాస కష్టమై తల తిరగడం అధికమవటంతో పడిపోయాను. బీరువా అంచు తలకు తగిలి రక్తం చివ్వున బయటికి రావటం వరకూ నాకు గుర్తుంది. ఆ పైన గుర్తులేదు. ఔను, నువ్వెలా లోపలికి వచ్చావు?"

> **కొత్తగాలి...**
>
> **ఐదేళ్లు**
> **నోట్లోకిపోతే చాలని సామాన్యుడు**
> **ఐదేళ్లూ**
> **సీట్లోనే ఉండాలని సామంతుడు**
>
> -ధరణికోట శివరాంప్రసాద్, హైదరాబాద్

ఆర్యా తేలిగ్గా నవ్వుతూ "అన్నీ తర్వాత చెబుతాను డాక్టర్, ముందు మీకు హార్ట్ పెయిన్ ఎలా ఉందో చెప్పండి?"

"మాత్ర మింగటం వల్ల నొప్పి తగ్గింది... కానీ బ్రీతింగ్ కష్టంగా ఉంది. అట్‌లీస్ట్ ఒక్కరోజైనా పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి. నన్ను నా గదికి తీసుకెళ్ళి పడుకోబెట్టి ఓ ఇంజెక్షన్ ఇచ్చేయ్ ఆర్యా..."

"డాక్టర్... మీ తలకు అయిన గాయం పెద్దదిగా ఉంది. హాస్పిటల్‌కు వెళదామా? ఓ రెండు రోజులు హాస్పిటల్లో విశ్రాంతి తీసుకున్నాక మనపని కంటిన్యూ చేద్దాం"

"వద్దు... ఇది మైల్డ్ అటాకే... ఒక కోర్స్ మాత్రలు వేసుకుని విశ్రాంతి తీసుకుంటే సరిపోతుంది. నేను విశ్రాంతి తీసుకుంటూ ఉండగానే నువ్వు జీన్ మానిప్యులేషన్ షెడ్యూల్‌ను చూడొచ్చు... రాగిణి రీసెర్చ్ షెడ్యూల్ సరైన ఫలితాన్ని ఇవ్వని పక్షంలో కొత్తగా వచ్చి చిక్కుకున్న నిషా తలను రేపు తెరవాలి..."

ఆర్యా నవ్వు ఇప్పుడు పెద్దదైంది.

"డాక్టర్... ఇవ్వాళ మిస్టర్ జోషి ద్వారా ఓ హెల్దీ మగ ఎలుక మనకు దొరికింది."

"మగ ఎలుకా?"

"ఊc... పేరు హరిహరన్! మద్రాస్ ఎలుక! ఏదో బిజినెస్ ప్రాబ్లెమ్ వల్ల మిస్టర్ జోషి వద్దకు తానుగా వచ్చి చిక్కుకుంది"

సోలిపోయిన చతుర్వేది కళ్ళల్లో సంతోష రేఖలు కనిపించాయి

"ఇప్పుడు ఆ ఎలుక ఎక్కడుంది?"

"మన కార్లో... వెనకసీటు క్రింద మత్తులో ఉంది. రేపు కళ్ళు తెరుస్తుంది"

తన బాధనంతా మరిచిపోయి హాయిగా నవ్వాడు డాక్టర్ చతుర్వేది.

"ఆర్యా... ఇంతవరకూ మన జీన్ ట్రాన్స్‌ఫర్ పరిశోధనకు ఉపయోగిస్తున్న అన్ని ఎలుకలూ ఆడ ఎలుకలే. పరిశోధనలో మనం ఆశించిన ఫలితం దక్కకపోవటానికి ఇది కూడా ఒక కారణం కావచ్చు. రేపు నిషా తలను తెరిచే బదులు హరిహరన్ తలను తెరిచి జీన్ ట్రాన్స్‌ఫర్‌కు కొత్తగా శ్రీకారం చుడదాం."

"మగ ఎలుకను చూస్తారా డాక్టర్?"

"పద.."

"వాల్‌చంద్, నువ్వెళ్ళి కాంపౌండ్ గేటు తెరిచి పెట్టు... వెనకే వస్తాను..."

అతడు తలాడించి బయటికెళ్ళి కాంపౌండ్ గేటును బార్లా తెరిచాడు. ఆర్యా అతడి వెనకే వెళ్ళి రోడ్‌మీద ఉన్న కారును లోపలికి తీసుకొచ్చి పోర్టికోలో ఆపింది. ఈలోపు వాల్‌చంద్ కాంపౌండ్ గేటు మూసి గబగబ వచ్చి కారు వెనకడోరు తీసి సీటుక్రింద ఓ హోల్డాల్‌లాగా పడి ఉన్న హరిహరన్‌ను బయటికి లాగాడు.

మొండికెయ్యకుండా వచ్చిన హరిహరన్‌ను అలాగే రెండు చేతులతో పసిబిడ్డలా ఎత్తుకుని లోపలికి తెచ్చాడు వాల్‌చంద్. ఆర్యా అతణ్ణి అనుసరించింది.

★ ★ ★

టెలిఫోన్ పక్కన దీనంగా కూర్చుని ఉన్న మాసిలామణి వద్దకు నీళ్ళు నిండిన కళ్ళతో గీతాంబరి తల్లి వచ్చింది.

"ముంబయి నుండి రమణీ, దివాకరూ ఏమైనా సమాచారం ఇచ్చారా?"

మాసిలామణి తల అడ్డంగా ఊపాడు.

పార్వతమ్మ బొంగురు కంఠంతో అంది, "గీతాంబరికి స్పృహ మాత్రమే లేకుండా ఉంది. నోరు మాత్రం కదులుతూ ఉంది 'మీ కొడుక్కు ఫోన్ చెయ్యండి మావయ్యా... నేను మాట్లాడాలి...' ఇదే వాక్యాన్ని జపిస్తోంది. ఒళ్ళంతా జ్వరంతో అగ్నిగుండంలా దహించేస్తోంది..."

బాధతో లేచి నిలబడ్డాడు మాసిలామణి.

"రెండు గంటలుగా ముంబయి నుండి ఏ సమాచారమూ రాలేదు. అంత పెద్ద ముంబయిలో రమణీ, దివాకరూ హరిహరన్‌ను ఎలా కనిపెడతారో అర్థం కావటం లేదు. కనిపెట్టినా హరిహరన్ ప్రాణాలతో ఉంటాడన్న నమ్మకమూ కలగటం లేదు"

"మీ నోటితో అలా అనకండి. మీ కొడుక్కి ఏమీ కాదు."

"మనల్ని మనమే ఇలా మోసం చేసుకుంటున్నాం. హరిహరన్ ప్రాణానికి ఏ ప్రమాదమూ లేకుంటే అతడు ప్రపంచంలో ఏ మూలనున్నా ఇప్పటికే ఫోన్‌చేసేవాడే"

పార్వతమ్మకు దుఃఖం పొంగుకొస్తుండగా ఓ నర్సు అక్కడికొచ్చి మాసిలామణితో అంది, "సార్... డాక్టరమ్మ మిమ్మల్ని

రమ్మంటున్నారు."

నిరాశగా వరండా చివరనున్న డాక్టరమ్మ గదిలోకి అడుగుపెట్టాడు మాసిలామణి.

మేజామీద తన రెండు చేతుల్నీ అనించి ఏదో దీర్ఘాలోచనలో ఉన్న డాక్టర్ మనోరంజితం మౌనంగా ఆయన్ను కూర్చోమని కుర్చీ చూపించింది. అతను కూర్చున్నాక అడిగింది, "ముంబయి నుండి ఏమైనా సమాచారం అందిందా? "

లేదన్నట్టు మాసిలామణి తలాడించాడు.

"ఇప్పుడేం చెయ్యబోతున్నారు? "

"అదే అర్థం కావటంలేదు డాక్టర్.."

"గీతాంబరిని కనీసం రెండు రోజులైనా సంతోషంగా ఉంచితే అంతే చాలు. ఆ తర్వాత ఆమెను గురించి దిగులు పడాల్సిన అవసరం ఉండదు. ఆమెను తాత్కాలికంగా సంతోషపెట్టడానికి రమణిని మళ్ళీ హరిహరన్‌లా మాట్లాడిస్తే ఎలా ఉంటుంది? "

"వీలుకాదు డాక్టర్"

"ఏం? "

"ఆమె కనిపెట్టేస్తుంది. హరిహరన్‌కూ, రమణికీ కంఠం ఒకేలా ఉన్నా మాట్లాడే తీరులో తేడా ఉంది. వదిన స్థానంలో ఉన్న గీతాంబరిని భార్యగా ఊహించి మాట్లాడ్డం అతని వల్ల కావడం లేదు."

"కోడలు ప్రాణంతో కావాలా, వద్దా? "

"కావాలి"

"అయితే రేపు ఉదయం ఎనిమిది గంటలకు ముంబయి నుండి రమణిని హరిహరన్ మాట్లాడినట్టు మాట్లాడమనండి."

డాక్టర్ అలా స్థిరంగా అంటుంటే మాసిలామణి ఆదుర్దాపడ్డాడు.

"గీతాంబరి కనిపెట్టేస్తుంది డాక్టర్."

"ముందు రమణిని మాట్లాడమనండి."

"రమణిని హరిహరన్‌లా మాట్లాడించటం ఇప్పుడున్న పరిస్థితుల్లో ఎంతో రిస్కైన పని డాక్టర్. ఇంతకు ముందు ముంబయి నుండి రమణి హరిహరన్‌లా మాట్లాడి ఉన్నాడు. అది సరిగ్గా వర్క్ అవుట్ కాలేదు. గీతాంబరికి ఆ మాటల్లో సంతోషం కలగలేదు. 'ముంబయి వెళ్ళగానే మనిషే మారిపోయారు. భార్యతో ఏదో మూడో మనిషిలా మాట్లాడుతున్నారే' అని గీతాంబరి నిష్ఠూరమాడింది. ఈ పరిస్థితుల్లో మళ్ళీ రమణిని హరిహరన్‌లా మాట్లాడించటం సరైన పనేనా డాక్టర్? "

మనోరంజితం పది క్షణాలు మౌనం వహించాక నోరు తెరిచింది, "ఇది రిస్కైన పనే.. ఒప్పుకుంటాను. ఈ రిస్క్‌ను మనం తీసుకోక తప్పదు. మీరు కంగారు పడకండి మిస్టర్ మాసిలామణి. అది రమణి గొంతు అని గీతాంబరి కనిపెట్టలేనంతగా నేను ఓ పనిచేయబోతున్నాను."

మాసిలామణి అయోమయంగా డాక్టర

## పొగడ్తా.. తెగడ్తా..

ప్రెస్సు బిల్లుపై చర్చలో పాల్గొంటూ ప్రముఖ నాయకుడు హెచ్.వి.కామత్ ఆవేశంగా రాజాజీని 'ఈయనో చాణక్యుడు' అన్నాడు.

రాజాజీ లేచి- 'చాణక్యుడంటే కౌటిల్యుడని.. అంటే నేను కుటిలుణ్ణనా? ' అన్నారు.



'చాణక్యుడు రాజనీతి దురంధరుడు. అది రాజాజీకి తెలియకపోవడం ఆశ్చర్యం' అని ప్రశంసిస్తూనే బదులిచ్చాడు కామత్. అయినా దాన్ని సహించని రాజాజీ- 'రాక్షసులు, దేవుళ్ళను విపరీత కోరికలు కోరుకోవాలనుకున్నప్పుడు సరస్వతి వాళ్ల నాలుకలమీద కూర్చుని లోకకళ్యాణం జరిగేలా పలికించేది. మొత్తంమీద మీరు నన్ను తిట్టాలనుకున్నా సరస్వతీదేవి మాత్రం మీచేత మంచి పేరే పలికించింది' అన్నారు. అప్పటికి అంతా నవ్వేసినా, రాజాజీకి అపరచాణుక్యుడనే పేరు స్థిరపడింది.

మ్మను చూశాడు.

ఆమె కొనసాగించింది. "గీతాంబరి పూర్తిగా స్పృహలో ఉంటేనే కదా గొంతు లోని తేడాను కనిపెడుతుంది? రేపు ఉదయం రమణి ఫోన్ చేసే సమయంలో గీతాంబరికి ఓ ఇంజెక్షన్ ఇచ్చి ఆమెను సెమి సెడెటివ్ స్టేజ్ లో ఉండేట్టు చేస్తాను. మాట్లాడుతున్నది తన భర్తేనన్న విషయం మాత్రం ఆమె మనసులో ఉంటుంది. గొంతులోని తేడానో, మాటల్లోని తేడానో గ్రహించే స్థితిలో ఉండదు. రమణిని బెరుకూ లేకుండా హరిహరన్‌లా క్యాజువ ల్ గా మాట్లాడమనండి.. చాలు...!"

"డాక్టర్... అదీ..."

"రమణి ముంబయి ఫోన్ నెంబరు ఇవ్వండి...నేను మాట్లాడుతాను."

మాసిలామణి ముంబయి సిల్వర్ శాండ్ హోటల్ ఫోన్ నెంబరూ, రమణీ, దివాక ర్‌లు బసచేసిన గది నెంబరూ చెప్పాడు. మనోరంజితం తన ప్రిస్క్రిప్షన్ ప్యాడ్‌లో నోట్ చేసుకుని మేజా చివరనున్న టెలిఫో న్‌ను దగ్గరకు లాక్కుంది.

★ ★ ★

హోటల్ సిల్వర్ శాండ్-

ఆరో అంతస్తు! రూమ్ నెం- 608. తెరిచి ఉన్న కిటికీకి బయట ముంబయి నగరం నియాన్‌లైట్లతో ధగధగా వెలిగిపోతోంది. రెండు రోజులుగా కురుస్తున్న వర్షం ఆగి ఆకాశం నిర్మలంగా ఉంది. నక్షత్రాలు మిను క్కు మినుక్కుమంటూ మెరుస్తున్నాయి.

రమణి ఆశ్చర్యపోతూ దివాకర్‌తో అన్నాడు "ఏంటీ హరిహరన్ ఉన్న చోటును నువ్వు ఊహించేశావా?"

"అవును"

"... ఎ.. ఎక్కడ?"

"మలబార్ హిల్స్‌లో సెవెన్త్‌క్రాస్ రోడ్లో ఎస్సై మల్హోత్రా ఎంతమందిని విచారణ చేశారు?"

"మొత్తం ఆరుగురిని.."

"ఎవరెవరో గుర్తున్నారా?"

రమణి గుర్తు చేసుకుంటూ వాళ్ల పేర్లను చెప్పాడు. సర్యాలాల్, దేశ్‌ముఖ్, మురళీ ధర్ పవార్, జోషీ, నారాయణ ప్రకాష్, శంకర్ టక్కాలే..."

దివాకర్ నవ్వాడు. "ఈ ఆరుగురిలో ఒక్కడే అసలు నేరస్థుడు"

"ఎవరతను?"

"మొట్టమొదట మనమెవరిని కలిశాం?"

"జోషిని"

"ఆయనే మోసగాడు"

"ఎలా అంటున్నావ్?"

"రమణీ! నాకు ఓ మనిషి కళ్ల కదలికల్ని అంచనా వేసే శక్తి ఉంది. ఎస్సై మల్హోత్రా, హరిహరన్ గురించి జోషిని అడగ్గానే ఆయన కళ్లలో ఓ మైక్రో సెకండ్ గ్యాప్‌లో చిన్న తేడాను గమనించాను. దాన్ని నువ్వు కానీ, మల్హోత్రా కానీ గమ నించే అవకాశమే లేదు. ఎందుకంటే మీ దృష్టి ఆయన పెదాలపై ఉంది. నేను ఆయన కళ్ళలోని తేడా పసిగట్టాను. తక్కిన ఐదుగురిని ఎస్సై విచారణ చేస్తున్నప్పుడు వాళ్ళ కళ్ళలో అలాంటిది కనిపించలేదు."

"దివాకర్... నువ్వంటున్నది నిజమా?"

"నిజమేనని నా అంచనా?"

"జోషిపై అనుమానాన్ని అప్పుడే ఎస్సైకు ఎందుకు చెప్పలేదు?"

"ఓ కారణముంది!"

"ఏంటా కారణం?"

"ఆ ఆరుగురినీ విచారణ పూర్తి చేసిన ఎస్సై స్టేషన్‌కు వచ్చాక ఒకమాట అన్నారు... గుర్తుందా రమణీ?"

"నాకున్న టెన్షన్‌లో నేను దాన్ని గుర్తుం చుకోలేదు. ఎస్సై ఏమన్నారు?"

"మలబార్ హిల్స్ ఏరియా మొత్తం గొప్ప గొప్ప ధనవంతులు ఉండే ప్రాంతం. ఎంక్వయిరీ అంటూ రెండోసారి అక్కడకు

వెళ్ళడానికి వీల్లేదు. వెళితే పరువు నష్టం దావా... అదీ ఇదీ అని పోలీసులనే కోర్టుకు లాగుతారు. సో... ఈ విషయంలో ఓపిక వహించి హరిహరన్‌ను కనిపెట్టేందుకు మరేదైనా మార్గాలున్నాయేమో ఆలోచించా లన్నారు. ఈ పరిస్థితుల్లో నేను జోషిని అనుమానిస్తున్నట్టు చెప్పినా, ఎస్సై దాన్ని పట్టించుకోరు. ఒకవేళ పట్టించుకున్నా ఏదో మొక్కుబడిగా చర్యలు తీసుకుంటారు. దాని వల్ల జోషి జాగ్రత్త పడతాడు... ఇది ఓ ఊహ మాత్రమే. జోషి కళ్ళలో కనిపించిన ఆ తేడానే నన్ను నమ్మమంటోంది."

"సరే, ఇప్పుడేం చేద్దామంటావు?"

"పోలీసులకు తెలియకుండా మనం వెంటనే ఓ పనిచెయ్యబోతున్నాం..."

"ఏం పని?"

"ఇప్పుడే మనం మలబార్ హిల్స్‌కు బయలుదేరి వెళుతున్నాం."

"వెళ్లి?"

"జోషి ఇంటి వెనకున్న గోడెక్కి దూకి లోపలికి వెళతాం. ఆ ఇంట్లోనే మనం రహస్యంగా దాక్కుని ఉంటే... జోషి కదలికలు ఏమిటో తెలుస్తాయి. హరిహరన్ గురించి ఆధారాలతో సహా క్లూలు దొరికితే, జోషి విషయం పోలీసులకు తెలియజేద్దాం."

రమణి ఎగతాళిగా నవ్వాడు. "ఇది జరిగే పనేనా దివాకర్?"

"ఎందుకు జరగదు?"

"మొదటికే మోసం వస్తే?"

"చేసేది సక్రమంగా చేస్తే ఏమీ కాదు. జోషీవద్ద కచ్చితంగా మోసం ఉంది"

"ఎందుకైనా మంచిది ఎస్సైతో చెప్పి"

"వద్దు రమణీ... కార్యం చెడిపోతుంది. పోలీసులు తమ అధికారాన్ని ఓ లెవల్ వరకు మాత్రమే ఉపయోగించగలరు. ధనవంతుల హద్దు సమీపించగానే పోలీసుల అధికారం ఎందుకూ కొరగాకుండా పోతుంది. హరిహరన్‌ను కనిపెట్టే ప్రయత్నాలను ఎస్సై ఇకపై గట్టిగా చెయ్యరు. మనమే ధైర్యంచేసి రంగంలోకి దిగాలి..."

"ఎందుకైనా మంచిది, ఇంకోసారి బాగా ఆలోచించి..."

"నేను బాగానే ఆలోచించాను రమణీ. ఇక ఎస్సైను నమ్ముకుని ప్రయోజనం లేదు. ఇవ్వాళే.. ఇప్పుడే... మనం మలబార్ హిల్స్‌కు వెళుతున్నాం. జోషి ఇంట్లోకి ప్రవేశించి నిజాలను కనిపెట్టబోతున్నాం..."

"నేనేమంటున్నానంటే..." రమణి ఇంకేదో చెప్పబోతుండగా టెలిఫోన్ గణగణ మంటూ మోగింది.

రమణి రిసీవర్‌ను తీశాడు. "ఎస్..."

రిసెప్షన్ నుండి మాట్లాడారు. "మిస్టర్ రమణీ! కాల్ ఫ్రమ్ చెన్నై... డాక్టర్ మనోరంజితం ఈజ్ ఆన్ ది లైన్..."

"ప్లీజ్. గివ్ ది లైన్..."

కొన్ని క్షణాల తర్వాత డాక్టర్ మనోరంజితం గొంతు వినిపించింది.

"మిస్టర్ రమణీ..."

"చెప్పండి డాక్టర్. రమణినే మాట్లాడుతున్నాను. వదినకు ఎలా ఉంది డాక్టర్?"

"గీతాంబరిని కాపాడడం ఇప్పుడు మీ చేతుల్లోనే ఉంది..."

"డా.. డాక్టర్... ఏమంటున్నారు?"

"రేపు ఉదయం ఏడుముప్పావు ఎనిమిది గంటల మధ్య... మీరు మీ వదినకు

## కొత్తగాలి...

**ఇంటిల్లిపాదికి**
**చాకిరీ చేసి అలసిపోతున్న**
**మా అమ్మని చూసి**
**నుదుటి మీది కుంకుమబొట్టు**
**బొట్లుబొట్లుగా ఏడుస్తోంది**

– భాస్కరభట్ల, హైదరాబాద్

ఫోన్‌చేసి హరిహరన్‌లాగా మాట్లాడాలి"

"డా.. డాక్టర్... అదీ.. అదీ..."

"నో సెంటిమెంట్స్ ప్లీజ్! మీ వదినతో ఆమె భర్తలా మాట్లాడటం వల్ల ఏ పవిత్రతా చెడిపోదు. సినిమాల్లో ఆడవాళ్ల మెళ్లో కట్టే తాళిలాంటిదే ఇదీనూ..."

"వదినను ఈ మారు మోసం చెయ్యడం సాధ్యం కాదు డాక్టర్..."

"ఆ విషయం నేను చూసుకుంటాను. గీతాంబరితో మీ అన్నయ్య ఎలా మాట్లాడేవాడో ఆ విధంగానే మీరు మాట్లాడాలి. మగబిడ్డ పుట్టాడన్న ఆనందాన్ని మీ మాటల్లో కుమ్మరించాలి. మీ ఆనందాన్ని చూసి గీతాంబరి సంతోషించాలి..."

"డా... డాక్టర్..."

"గీతాంబరి ప్రాణమిప్పుడు మీ చేతుల్లోనే ఉంది. 'సంతోషం' అన్న ఇంజెక్షన్ మందు ఆమె రక్తంలో కలిసితీరాలి."

"........"

"ఏం మౌనంగా ఉన్నారు?"

"సరే, డాక్టర్! ఫోన్ చేస్తాను."

"దట్స్ గుడ్! రేపు ఉదయం ఏడు ముప్పావు ఎనిమిది గంటలలోపు చేయండి... మీరు ఫోన్‌చేసే వేళ గీతాంబరి దాదాపు మత్తులో ఉంటుంది... అంచేత మీరు ఏ తడబాటూ లేకుండా హాయిగా మాట్లాడండి..."

"ఎస్.. డాక్టర్...."

"మర్చిపోకండి, ఫోన్ చెయ్యవలసిన సమయం... రేపు ఉదయం ఏడు ముప్పావు ఎనిమిదింటిలోపు..." అని డాక్టర్ ఫోన్ పెట్టేయగానే, రమణి రిసీవర్‌ను పెట్టేసి దివాకర్‌కు విషయమంతా చెప్పాడు. అతడు 'ప్చ్' అంటూ నిట్టూర్చాడు.

"జోషి ఇంటిని కనిపెట్టుకుని... కాస్త జాగ్రత్తగా నడుచుకుంటే... హరిహరన్‌ను మనం కనిపెట్టేయ్యవచ్చు..."

"వీలవుతుందంటావా?"

"హోటల్లో కూర్చుని మాట్లాడుతుంటే ఏదీ వీలు కాదు. బయలుదేరు... మలబార్ హిల్స్‌కు వెళదాం..."

రమణి లేచాడు. అతడి గుండె భయంతో కొట్టుకోసాగింది.

దివాకర్ గది తలుపుకు తాళం పెట్టాడు.

ఆ రాత్రి సమయంలో హోటల్‌ను వదిలి ఇద్దరూ బయటికొచ్చారు. ఖాళీగా వెళుతున్న ఓ టాక్సీని పిలిచాడు దివాకర్.

టాక్సీ ఆగింది. ఇద్దరూ ఎక్కారు.

డ్రైవర్ అడిగాడు, "కిదర్ జానేకా సాబ్"

"మలబార్ హిల్స్..."

అంతే! టాక్సీ రివ్వున ముందుకు దూసుకుపోసాగింది.




**అదే సమయంలో...** డాక్టర్ చతుర్వేది బంగళాలో ఆయనకెదురుగా కూర్చుని ఉన్నాడు జోషి.

"డాక్టర్... గుండెనొప్పి ఎలా ఉంది?"

"ఇవ్వాళ పగలంతా విశ్రాంతి తీసుకున్నందు వల్ల మామూలు స్థితికి వచ్చేశాను. నిన్న రాత్రి ఆర్యాకు తోడుగా వాల్‌చంద్‌ను పంపటం మీరు చేసిన ఒక మంచి పని."

"గత రెండురోజులుగా ఏది జరిగినా అది మనకు ప్రతికూలంగానే ఉంటోంది."

చతుర్వేది చిరునవ్వు నవ్వాడు. "మీ వైపు ఏ ప్రతికూలమైన సంఘటనా జరగలేదే? అయినా హరిహరన్ అనే ఎలుకను

ప్రాణంతో రీసెర్చికి ప్రెజెంట్ చేశారుగా? "

"ఆ ఎలుక విషయమే ఇప్పుడు ప్రతికూలంగా మారింది డాక్టర్? "

"ఏమంటున్నారు జోషీ...? "

"ఓ గంట క్రితం హరిహరన్ గురించి పోలీసులు మా ఇంటికొచ్చారు."

చతుర్వేది కనుబొమలు ముడుచుకున్నాయి. "హరిహరన్ మిమ్మల్నే కలవడానికి వచ్చాడని పోలీసులకు ఎలా తెలిసింది? "

"పోలీసులకు ఆ విషయం తెలియదు. హరిహరన్ సెవెన్త్ క్రాస్ రోడ్లో దిగి ఎవరి ఇంటికో వెళ్ళినట్టు టాక్సీడ్రైవర్ పోలీసులకు చెప్పినట్టున్నాడు. పోలీసులు ఆ ఇల్లును కనుక్కోవడం కోసం మా వీధిలో ఉన్న కొందరు ప్రముఖులైన బిజినెస్ మ్యాగ్నెట్లను విచారణ చెయ్యడానికి వచ్చారు. అలా మా ఇంటికీ వచ్చారు"

చతుర్వేది నవ్వాడు. "అంతేకదా! మీ మీద అనుమానంతో రాలేదు కదా? "

"అది ఓ రొటీన్ విచారణే డాక్టర్. హరిహరన్ గురించి ఆ ఎస్సై అడిగిన ప్రశ్నలకు నేను ఏ మాత్రం కంగారుపడకుండా సమాధానాలిచ్చాను. నా సమాధానాలను విన్న ఆ ఎస్సైకెక్కడా నా మీద ఏ అనుమానమూ కలగలేదు. కానీ..."

"ఊc.. కానీ...? "

"ఆ ఎస్సైతో పాటు రమణీ, దివాకర్ అన్న ఇద్దరు వ్యక్తులు కూడా వచ్చారు. వాళ్లలో దివాకర్ చూపులు అదోలా ఉన్నాయి. అతడు నన్ను సందేహించే లోపలే వాళ్ళిద్దరినీ లేపేయాలి."

చతుర్వేది నిట్టూరుస్తూ నిటారుగా కూర్చున్నాడు. మెల్లగా అడిగాడు. "వాళ్ళు ఎక్కడ బస చేశారన్నారు? "

"హోటల్ సిల్వర్ శాండ్. రూమ్ నెంబరు సిక్స్ నాట్ ఎయిట్."

"ఓకే! ఆ దివాకర్ నిజంగా మిమ్మల్ని అనుమానంగా చూశాడంటావా"

"ఊc.. చూశాడు"

"అతడి చూపులే ఆ విధంగా ఉంటే? "

"నో... డాక్టర్... అతడి చూపుల్ని నేను బాగా చదివాను. కచ్చితంగా అతడికి నా మీద అనుమానం కలిగి ఉంటుంది..."

"అతడు మిమ్మల్ని అనుమానించడానికి గల కారణం? "

"హరిహరన్ గురించి ఎస్సై ప్రశ్నిస్తున్నప్పుడు నేను మామూలు హావభావాలతోనే సమాధానాలిచ్చాను. కానీ నా మనసులోని ఉత్కంఠ తెలియకుండానే నా కళ్ళలో ప్రతిబింబించి ఉండొచ్చు. ఆ చర్యను అతడు తీక్షణంగా పసిగట్టి ఉండాలి..."

"ఎందుకైనా మంచిది. ఓసారి బాగా ఆలోచించుకుని వాళ్ళను సఫా చేసే పనిలోకి దిగటం ఉత్తమం మిస్టర్ జోషీ..."

"నేను బాగా ఆలోచించాను డాక్టర్. ఆ దివాకర్ మనసులో ఏర్పడ్డ అనుమానపు పోగులన్నీ ఓ బలమైన తాడుగా మారే లోపే ఆ ఇద్దర్నీ లేపెయ్యాలి"

"సరే... వాల్చంద్ను ఆ హోటల్కు పంపించి ఆ పనిని పూర్తి చెయ్యండి"

"వాల్చంద్ ఒక్కడి వల్ల ఆ పని అవుతుందని నేను అనుకోను డాక్టర్..."

"మరి? "

"ఆర్యాను కూడా పంపించాలి."

"దేనికీ? "

"హోటల్ సిల్వర్ శాండ్ మామూలు హోటల్ కాదు. ఫైవ్స్టార్ హోటల్. హోటల్లోపలికి వెళ్ళటానికే కొన్ని ఫార్మాలిటీస్ ఉంటాయి. అవన్నీ వాల్చంద్కు తెలియవు. తక్కినవాళ్ళ అనుమానపు చూపులకు వాల్చంద్ దొరక్కుండా ఉండాలంటే ఆర్యా అతడి పక్కన ఉండటం మంచిది."

"అయితే... ఓ పని చెయ్యండి జోషీ"

"ఏంటదీ? "

"ఇప్పుడు వాల్చంద్ ఎక్కడున్నాడు? "

"నా బంగళాలో..."

"మీరు వెంటనే బయలుదేరి వెళ్లి అతణ్ణి ఇక్కడికి పంపండి. ఆర్యాను అతడితోపాటు సిల్వర్‌శాండ్ హోటల్‌కు పంపించి ఆ పని పూర్తి చేయిస్తాను? "

"ఇది వెంటనే పూర్తిచెయ్యాల్సిన పని డాక్టర్. దివాకర్, రమణీ లిద్దరూ... ఎలా ఉంటారన్న ఆనవాళ్ళు వాల్‌చంద్‌కి చెప్పి పంపుతాను. ఆర్యాను తోడుగా పంపి పోలీసులు మనల్ని అనుమానించకుండా ఆ ఇద్దరినీ పైకి పంపేలా చెయ్యడం మీ వంతు".

"వెళ్ళి వాల్‌చంద్‌ను పంపండి... తక్కిన విషయాలను నేను చూసుకుంటాను..."

"ఆ ఇద్దర్నీ సఫా చేసేందుకు నా రివాల్వర్‌ను వాల్‌చంద్‌కిచ్చి పంపనా డాక్టర్? "

"వద్దు జోషీ! కత్తితోనో, తూటాతోనో అక్కడ పని కాదు? "

"మరి? "

"దివాకర్, రమణీ... ఇద్దరి ఒంటికేమీ కాకుండా, రక్తం చిందించకుండా ప్రాణాల్ని వదలబోతున్నారు".

"ఎలా డాక్టర్? "

చతుర్వేది పక్కనున్న అల్మైరా వద్దకు మెల్లగా నడిచివెళ్లి... దాన్ని తెరిచి ఒక బాటిల్ తెచ్చాడు. అందులో తెల్లని చిన్న చిన్న గుళికలున్నాయి.

"ఏమిటిది డాక్టర్? " జోషి అడిగాడు.

"సైనేడ్ నాఫ్తలిన్... ఇది క్రిమికీటకాలను చంపే నాఫ్తలిన్ కాదు. మనుషుల శ్వాసను నిరోధించి చంపే సైనేడ్ నాఫ్తలిన్. ఇందులో నుండి ఓ గుళికను తీసి గదిలో ఉన్న మంచం క్రింద పడేస్తే చాలు.. ఓ గంటలో ఇది గాల్లో కలిసిపోయి నిద్రిస్తున్న మనుషుల్ని నిశ్శబ్దంగా చంపేస్తుంది. పోస్టుమార్టంలో ఒంట్లో విషం పాకిన గుర్తులేవీ కూడా కనిపించవు".

"గుడ్ జాబ్..." జోషి మనస్ఫూర్తిగా అభినందించాడు.

★ ★ ★

మలబార్ హిల్స్ మొదట్లోనే టాక్సీని ఆపి, దిగారు రమణీ, దివాకర్ లిద్దరూ.

చుట్టూ నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. రోడ్డు కిరువైపులా పెరిగి ఉన్న చెట్లనుండి కీచు రాళ్ళ రొద వినిపిస్తోంది. ఆకాశంలో గుర్రం నాడాలా చంద్రబింబం దర్శనమిస్తోంది.

ఇద్దరూ జోషి బంగళా ఉన్న సెవెన్త్ క్రాస్ రోడ్డుకేసి నడిచారు.

"దివాకర్"

"ఊc..."

"ఇలా వెళ్ళటం నాకెందుకో మంచిది కాదనిపిస్తోంది".

"మళ్ళీ మొదలెట్టావా? "

"నేను భయపడుతున్నానని అనుకోకు. ధైర్యానికీ మేకపోతు గాంభీర్యానికీ ఎంతో తేడా ఉంది తెలుసా? "

"అంటే, దీన్ని తెలివిలేనితనమంటావా? "

"ఔను! ముందూ వెనకా ఎవరూ తెలియని ఈ ఊళ్ళో, పోలీసుల సాయం లేకుండా ఓ ప్రమాదకరమైన పనికి పూనుకోవటం మంచిది కాదు".

"రమణీ, భయమే సగం శత్రువు అని పెద్దవాళ్ళు చెప్పారు. ఏ పనికైనా సాహసంతో ముందుకెళితే విజయం తథ్యం. నువ్వు ఇంకేమీ మాట్లాడకుండా నాతో రా... తెల్లారేలోపు హరిహరన్‌ను నేను వెదికి పట్టుకుంటాను"

**కొత్తగాలి...**

**మనిషికి**
**మనసున్న చాలదు**
**అది వికసించి**
**లోకంలో పరిమళించాలి**

– డా. వాసా ప్రభావతి,
హైదరాబాద్

"ఇది సాధ్యమేనా దివాకర్..."

"నువ్వు ఇంకేమీ సణక్కుండా రా... నేను దాన్ని సాధ్యం చేసి చూపిస్తాను"

ఐదు నిమిషాల నడక అనంతరం సెవెన్త్ క్రాస్ రోడ్ చివరికొచ్చారు.

అంతటా నిశ్శబ్దం! దాదాపు అన్ని బంగళాల్లోని లైట్లూ ఆరిపోయి చీకట్లో సేద తీరుతున్నాయి.

రమణి అడిగాడు, "జోషి బంగళాలోకి ఎలా ప్రవేశించబోతున్నాం? "

"బంగళాలోకి వెళ్ళబోతున్నది నేను మాత్రమే, నువ్వు కాదు".

"మరి... నేను...? "

"నువ్వు బయటే ఓ మరుగు ప్రదేశంలో ఉండి బంగళాను కాపలా కాయి... ఎవరెవరు లోపలికెళుతున్నారు... ఎవరెవరు బయటికొస్తున్నారు... గమనించటం నీ పని. జోషి బంగళా వెనకున్న గోడెక్కి దూకి లోపలికెళ్ళి పరిస్థితిని అంచనా వేయటం నా పని"

"ఎందుకైనా మంచిది మళ్ళీ ఓసారి ఆలోచించి..." అంటున్న రమణిని దివాకర్ కోపంగా చూశాడు.

ఇంతలో రహదారి మలుపులో జోషి బంగళా కనిపించింది. బంగళా అంతా చీకటిగా ఉంది. పోర్టికోలో మాత్రం సన్నటి వెలుగు ప్రసరిస్తోంది. లోపలి నుండి ఏ శబ్దమూ రావటం లేదు.

దివాకర్ గొంతు తగ్గించి పిలిచాడు: "రమణీ..."

"ఊఁ..."

"బంగళాకు కాస్త పక్కగా ఓ ట్రాన్స్‌ఫార్మర్ కనిపిస్తోందా... దాని వెనకదాగి జోషి బంగళాను నువ్వు కాపలా కాయ్. ఏదైనా కారు లోపలికి వస్తేనో... బయటికి వెళితేనో... దాని నెంబర్‌ను నోట్ చెయ్యటం మర్చిపోవద్దు".

"ఆ విషయం నేను చూసుకుంటాను. బయట ఉండే నాకు ఏ ప్రమాదమూ లేదు. లోనికి వెళ్ళబోయే నువ్వే జాగ్రత్త"

"నా గురించి నువ్వేమీ దిగులు పడకు రమణీ. లోపలి పరిస్థితులు బాలేకపోతే నేను వెంటనే బయటికొచ్చేస్తాను".

రమణీ ట్రాన్స్‌ఫార్మర్ వైపుకు కదలగా, దివాకర్ బంగళా వెనకవైపుకు దారితీశాడు. ఆ చీకట్లో జాగ్రత్తగా నడిచివెళ్ళి ఐదడుగుల ఎత్తున్న కాంపౌండ్ గోడెక్కి కూర్చున్నాడు. చీకట్లో కాసేపటివరకూ అతడికేమీ కనిపించలేదు. ఆ తర్వాత ఒక్కొక్కటిగా లీలామాత్రంగా కనిపించసాగింది. ఆజ్‌బెస్టాస్ కప్పు కలిగిన ఓ షెల్టర్ పక్కన ఒక నీటి తొట్టె కనిపించింది.

దివాకర్ జాగ్రత్తగా కిందికి దూకాడు. దూకినవాడు అలాగే ఓ క్షణం కూర్చొని... చూపుల్ని అటు ఇటు తిప్పి మెల్లగా లేచి నిలబడ్డాడు. అక్కడ అతడికి పెరటి తలుపు కనిపించింది. నెట్టి చూశాడు. తెరుచుకోలేదు. ఎడమ పక్కకు నడిచి, మేడ మీదికి వెళ్ళే టాయిలెట్ పైప్ పట్టుకుని పైకి పాకసాగాడు. మేడమీదికి వెళ్ళి అక్కడ నుండి కిందికి వెళ్ళే మెట్లగుండా కిందికి దిగాడు.

హాలు కనిపించింది. జీరో వాట్ వెలుగులో హాలు లీలగా కనిపించసాగింది. దివాకర్ హాలు పక్కనే కాసేపు నిలబడి ఏ గదిలో నుండైనా మాటలు వినిపిస్తాయేమోనని చెవికి పని కల్పించాడు... నిశ్శబ్దం...

దివాకర్ ఓ నిర్ణయానికి వచ్చాడు... 'ఒక్కో గదిలోకి వెళ్ళి చూడాల్సిందే...' కదిలాడు. కుడి పక్కనున్న గదిలోకి వెళ్ళి జాగ్రత్తగా లోపలికి తొంగిచూశాడు. ఇంతలో అడుగుల శబ్దం వినిపించింది...

'ఏ పక్కనుండి? '

దివాకర్ ఆలోచిస్తుండగానే ఆ అడుగుల శబ్దం దగ్గరకు రాసాగింది. దాని వెంటే ఓ హిందీ పాట హమ్మింగ్ కూడా వస్తోంది.

'ఇటు వైపు నుండే ఎవరో వస్తున్నట్టు

న్నారు' దివాకర్ చప్పున ఆ గదిలోకి దూరి అక్కడ కనిపించిన మంచం కిందికి దొర్లి పడుకున్నాడు. శ్వాసను అదుపులో ఉంచుకుని వస్తున్నదెవరో గమనించసాగాడు.

వాల్ చంద్ ఆ గదిలోకి వచ్చాడు.

★ ★ ★

"మిస్టర్ మాసిలామణీ..." కిటికీ పక్కన నిలబడి బయట అలుముకుని ఉన్న చీకటిలోకి దృష్టిని సారించి... ఏవో ఆలోచనల్లో ఉన్న మాసిలామణి ఠక్కున వెనక్కు తిరిగి చూశాడు. డాక్టర్ మనోరంజితం నిలబడి ఉంది అక్కడ.

"ఏం డాక్టర్? " హీన స్వరంతో అడిగాడు.

"నేను ఇంటికి బయలుదేరుతున్నాను. ఇప్పుడు గీతాంబరి మంచి నిద్రలో ఉంది. రేపు ఉదయం ఎనిమిదింటి వరకూ ఏ సమస్యా ఉండదు. ఒక అసిస్టెంట్ డాక్టర్ డ్యూటీలో ఉన్నారు. అన్నీ చూసుకుంటారు.... అయినా నా సాయం అవసరమనుకుంటే నాకు ఫోన్ చెయ్యండి. నేను వెంటనే వచ్చేస్తాను..."

"అలాగే, డాక్టర్"

"బై... ద... బై... మీరు కూడా ఇంటికెళ్ళి విశ్రాంతి తీసుకుని రేపు రండి. లేడీస్ ఎవరైనా ఒకరు గీతాంబరి పక్కనుంటే చాలు. గీతాంబరి వాళ్ళమ్మను కావాలంటే ఇక్కడ ఉండమనండి."

"లేదు డాక్టర్... గీతాంబరికి ఏ ప్రమాదమూ లేదని స్పష్టమయ్యేంతవరకూ ఈ హాస్పిటల్ నుండి మేము వెళ్ళదలచుకోలేదు. తెల్లవారేంతవరకూ మేము ఇక్కడే ఉంటాం డాక్టర్."

మనోరంజితం చిన్నగా నిట్టూర్చింది. "ఇట్స్ ఓకే. రేపు ఉదయం కలుద్దాం" అంటూ డాక్టర్ కదిలి వెళ్ళిపోయింది.

మాసిలామణి మళ్ళీ తన చూపుల్ని చీకట్లోకి సారించాడు.

అతడి మనసులో... 'హరిలా రమణి మాట్లాడగలడా? గీతాంబరికి నిజం తెలిసిపోతే ఆమెకు సర్దిచెప్పటం సాధ్యమయ్యేపనేనా? దేవుడా! రేపు ఉదయం గీతాంబరితో రమణి ఫోన్‌లో మాట్లాడుతున్నప్పుడు ఏ ఇబ్బందీ రాకుండా చూడు తండ్రీ? '

"సార్..." అతి సమీపం నుండి ఎవరో పిలవటంతో వెనక్కు తిరిగి చూశాడు. అక్కడొక నర్సు నిలబడి ఉంది.

"ఏమ్మా? "

తన వెడల్పాటి కళ్ళను అటు ఇటు తిప్పి చూసి గొంతు తగ్గించి అంది, "సార్! మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి..."

నర్సు ముఖంలో కనిపిస్తున్న కలవరపాటును గ్రహించిన మాసిలామణి, "నువ్వు... నువ్వు ఏమంటున్నావమ్మా? గీతాంబరి ప్రాణానికి మళ్ళీ ఏమైనా ప్రమాదం జరగనుందా? " అని ఆత్రుతగా అడిగాడు.

"సార్... గీతాంబరి ప్రాణాల గురించో, పుట్టిన బిడ్డ ప్రాణాల గురించో ఇకపై భయపడాల్సిన పనేమీ లేదు... కానీ నేను చెప్పాలనుకున్న విషయం వేరే ఉంది..."

"ఏంటమ్మా.... నువ్వంటున్నది? "

"సార్.. మీ కుటుంబ విషయాల్లో జోక్యం చేసుకుంటున్నానని భావించకండి. కాసేపటి క్రితం హాస్పిటల్ వెనక చూసిన ఓ సంఘటననూ, విన్న మాటల్నీ మీతో చెప్పాలనుకుంటున్నాను. ఇది మీకు తప్ప మరెవరికీ తెలియకూడదు సార్..."

"చె..... చెప్పమ్మా.... ఏంటదీ? "

గొంతు తగ్గించి చెప్పడానికి ప్రయత్నించిన నర్సు, వరండా చివర తిలకమూ, పార్వతమ్మ రావడం చూసి వెనకాడింది.

"సార్... మీ భార్యా, గీతాంబరి వాళ్ళమ్మా వస్తున్నారు. మీరు వాళ్ళతో మాట్లాడి పంపేశాక స్టోరు రూమ్ వద్దకు రండి. నేను అక్కడ మీ కోసం ఎదురు చూస్తుంటాను" అని చెప్పి అక్కడ నుండి వేగంగా వెళ్ళిపోయింది నర్సు. ఆమెనే

చూస్తూ నిలబడ్డ మాసిలామణి వద్దకు వచ్చారు తిలకమూ, పార్వతమ్మానూ.

తిలకం "ఏమండీ?" అంది.

"ఊc..."

"ఆ నర్సు ఏం చెప్పింది మీకు? ఎందుకలా ఆమెనే చూస్తూ ఉండిపోయారు?"

మాసిలామణి స్పృహలోకొచ్చి- "అదీ.. అదీ.. ఏమీలేదు. తలనొప్పిగా ఉంటే ఏదైనా మాత్ర ఉంటే ఇవ్వమన్నాను. అందుకు ఆ నర్సు- 'డాక్టర్‌ను అడక్కుండా ఏవరికీ ఏ మాత్రా ఇవ్వడానికి వీల్లేదు' అంటూ వెళ్లిపోయింది. తలనొప్పి మాత్ర ఇవ్వడానికి కూడా డాక్టర్‌ను అడగాలట?"

"డాక్టర్ అలా చెప్పటం మంచిదే. కొందరికి కొన్ని మాత్రలు సరిపడవు..."

"సరే, మీరిద్దరూ గీతాంబరిని ఒంటరిగా వదిలిపెట్టి ఎందుకు బయటికొచ్చారు?"

"మన డ్రైవరు బయటేగా ఉన్నాడు?"

"అవునూ..."

"మీరు కారులో ఇంటికి వెళ్ళి రెండు తలగడలూ, ఒక దుప్పటీ పట్టుకు రండి. ఫ్లాస్కు కూడా కావాలి. అట్లే పార్వతమ్మగారింటికి వెళ్ళి ఇంటి వెనక తలుపు గడియ పెట్టి ఉందా లేదా చూసి రావాలి. ఆసుపత్రి తొందరలో వెనక తలుపు గడియ పెట్టటం మరిచిపోయినట్టున్నారు ఆమె!"

"వెళ్ళే దారే కదా... చూసొస్తాను..."

"తర్వాత..."

"చెప్పు తిలకం..."

"ఫ్లాస్కును శుభ్రంగా కడిగి టీనో, కాఫీనో పట్టుకురండి"

"తినడానికి ఏమైనా తీసుకురానా?"

పార్వతమ్మ అడ్డుపడి చెప్పింది. "ఇంకేమీ వద్దండి. గొంతు తడుపుకోవడానికి మాత్రం కాఫీనో టీనో ఏదో ఒకటి ఉంటే చాలు"

మాసిలామణి తలాడించి హాస్పిటల్ ముందు భాగంవైపు వెళుతున్నట్టు నటించి... వాళ్లు కనుమరుగయ్యాక స్టోర్ రూముకేసి వేగంగా నడిచాడు.

స్టోరు రూము వద్ద చీకటిగా ఉంది.

అక్కడ గోడకు ఆనుకుని ఇందాకటి నర్సు అతడి కోసం ఎదురుచూస్తోంది.

12



**మంచం** కింద నక్కి ఉన్న దివాకర్ ఎలాగోలా బయటికి చూడ్డానికి ప్రయత్నిం చాడు. అతడి కంటికి వాల్ చంద్ కనిపిం చాడు. 'ఎవరితను? పనివాడా? ... తొడు క్కున్న దుస్తుల్ని బట్టి చూస్తుంటే అలాగే అనిపిస్తోంది... ఇతణ్ణి ఈ గదిలోనే కొట్టి... బంధించి హరిహరన్ ఎక్కడున్నా డన్న నిజాన్ని తెలుసుకుందామా?' ఇలా దివాకర్ ఆలోచిస్తుండగానే...

బంగళా బయటినుండి కారు హారన్ శబ్దం వినిపించింది. అల్మైరాలో ఏదో వెదు కుతున్న వాల్ చంద్, కారు హారన్ వినగానే బయటికి పరుగు తీశాడు.

దివాకర్ మళ్లీ ఆలోచనలో పడ్డాడు. 'కారులో వస్తున్నది ఎవరు? జోషినా? ఇంకె వరైనానా?,' మంచం క్రింద నుండి దొర్లు కుంటూ బయటికొచ్చాడు. గదిలో నుండి తల బయటికి పెట్టి చూశాడు. అతడి దృష్టికి హాలూ, దాని వెనక పోర్టికో కనిపిం చాయి. కారు నుండి దిగి జోషి ఆదుర్దాగా లోపలికి వస్తున్నాడు.

అతడి వెనకే వాల్ చంద్ హిందీలో ఏదో మాట్లాడుతూ వస్తున్నాడు.

"నాకోసం ఎవరైనా వచ్చారా? "

"లేదు సాబ్"

"ఫోన్? "

"ఏదీ రాలేదు సాబ్? "

"సరే, లోపలికి రా... నీకు ఓ ముఖ్య మైన విషయం చెప్పాలి. తలుపు గడియపె ట్టిరా" అంటూ జోషి ఓ గదిలోకి వెళ్లాడు. వాల్ చంద్ తలుపు మూసి గడియ పెట్టి జోషి వెళ్లిన గదిలోకి వెళ్లాడు.

దివాకర్ ఆ గది పక్కనున్న గోడకు బల్లిలా అతుక్కుపోయాడు.

సంభాషణ చెవిలో పడింది.

"వాల్ చంద్, నువ్వు వెంటనే బయలుదేరి డాక్టర్ బంగళాకు వెళ్ళు. ఆర్యా నువ్వూ కలిసి చెయ్యవలసిన ముఖ్యమైన పనేమిటో డాక్టర్ చెబుతారు. ఆయన ఏం చెబుతారో దాన్ని పూర్తిచేసి వచ్చేయ్."

"సాబ్... ఆ విషయం ఏమిటో...? "

"నన్ను ప్రశ్నలడుగుతూ ఇక్కడే టైమ్ వేస్ట్ చెయ్యకు! వెంటనే డాక్టర్ బంగళాకు వెళ్ళు... ఏం చెయ్యాలో ఆయనే నీకు అర్థ మయ్యేలా చెబుతారు"

"సరే, సాబ్"

"డాక్టర్ దగ్గరికి టాక్సీలో వెళ్ళకు... కాస్త అటు ఇటు అయినా బస్సులోనే వెళ్ళు. లేకుంటే ఎలక్ట్రిక్ ట్రైన్‌లో వెళ్ళు."

కొన్ని క్షణాలు నిశ్శబ్దం. తర్వాత జోషి కంఠం వినిపించింది. "ఇదిగో రివాల్వర్!"

"ఇదెందుకు సాబ్? "

"ఆర్యా నువ్వు చెయ్యబోతున్న పని సాహ సంతో కూడుకున్నది. డాక్టర్ చెప్పే ప్లాన్ వర్క్ అవుట్ కాని పక్షంలో దీన్ని ఉపయో గించు. నీ వద్ద రివాల్వర్ ఉన్న విషయాన్ని

డాక్టర్‌తోనూ, ఆర్యాతోనూ చెప్పకు."

"సరే సాబ్."

"ఇక బయలుదేరు...."

దివాకర్ మెల్లగా వెనక్కు నడిచి, శబ్దం కాకుండా బంగళా వెనక భాగానికొచ్చి, అక్కడనుండి పైపుద్వారా కిందకు జారి బంగళా గోడ దూకాడు. ఆయాసపడుతూ పరుగు తీసి రమణి దాక్కుని ఉన్న ట్రాన్స్‌ఫార్మర్ వద్దకు వెళ్ళి పిలిచాడు. "రమణీ..."

చెట్ల మధ్య అతడి తల కనిపించింది.

"ఏం దివాకర్?"

"మనం అనుమానించింది కరక్టే."

"లోపల ఏం జరిగింది?"

"బంగళాలోకెళ్లిన కారును చూశావా?"

"చూశాను."

"లోపలికి వచ్చింది జోషి. ఆయన మామూలుగా లేడు. టెన్షన్‌లో ఉన్నాడు. బంగళాలో పనివాడు తప్ప మరెవరూ లేరు. జోషి లోపలికి వచ్చీరాగానే... ఎవరో ఒక డాక్టర్ బంగళాకు పనివాణ్ణి వెళ్ళమని చెప్పాడు. ఆర్యా అన్న అమ్మాయితో కలిసి ఏదో పని చెయ్యబోతున్నారు... అది ఏమిటో తెలియటం లేదు. పనివాడి చేతికి రివాల్వర్ కూడా ఇచ్చి పంపాడు జోషీ..."

"సో... ఎవరినో ఫినిష్ చెయ్యబోతున్నారన్నమాట!"

"అవును. అది హరి కూడా కావచ్చు"

"పోలీసులకు చెబుదామా?"

"వద్దు రమణీ... పోలీసులకు చెప్పడమంటే తేనెతుట్టెలోకి రాయి విసిరినట్టే."

"ఇప్పుడేం చేద్దామంటావ్?"

"నేను ఆ పనివాణ్ణి ఫాలో అవుతాను. ఆ డాక్టర్ బంగళా ఎక్కడుందో తెలుసుకుని, తర్వాత పోలీసులకు చెబుదాం"

"మరి నేనూ?"

"నువ్వు ఇక్కడే ఉండి జోషీ బంగళాను వాచ్ చేయ్?..."

"దివాకర్... నాకు భయంగా ఉంది."

"రమణీ, హరిహరన్ విషయంలో మనకు ఇప్పుడే గ్రిప్ దొరికింది. తెలివిగా ఉపయోగించుకోవడం మన బాధ్యత. అదిగో, ఆ పనివాడు బంగళా నుండి బయటికొచ్చాడు. నేను బయలుదేరుతున్నా. నువ్వు జోషీ బంగళాను క్షుణ్ణంగా గమనిస్తుండు. ఏ వాహనం లోపలికెళ్ళినా నెంబర్ నోట్ చేసుకో..."

"ఊc..."

దివాకర్ కదిలాడు.

"జాగ్రత్త దివాకర్"

"అలాగే"

వంద మీటర్ల దూరంలో వెళుతున్న వాల్‌చంద్‌ను వెంబడించసాగాడు దివాకర్.

★ ★ ★

**కొత్తగాలి...**

**వేసవిలో భూతాపానికి**
**తొలకరి చినుకు**
**వేదనలో మనస్తాపానికి**
**ఓదార్పు పలుకు**

– పినిశెట్టి లక్ష్మీశారద, రాజమండ్రి

జోషి కాలుగాలిన పిల్లిలా అటు ఇటు పచార్లు చేయడం మొదలు పెట్టాడు. 'డాక్టర్ చెప్పినట్టు వాల్‌చందూ, ఆర్యా ఆ పని పూర్తి చెయ్యగలరా? ఆర్యా తెలివైంది.. ఏ పనైనా పూర్తి చేయగల సమర్థురాలు'

అతడలా ఆలోచిస్తుండగా కిటికీ పక్కనున్న ఫోన్ మోగింది. గబగబ వెళ్ళి రిసీవర్‌ను అందుకొని "హలో" అన్నాడు. అటు వైపు నుండి డాక్టర్ చతుర్వేది మాట్లాడాడు.

"ఏం, వాల్‌చంద్‌ను ఇక్కడికి పంపారా?"

"ఇంకాసేపట్లో అక్కడికి చేరుకుంటాడు."



"టాక్సీలో వద్దని చెప్పారా?"

"చెప్పాను."

"సరే, ఆర్యా ఇక్కడ తయారుగా ఉంది. వాల్‌చంద్ రాగానే ఫోన్ చేస్తా" అని డాక్టర్ ఫోన్ పెట్టేయగానే, జోషి కూడా రిసీవర్ పెట్టి పైకి లేవబోయాడు. లేస్తూండగా అతని దృష్టి ఓ చోట ఆగిపోయింది.

రోడ్డుమీద వెళుతున్న ఏదో వాహనం హెడ్‌లైట్ వెలుగు ట్రాన్స్‌ఫార్మర్ మీద పడి... అక్కడి గుబురు మొక్కల వెనక కూర్చుని తొంగితొంగి చూస్తున్న రమణి అతడికి స్పష్టంగా కనిపించాడు.

ట్రాన్స్‌ఫార్మర్‌కు వెనక నక్కి ఉన్న రమణి- తన డేగకళ్ళతో జోషి బంగళాను గమనిస్తున్నాడు.

జోషి బంగళాలోని కిటికీల వద్ద వెలుగుతున్న ట్యూబ్‌లైట్లు టక్కున ఆరిపోవటంతో, రమణి మనసులో ఏదో కొత్త భయం చోటు చేసుకుంది.

'ఒకవేళ జోషీ ఉన్నఫళంగా కార్లో బయలుదేరి వెళితే అతణ్ణి ఎలా వెంబడించాలి?' రమణి ఆలోచిస్తుండగానే, అతడి వెనక ఏదో శబ్దం వినిపించింది.

'ఏమిటా శబ్దం?' చెవులు రిక్కించి విన్నాడు. అర్థమైంది. అది ఎవరిదో అడుగుల చప్పుడు...

'వస్తున్నదెవరు?' రమణి వెనక్కు తిరిగి చూసిన అదే క్షణాన, అతడి తలపై పిడుగులాంటి దెబ్బ పడటంతో అలాగే పక్కకు పడిపోయాడు.

★ ★ ★

అసిస్టెంట్ పోలీస్ కమీషనరు ఎదుట నిలబడి ఉన్నారు- ఎస్సై మల్హోత్రా, కుర్లా



పోలీస్ ఇన్‌స్పెక్టర్ షిండే.

మల్హోత్రా వైపుకు తిరిగాడు ఎసిపి. "హరిహరన్‌ను ట్రేస్ అవుట్ చేయడానికి ఏదైనా క్లూ దొరికిందా? "

"నో సార్..."

"ఎవరినైనా సస్పెక్ట్ చేస్తున్నారా? "

"ఇంకా లేదు సార్!"

"అసలు ప్రోగ్రెస్ ఏంటి? "

"సారి టు సే దిస్ సార్... ఏదో ఓ నకిలీ ప్రాడెక్ట్ విషయంగా మలబార్ హిల్స్ లోని ఓ బిజినెస్ మ్యాగ్నెట్‌ను హెచ్చరించడానికి వెళ్ళాడు హరిహరన్. వెళ్ళినచోట ఏదైనా ప్రమాదం జరిగి ఉండొచ్చు. మలబార్ హిల్స్ ఏరియాలో విచారణ చేయగా ఏ చిన్న క్లూ కూడా లభించలేదు. ఒకవేళ క్లూ లభించినా ధన బలమూ, రాజకీయ బలమూ కలిగిన ఆ వ్యాపారవేత్తల ముందు మన పోలీసుల బలం ఎందుకూ పనికిరాదు. హరిహరన్ ప్రాణంతో ఉండటానికి అవకాశమే లేదు. కేసును విచారణ చేస్తున్నట్లు వారం పదిరోజులు నటించి ఫైల్‌ను క్లోజ్ చేయటం బెటర్..."

ఎసిపి కళ్ళు మూసుకుని కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయి షిండేతో అన్నారు, "మీ విచారణ ఎంతవరకూ వచ్చింది? "

"సార్, ఈ విచారణను అశ్రద్ధ చెయ్యడానికి వీల్లేదు. కనిపించకుండా పోయింది ఓ యువతీ, ఓ యువకుడూనూ. ఆమె సామాన్యమైన స్త్రీ కాదు. పత్రికా రంగం యువతి. విచారణను సక్రమంగా చెయ్యకపోతే... పత్రికలు ఊరుకోవు. ఇంకో రెండు రోజుల్లో మనం ఏదో ఒకటి చేసేతీరాలి."

"నిషా నివాస ప్రాంతంలో విచారణ

చేశారా? "

"చేశాం సార్! కాలేజీలో చదువుతున్న మోనికా అన్న అమ్మాయితో కలిసి వాల్స్‌రోడ్‌లో ఓ ఇంటిని అద్దెకు తీసుకుని ఉంటోంది నిషా. ఆ మోనికాను విచారణ చేసినా ఏ ప్రయోజనమూ కలగలేదు. నిషా ఎప్పుడు బయటికెళుతుందో, ఎప్పుడొస్తుందో తెలియదట. వెళుతున్నప్పుడు ఎక్కడికెళుతుందో చెప్పే అలవాటు లేదట..."

"ఓ పత్రికా విలేఖరికి తన ఎంగేజ్‌మెంట్స్ అన్నీ డైరీలో రాసిపెట్టుకునే అలవాటు ఉంటుంది. అలాంటిది ఏదైనా డైరీ లభించిందా? "

"నిషా టేబుల్ సొరుగులో ఓ డైరీ దొరికింది సార్. అందులో ఏ ఎంగేజ్‌మెంట్స్ వివరాలూ లేవు. కొన్ని వ్యాసాలకు సంబంధించిన ముఖ్యమైన పాయింట్స్ నోట్ చేసి ఉన్నాయి..."

"సరే.. వాట్ అబౌట్ విఠల్? "

"నిషా ఇంటికి ఎదురిల్లే విఠల్‌ది. విఠల్‌కు తల్లిదండ్రులెవరూ లేరు. మావయ్య ఉన్నాడు. విఠల్ ఎక్కడికి వెళ్ళి ఉంటాడో ఆయన చెప్పలేకపోతున్నాడు. విఠల్ స్నేహితులు కొందరిని విచారణ చేస్తున్నాను. అందులో ఒక ఫ్రెండ్ చెప్పిన విషయం కొంత యూజ్‌ఫుల్‌గా ఉంది"

"ఏంటా విషయం? "

"నిషాను విఠల్ ప్రేమిస్తున్నాడు. బట్...అది వన్ సైడ్ ప్రేమే. నిషా ఇంటి నుండి ఎప్పుడు బయలుదేరినా అతడూ ఫాలో అయ్యి వెళ్ళేవాడట...."

ఏసిపి నిటారుగా నిలబడ్డాడు.

"ఇంత వ్యవహారమూ ఉందా? "

"నిన్న సాయంత్రం నిషా బయలుదేరగానే విఠల్ ఫాలో అయి వెళ్ళుండాలి."

"నిషా ఎక్కడికి వెళ్ళిందో తెలిస్తే అంతా ఓ కొలిక్కి వస్తుంది కదూ? "

"ఔను సార్."

"ఇకపై ఏంచేయబోతున్నారు? "

"విఠల్ ఫ్రెండ్స్ సర్కిల్ కాస్త పెద్దదే సార్. ఎస్సై రాజేష్ శ్యామ్‌ను విచారణ చేసి రమ్మని పంపాను."

"హరిహరన్ కనిపించకుండా పోయిన విషయాన్ని అశ్రద్ధ చేసినట్టు ఈ ప్రెస్ రిపోర్టర్ అమ్మాయి విషయాన్ని ఇగ్నోర్ చెయ్యడానికి వీల్లేదు మిష్టర్ షిండే. మిగతా కేసుల్ని పక్కన పెట్టి దీనిపై ధ్యాస పెట్టండి. వ్యవహారం పెద్దదైతే, పై అధికారుల టెన్షన్‌ను తట్టుకోలేం. ఎలాగైనా దీన్ని ఓ కొలిక్కి తీసుకురావాల్సిందే."

"ఎస్ సార్..." అంటూ అక్కణ్ణించి కదిలాడు షిండే.

★ ★ ★

కుర్చీకి కట్టి వేయబడ్డ హరిహరన్‌కు ఆ ప్రదేశాన్ని చూసేకొద్దీ కడుపులో దేవుతోంది. ఆదుర్దాతో అతడు డాక్టర్ చతుర్వేదిని చూడ్డంతో ఆయన చిరునవ్వు చిందిస్తూ ముందుకు వంగాడు.

"ఏంటలా చూస్తున్నావ్... ఓ గొప్ప పరిశోధన కోసం నిన్ను ఇక్కడికి తీసుకొచ్చాం.. నీ దేహంలోని పిట్యూటరీ గ్రంథిని వాడుకోబోతున్నాం. ఇలాంటి ఓ పరిశోధన కోసం అర్పించుకునే అదృష్టం ఈ ప్రపంచంలో ఎందరికి లభిస్తుంది చెప్పు."

"నో... నో... నో..." హిస్టీరియా వచ్చినవాడిలా గట్టిగా అరవాలనుకున్నా అతనికిచ్చిన మత్తు ఇంజెక్షన్ ఫలితంగా మాటలు బలహీనంగా బయటికి వచ్చాయ్.

చతుర్వేది కొనసాగించాడు. "నిన్నూ, ఈ విలేఖరి నిషానూ ఇక్కడికి పంపినందుకు ఆ దేవుడికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఇది నా పరిశోధన చివరి ఘట్టం. ఆరోగ్యంగా ఉన్న మీ ఇద్దరి డి.ఎన్.ఏ.లు నా జీన్ ట్రాన్స్‌ఫర్ పరిశోధనకు అన్ని విధాలా సరిపోతాయనుకుంటున్నా"

చతుర్వేది మాటలు పూర్తి కావస్తుం

డగా... చక్రాలున్న స్ట్రెచర్‌ను లోపలి నుండి తోసుకొచ్చింది ఆర్యా.

ఆ స్ట్రెచర్ మీద బోర్లా పడుకున్న నిషా కనిపించింది. తల నున్నగా గీసి ఉంది. ఆ తల తోలు తీసేసిన బొప్పాయి పండులా ఉంది. కనురెప్పలు మూసుకుని ఉన్నాయి. నోరు తెరుచుకుని ఉంది.

హరిహరన్ భయంభయంగా చూశాడు. అతడి గుండె వేగంగా కొట్టుకోసాగింది.

ఆర్యా అతణ్ణి చూసి కన్ను గీటింది. "మిస్టర్ హరీ, ఓ గంటలో మీకూ ఇదే గతి! గుండు గీస్తే మీరింకా అందంగా ఉంటారు.."

చతుర్వేది నవ్వుతూ ఉండగానే బయట ఎవరో కాలింగ్ బెల్ నొక్కారు.

ఆర్యా గబగబ అంది, "డాక్టర్, వాల్ చంద్ వచ్చినట్టున్నాడు."

"డోర్ వ్యూ- ఫైండర్‌లో చూసి తలుపు తెరువు."

ఆర్యా వెళ్ళి చూసింది. బయట వాల్ చంద్ నిలబడి ఉన్నాడు.

తలుపుతీసి, "రా... వాల్ చంద్... ఎందు కింత ఆలస్యం?" అంది.

వాల్ చంద్ బదులివ్వకుండా లోపలికి అడుగు పెట్టగానే... అతడి వీపుకు రివాల్వర్ ఆనించి నిలబడున్న వ్యక్తిని చూసి అదిరిపడింది. గట్టిగా అరవడానికి ప్రయత్నించిన ఆర్యా వైపుకు రివాల్వర్ తిప్పడంతో ఆమె నోరు మూతబడింది.

"ఊc... మాట్లాడకుండా నడువ్". దివాకర్ ఆమెను చేత్తో ముందుకు తోశాడు.

"నీ వాల్ చంద్ అరగంట నుండి నా కస్టడీలోనే ఉన్నాడు. ప్రాణాలకు ముప్పు అని తెలియగానే విశ్వాసం అంతా మటుమాయమైపోయింది" దివాకర్ చేతిలోని రివాల్వర్ ఇద్దరి వైపూ మార్చి చూడసాగింది.

ల్యాబొరేటరీ సమీపించింది. నిషా గుండు తలకు హెల్మెట్‌లా దేన్నో తగిలించే ప్రయత్నంలో ఉన్న చతుర్వేది... వాల్ చంద్‌ను చూసి నవ్వాలనుకునేంతలోనే ముఖం నల్లగా మాడిపోయింది.

దివాకర్ నవ్వాడు. "నమస్తే డాక్టర్‌గారు! ఈ రాత్రి సమయంలో వచ్చి మీకు ఇబ్బంది కలిగిస్తున్నందుకు క్షమించాలి..."

"ను... నువ్వు... నువ్వు..."

"నా పేరు దివాకర్. మీరు ఏదో పరిశోధన చేస్తున్నారటగా... వాల్ చంద్ చెప్పాడు. దాని గురించి కాస్త తెలుసుకుందామని వచ్చాను."

హరిహరన్ ఆత్రుతగా దివాకర్‌ను చూడసాగాడు. వాళ్ళ ముగ్గురికీ రివాల్వర్ చూపిస్తూ గోడ పక్కగా మోకాళ్ళపై కూర్చోపెట్టాడు.

హరిహరన్ ఆనందంగా హీన స్వరంతో అన్నాడు, "ది... దివాకర్ మంచి సమయానికి వచ్చి న... నన్ను కాపాడావ్..."

దివాకర్ పెదాలపై ఓ క్రూరమైన నవ్వును పులుముకుంటూ హరిహరన్ వైపుకు తిరిగాడు. "సారీ, హరీ! నేను నిన్ను కాపాడ్డానికి రాలేదు. ఈ రివాల్వర్‌లో ఉన్న ఆరు తూటాల్లో ఏదో ఒక తూటాకు నువ్వు కూడా బలి కాబోతున్నావ్. నువ్వు చెన్నైలో ఉండగానే రెండు సార్లు నీ ప్రాణానికి గురి పెట్టాను. తప్పించుకున్నావ్... కానీ ఇక్కడ తప్పించుకోలేవు".

## కొత్తగాలి...

**పెదవి ద్వారా**
**మాటలు**
**పదవి ద్వారా**
**మూటలు**

– సువారపు రామచంద్రరావు,
తిరువూరు

"ది... ది... దివాకర్..."

హరిహరన్ కళ్ళు విప్పార్చుకుని చూస్తూ ఉండిపోయాడు.

దివాకర్ కొనసాగించాడు, "వీళ్ళతో కలిసి నువ్వు మాత్రమే చావబోవటం లేదు, నీ తమ్ముడు రమణి కూడా..."

★ ★ ★

మాసిలామణి ఆ నర్సును చూశాడు. ఆశ్చర్యంగా వణుకుతున్న కంఠంతో అన్నాడు, "ఏంటమ్మా నువ్వంటున్నది? ముంబయిలో నాకు తెలియకుండా కుట్ర జరుగుతోందా?"

"ఔను సార్. కాసేపటిక్రితం ఆసుపత్రి వెనక ఉన్న టాయిలెట్‌కు వెళ్లినప్పుడు... ఓ చెట్టు క్రింద మీ వియ్యపురాలు లుంగీ కట్టుకున్న ఓ వ్యక్తితో గుసగుసలాడటం కనిపించింది. అనుమానం వచ్చి చాటుగా నిలబడి వాళ్ల మాటలు విన్నాను"

"ఏ... ఏం... మాట్లాడుకున్నారు?"

"ఇందాకే ముంబయి నుండి దివాకర్ ఫోన్ చేశాడు. చెన్నైలో ఉండి చెయ్యావలసిన పనుల్ని ముంబయిలోనే పూర్తి చేసుకుని వస్తాడట. ఇక్కడ... మాసిలామణికీ, మిగతావాళ్ళకూ అనుమానం రాకుండా మిమ్మల్ని నడుచుకోమన్నాడు- అని ఆ లుంగీ కట్టుకున్న వ్యక్తి మీ వియ్యపురాలితో అన్నాడు"

"త... తర్వాత?"

"మీ వియ్యపురాలు అటు ఇటు బెదురు చూపులు చూస్తూ 'సరే, నువ్వెళ్లి తర్వాత రా... ఇప్పుడేమీ మాట్లాడొద్దు' అని అతణ్ణి పంపేసింది. అతడు వెళ్ళిపోయాడు"

"ఇంతేనా వాళ్ళు మాట్లాడుకుంది?"

"ఔను సార్!"

మాసిలామణి తన గడ్డాన్ని నిమురుకుంటూ విచారంగా నిలబడ్డాడు.

"సార్ నాకెందుకో వాళ్ళిద్దరూ మాట్లాడుకున్న విషయం అనుమానం కలిగించడంతో... దాన్ని మీకు చెప్పాను"

"నువ్వు ఇప్పుడొచ్చి ఈ విషయం చెప్పటం ఎంతో మంచిదయిందమ్మా... నిన్ను నా సొంత కుతురిలా భావించి నీకూ ఓ నిజాన్ని చెప్పబోతున్నాను. దాన్ని అర్థం చేసుకుని నాకు సాయం చెయ్యాలి"

"చెప్పండి సార్... నాకు చేతనైనంత సాయం చేస్తాను"

మాసిలామణి అటు ఇటు ఓ సారి చూసి గొంతు తగ్గించి నర్సుతో అన్నాడు, "ఆ పార్వతమ్మ గీతాంబరి కన్నతల్లి కాదు..."

నర్సు ఆ మాటలకు షాక్ తింది. "సా... సార్... మీరేమంటున్నారు?"

"అవునమ్మా... గీతాంబరికి ఐదేళ్ళ వయసున్నప్పుడు ఆమె తల్లిదండ్రులిద్దరూ ఓ రోడ్డు యాక్సిడెంట్‌లో చనిపోయారు. అప్పుడు వాళ్ళు కర్నాటక రాష్ట్రం షిమోగాలో ఉండేవాళ్ళు. తల్లిదండ్రుల్ని పోగొట్టుకుని అనాథలా మిగిలిన పసిబిడ్డ గీతాంబరిని పక్కింటి పార్వతమ్మ చేరదీసి పెంచింది. పిన్నవయసులోనే భర్తను పోగొట్టుకున్న పార్వతమ్మకు దివాకర్ ఒక్కడే కొడుకు. పార్వతమ్మను తన తల్లిలా, దివాకర్‌ను అన్నగానూ భావించి తనను పెంచి పెద్ద చేసిన వాళ్లపై ఎంతో అభిమానాన్ని పెంచుకుంది గీతాంబరి. మా కంపెనీ రిసెప్షనిస్టు ఉద్యోగం కోసం జరిపిన ఇంటర్వ్యూలో

## కొత్తగాలి... 

**జీవిత పుస్తకాన్ని**
**తెరిస్తే జననం**
**మూస్తే మరణం**

*– కె.వెంకటేశ్ చౌదరి,*
*హైదరాబాద్*

సెలెక్ట్ అయిన గీతాంబరి అంటే హరిహర న్‌కు అభిమానం కలగటంతో వెంటనే శిమోగ్గా నుండి పార్వతమ్మనూ దివాకర్‌నూ పిలిపించి గీతాంబరికీ, హరిహరన్‌కూ పెళ్ళి చేయాలనుకుంటున్నట్టు చెప్పాం. 'గీతాంబరి తన కన్నకూతురు కాదన్న' విషయాన్ని ఆనాడే పార్వతమ్మ మాకు చెప్పేసింది. అమ్మాయి లక్షణంగా, సంసారపక్షంగా ఉండటంతో... ఆ విషయాన్ని మేమూ పట్టించుకోలేదు. పెళ్లి చాలా గ్రాండ్‌గా చేశాం".

"గీతాంబరికి ఇవన్నీ తెలుసా? "

"తెలుసు..." అని అతను కాస్త గొంతు తగ్గించి, "గత కొద్ది రోజులుగా గీతాంబరి పక్కవీధిలో ఉన్న పార్వతమ్మ ఇంటికి వెళ్ళటంలేదు. దివాకర్ మా ఇంటికి వచ్చినా మనసు విప్పి మాట్లాడటం లేదు. నేను కారణమేమిటని అడిగితే- 'వాళ్ళు మునుపటిలా లేరు మావయ్యా... మాటతీరంతా అదోలా ఉంటోంది' అని చెప్పింది. గీతాంబరి ఆ రోజు ఎందుకలా చెప్పిందో ఇప్పుడు అర్థమవుతోంది. తల్లీ కొడుకులిద్దరూ మనసులో ఏదో పెట్టుకున్నట్టుంది. అదేంటో కనిపెట్టాలి. ఆమెను డైరెక్టుగా అడగలేం. కనుక నువ్వొక పని చెయ్యాలి..."

"చెప్పండి సార్... ఏం చెయ్యాలి? "

"నువ్వు ఈ రాత్రంతా ఆసుపత్రిలో ఉన్న పార్వతమ్మను వాచ్ చేస్తుండాలి. ఆ లుంగీ వ్యక్తి మళ్ళీ పార్వతమ్మతో మాట్లాడటానికి రావచ్చు. ఆ సమయంలో వాళ్లేం మాట్లాడుకుంటారో విని నాకు చెప్పాలి".

"ఓకే సార్"

"నేను ఇంటికి వెళ్లి, అక్కడనుండి ఫోన్ ద్వారా ముంబయిలో ఉన్న రమణికి ఈ విషయాన్ని చెబుతాను".

"సార్... ఈ విషయాన్ని నేను చెప్పినట్టు మీరు ఎవరికీ చెప్పకండి సార్? "

"ఆ భయం నీకొద్దమ్మా. ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో నాకు తెలుసు. నువ్వు పార్వతమ్మను వెయ్యి కళ్ళతో గమనించు. నేను ఇంటికి వెళ్ళి ఓ గంటలో తిరిగొచ్చేస్తాను..."

ఆ నర్సు తలాడించి ముందుకు నడిచింది. మాసిలామణి హాస్పిటల్ బయటున్న తన కారుకేసి దారి తీశాడు.

13



**దివాకర్** తన చేతిలోని రివాల్వర్‌తో హరిహరన్ ముందుకు వంగి నవ్వాడు.

"ఏం హరీ, అలాగే బిగుసుకుపోయావ్? ఇలాంటి ఒక అపురూపమైన అవకాశం కోసమే గత ఆరు నెలలుగా నేను ఎదురు చూస్తున్నాను. చెన్నైలోనే నిన్నూ, నీ తమ్ముణ్ణీ నా మనుషులతో ఫినిష్ చేయించాలని రెండుసార్లు ప్రయత్నించా. కానీ కుదరలేదు..."

హరిహరన్ కళ్ళల్లో భీతి..

దివాకర్ తన చేతిలోని రివాల్వర్‌తో అతడి నుదుటిమీద గీత గీశాడు.

"డబ్బు కోసమా ఇంతటి ఘోరానికి పాల్పడుతున్నావ్? అని నువ్వు అడగొచ్చు. మరో దారి లేదు హరిహరన్? ఎన్నో బిజినెస్‌లు చేశాను. ఏదీ కలిసి రాలేదు... ఊరంతా అప్పులు... గీతాంబరిని రెండు మూడు సార్లు డబ్బు అడిగి చూశాను. ఆ విషయమే మాట్లాడవద్దని చెప్పేసింది. ఆ తర్వాతే నా లక్ష్యాన్ని అమలుపరచాలని నిర్ణయించుకు

న్నాను. రెండు రోజుల క్రితం ఉదయాన్నే రమణి నా దగ్గరికొచ్చి... ముంబయిలో నువ్వు ఓ లారీ ప్రమాదంలో మరణించి నట్టు చెప్పగానే నా మనసుకు ఎంతో సంతోషం కలిగింది. నా లక్ష్యంలో సగం పూర్తయినందుకు దేవుడికి కృతజ్ఞతలు తెలి పాను. కానీ రమణితో కలిసి ముంబయి వచ్చాక- ప్రమాదంలో మరణించింది నువ్వు కాదని తెలిసి షాక్ తిన్నాను. అయినా ఏదో ఊరట. ఇదే ముంబయిలో కనిపించ కుండా పోయిన నీ కోసం వెదుకుతూ... రమణినీ ఆ తర్వాత నిన్నూ ఫినిష్ చెయ్య డానికి నా మనుషులు ఇద్దరిని ఇక్కడికి

## కొత్తగాలి...

**అబ్బాయికి**
**రెక్కలు వచ్చాయి**
**అమెరి'కాకి'**
**ఎగిరి పోయాడు**

– *తాజీ ప్రసాద్*, చెన్నై

రప్పించాను. ఇప్పటికే రమణి వాళ్ళ చేతిలో..."

వింటున్న హరిహరన్ గుటక మింగాడు.

"ది... దివాకర్... నీకు కావలసింది. డ... డబ్బేగా! ఇస్తాను... ఎంత కావాలన్నా ఇస్తాను... గీతాంబరికి తెలియకుండా ఇస్తాను. రమణినీ, నన్నూ ఏమీ చెయ్యకు... మా ఇద్దరికీ ఏమైనా జరిగితే... అమ్మా నాన్న ప్రాణాలతో ఉండరు..."

"వాళ్ళూ ప్రాణాలతో ఉండకూడదనేగా మా కోరిక. ప్రస్తుతానికి గీతాంబరి ప్రాణంతో లేకపోయినా మాకు బాధలేదు. ఎందుకంటే ఆమె బిడ్డే మాకు ముఖ్యం. ఆ బిడ్డకు గార్డియన్‌గా ఉంటూ మీ ఆస్తిలో వేలు పెట్టొచ్చుగా..."

"ది... దివాకర్..."

"ఇక మాటలు అనవసరం..." అంటూ గోడపక్కగా మోకాళ్ళపై కూర్చొని ఉన్న డాక్టర్ చతుర్వేది, ఆర్యా, వాల్‌చంద్‌లను క్రూరంగా చూశాడు దివాకర్...

"డాక్టర్! జోషి కొడుకును బాగు చేయడా నికి మీరు ఏదో జీన్ పరిశోధన చేస్తు న్నట్టూ, దానికోసం కొన్ని ప్రాణాల్ని బలితీ సుకున్నట్టూ వాల్‌చంద్ ద్వారా తెలుసుకు న్నాను. మీరు ఇకపై ఆ పరిశోధన చెయ్యా టం లేదు... ఎందుకంటే... మీరు ప్రాణా లతో ఉండరు కనుక..."

చతుర్వేది ఆదుర్దాగా దివాకర్‌ను చూశాడు.

దివాకర్ కొనసాగించాడు. "జీవితంలో నా లక్ష్యాన్ని చేరుకునేందుకు జోషీ మీరూ నాకు ఎంతో సాయం చేశారు... మీరిద్దరూ చేసిన సాయానికి ఈ జన్మలో కృతజ్ఞతలు తెలపలేకపోతున్నందుకు బాధగా ఉంది. ఈ విషయంలో నేను జోషికి గుడికట్టి పూజించాలి. ఎందుకో తెలుసా? మిమ్మ ల్నందరినీ కాల్చి చంపబోతున్నది నేనే అయినా ఆ నేరం జోషి మీదకే వస్తుంది. జోషి మిమ్మల్నంతా ఎందుకు చంపాలి? దానికీ కారణం ఉంది".

దివాకర్ మాట్లాడుతూ ఉండగానే, వాల్ చంద్ మెల్లగా లేవడానికి ప్రయత్నించగా చప్పున రివాల్వర్ అతనికేసి తిరిగింది.

"ఇంకోసారి కదిలావంటే గుండెల్లోకి బుల్లెట్ దూసుకెళుతుంది. ఇది నీకు మాత్రమే కాదు, అందరికీ హెచ్చరిక..."

వాల్‌చంద్ కదలకుండా అలాగే కూర్చుం డిపోయాడు.

దివాకర్ కొనసాగించాడు. "జోషి మిమ్మ లంతా చంపడానికి కారణం ఏమిటంటే- తన కొడుకు మెదడులోని లోపాన్ని జీన్ ట్రాన్స్‌ఫర్ ద్వారా నయం చేస్తానని చెప్పిన

డాక్టర్ చతుర్వేది... తన నుండి లక్షలకొద్దీ డబ్బు తీసుకుని మోసం చేశాడు. దాంతో జోషి పట్టరాని ఆగ్రహంతో ల్యాబొరేటరీకి వచ్చి- డాక్టర్‌నూ, ఆర్యానూ, వాల్ చంద్‌నూ, స్పృహలో లేని నిషానూ, హరిహరన్‌నూ కాల్చి చంపేశాడు. ఈ వాంగ్మూలాన్ని పోలీసులకు చెప్పబోయేది మరెవరో కాదు... వాల్ చందే!"

అందరూ బేల చూపులతో దివాకర్‌నే చూడసాగారు.

దివాకర్ కొనసాగించాడు: "వాల్ చంద్ అంటే నిజానికి వాల్ చంద్ కాదు. అంటే తూటా తగిలి ప్రాణాపాయ పరిస్థితిలో పోలీసులకు ఫోన్ చేస్తున్నట్టు వాల్ చంద్‌లా మాట్లాడబోయేది నేనే. ఇంతకు ముందే వాల్ చంద్ గొంతు పోలీసులకు తెలిసే అవకాశంలేదు. హత్యలు చేసింది జోషీ అని పోలీసులు నమ్మడానికి మరో సాక్ష్యం- ఈ రివాల్వర్. జోషీ తన రివాల్వర్‌ను వాల్ చంద్‌కు ఇచ్చాడు. అదే ఇప్పుడు నా చేతిలో ఉంది".

హరిహరన్ అదురుతున్న గుండెతో అడ్డు తగిలాడు.

"ది... దివాకర్..."

"ఏంటి హరీ? "

"నా... నా తమ్ముణ్ణి ఏం చెయ్యకు!"

దివాకర్ మెల్లగా నవ్వాడు. "ఇది నా పథకంలో చివరి ఘట్టం. మార్చడానికి వీలులేదు. జోషీని వెదుకుతూ పోలీసులు ఆయన బంగళాకు వెళితే, అక్కడ నా మనుషులతో పాటు బోనస్‌గా రమణి డెడ్ బాడీ కూడా వాళ్లకు దొరుకుతుంది..."

"నో... నో..."

"అరిచి ప్రయోజనం లేదు హరీ... తన పరిశోధన విజయవంతం కావడానికి డాక్టర్ కొన్ని ప్రాణుల్ని బలి తీసుకున్నట్టు... విలాసవంతమైన జీవితాన్ని గడపడానికి నేను కొంతమందిని చంపటంలో తప్పులేదుగా? "

"వ... వద్దు.. దివాకర్, నువ్వెంత తెలివిగా పనులను పూర్తిచేసినా పోలీసుల నుండి నువ్వు తప్పించుకోలేవు"

దివాకర్ నవ్వాడు. "పోలీసుల అనుమానపు చూపులు నా మీద పడేందుకు అవకాశమే లేదు. మిమ్మల్నంతా పైకి పంపించేశాక, నేను నేరుగా హోటల్ కెళ్లి కాసేపు విశ్రాంతి తీసుకుని, ఎస్సై మల్హోత్రాకు ఫోన్‌చేసి అమాయకుడిలా మాట్లాడుతాను. "సార్., గదిలో నాతో పాటు నిద్రపోయిన రమణి కనిపించటంలేదు సార్. గంట క్రితం వరకూ- 'ఈ రాత్రికి ఎలాగైనా అన్నయ్యను కనిపెట్టే తీరాలి!' అని గొణుగుతూ ఉన్నాడు. ఉన్నట్టుండి నాకు మెలకువ వచ్చి చూసేసరికి అతడు కనిపించలేదు. 'ఇక పోలీసులను నమ్ముకుని ప్రయోజనం లేదు. హరిహరన్‌ను కనిపెట్టడానికి మనమే ఏదైనా ప్రయత్నం చెయ్యాలి' అని అనేవాడు. 'అలా చేయకూడదు' అన్న నా మాటలు అతనికి నచ్చలేదు. ఒంటరిగానే వెళ్లినట్టుంది...' ఇలా నేను చెబితే పోలీసులకు నామీద అనుమానం వస్తుందా? ..."

ఆ గదిలో ఎటుచూసినా నిశ్శబ్దం.

మోకాలిపై కూర్చొని ఉన్న చతుర్వేది ఏదో మాట్లాడటానికి ప్రయత్నించాడు.

దివాకర్ అతణ్ణి వారించాడు. "ఇంకేమీ మాట్లాడకండి డాక్టర్... నా ఆపరేషన్ మొదలు పెట్టాల్సిందే! జీవిత చరమాంకంలో ఉన్న మీకు మొదటి తూటాను బహూకరిస్తున్నాను. అందుకుంటారా? " అంటూ దివాకర్ నడిచి వెళ్ళి చతుర్వేది నుదుటిమీద రివాల్వర్ ఆనించాడు.

డాక్టర్ చేతివేళ్ళు భయంతో కొంకర్లు తిరిగాయి.

డాక్టర్ బలిపశువులా దివాకర్‌ను చూస్తూ అన్నాడు, "నో... నో... చంపకు! నీకు కావలసినంత డబ్బు నేను... ఇ.. ఇస్తాను..."

దివాకర్ నవ్వాడు. "సారీ డాక్టర్! నా లక్ష్యానికి మీరిచ్చే సహకారం డబ్బులో లేదు. మీ ప్రాణంలోనే ఉంది. మాట్లాడకుండా ఇస్తారా? "

"నో... నో... నో..." చతుర్వేది అరుస్తుండగానే దివాకర్ రివాల్వర్ ట్రిగ్గర్ నొక్కాడు. సైలెన్సర్ ద్వారా తూటా దూసుకెళ్లి చతుర్వేది ఒంట్లో తిష్టవేసుకుంది.

అంతే! చతుర్వేది శరీరం మెల్లగా పక్కకు వాలిపోయింది. తెరుచుకున్న కళ్ళు తెరుచుకున్నట్టే ఉండిపోయాయి. అతడి ఒంట్లోని కదలికలు మెల్లగా ఆగిపోయాయి.

దివాకర్ చూపులు ఇప్పుడు వాల్‌చంద్ మీద పడ్డాయి.

"వాల్‌చంద్! రెండో తూటా నువ్వు తీసుకుంటావా లేదా ఆర్యాకు ఇమ్మంటావా? "

రివాల్వర్ ఇద్దరినీ మార్చి మార్చి చూడసాగింది.

సరిగ్గా అదే సమయంలో...

కుర్లా పోలీసు స్టేషన్‌లో ఎస్సై షిండే ముందు కూర్చుని ఉన్నాడు అనిల్‌కుమార్. అతడి ముఖమంతా చెమట పట్టిఉంది. కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ సన్నని గొంతుతో అన్నాడు: "సార్, అరగంట క్రితమే నేను పూనా నుంచి ముంబాయికి తిరిగి వచ్చాను. వచ్చీరాగానే కనిపించకుండా పోయిన విఠల్ గురించి ఎంక్వయిరీ చెయ్యడానికి మీరు మా ఇంటికి వచ్చినట్టు మా నాన్న చెప్పారు. అందుకే నేను ఇక్కడికొచ్చాను".

"విఠల్ గురించి ఏం చెప్పబోతున్నావ్"

"సార్... విఠల్ కనిపించకుండా పోయిన ఆ సాయంకాలం అతడు ఫోన్ చేశాడు. ఇద్దరూ రీగల్ థియేటర్లో సినిమాకు వెళ్లడానికి ప్రోగ్రాం వేసుకున్నాం. నేను విఠల్ కోసం ఎదురుచూస్తుంటే ఆరు గంటల సమయంలో అతడి నుండి నాకు ఫోన్ వచ్చింది.

షిండే నిటారుగా నిలబడ్డాడు. అనిల్‌కు

మార్ కొనసాగించాడు. "విఠల్ నాకు ఫోన్‌చేసి సినిమాకు రావటం లేదు. నిషాను ఫాలో అవుతున్నాను. ఇప్పుడు నిషా విలేపార్లే రైల్వేస్టేషన్‌కు ఎదురుగా ఉన్న రోడ్లోని బంగళాలోకి వెళ్లింది. నేను బంగళా ఎదురుగా ఉన్న కరాటే ట్రెయినింగ్ సెంటర్ ముందు ఆమె కోసం ఎదురుచూస్తున్నాను. బంగళాలోకి వెళ్ళిన నిషా ఎప్పుడు బయటికి వస్తోందో తెలియదు. సో... నా కోసం నువ్వు ఎదురు చూడకుండా సినిమాకు వెళ్లిపో... రేపు ఉదయం కలుసుకుందాం అన్నాడు..."

షిండే ఆత్రుతగా అడిగాడు, "విలేపార్లే రైల్వేస్టేషన్‌కు ఎదురు రోడ్డా? "

"అవును సార్"

"అది ఎవరి బంగళానో విఠల్ చెప్పాడా? "

"చెప్పలేదు సార్".

"బట్, బంగళాకు ఎదురుగా ఒక కరాటే ట్రెయినింగ్ సెంటర్ ఉందని చెప్పాడా? "

"అవును సార్".

షిండే కుర్చీని వేగంగా వెనక్కుతోసి లేచి నిలబడ్డాడు "టూ నాట్ త్రీ..."

"ఎస్సార్..." అంటూ ఒక కానిస్టేబుల్ అక్కడికి వచ్చాడు.

"జీపు రెడీ చెయ్..."

★ ★ ★

మాసిలామణి ఎంతో టెన్షన్‌గా ముంబాయి సిల్వర్ శాండ్ హోటల్ రిసెప్షనిస్ట్‌తో మాట్లాడుతున్నాడు.

"నేను రమణి ఫాదర్‌ను మాట్లాడుతున్నాను. రమణితో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి, కాస్త పిలుస్తారా? "

"ఆయన రూమ్‌లో లేరు సార్"

"దివాకర్? "

"ఆయనా లేరు"

"ఇద్దరూ ఎక్కడికెళ్లారు? "

"తెలియదు సార్".

"నాకో సాయం చెయ్యగలరా? "

"తప్పకుండా... చెప్పండి సార్".

రమణి గదికి తిరిగి రాగానే దివాకర్‌కు తెలియకుండా, నేను ఫోన్ చేసిన విషయాన్ని చెప్పి మా ఇంటికి ఫోన్ చెయ్యమంటారా? "

"చెబుతాను సార్..."

"ఇది దివాకర్‌కు తెలియకూడదు..."

"తెలియనివ్వను సార్... మీరేమీ కంగారు పడకండి"

మాసిలామణి రిసీవర్‌ను పెట్టేసి కళ్ళు మూసుకుని చెయిర్లో వెనక్కు వాలాడు.

★ ★ ★

దివాకర్ చేతిలోని రివాల్వర్... ఆర్యానూ, వాల్‌చంద్‌నూ మార్చి మార్చి చూసి చివరకు వాల్‌చంద్‌ను చూస్తూ ఉండిపోయింది.

దివాకర్ మెల్లగా నవ్వాడు.

"రెండో తూటా నీ కోసమే..."

"నై... సాబ్... దయా... కర్‌లో..." రెండు చేతులు జోడించి, దివాకర్ పాదాలపై పడి నమస్కరిస్తున్నట్టు వంగి, ఉన్నట్టుండి... పులిలా ఎగిరి దివాకర్ మీదికి దూకబోయాడు... అతడు అప్రమత్తంగా పక్కకు జరిగి ఎగిరి కాలితో వాల్‌చంద్ కడుపుమీద తన్నాడు.

బలమైన దెబ్బ తగలటంతో, విపరీతమైన

## కొత్తగాలి...

**అందరూ పల్లకీ ఎక్కితే**
**అసలు మోసేవారుండరు**
**అందరికీ ఏసీ కావలిస్తే**
**అసలు కరెంటే ఉండదు**

- శ్రీహస్త, విజయవాడ

నొప్పితో వాల్‌చంద్ నేలమీద పడ్డాడు. అంతే. ఒక్క సెకనులో దివాకర్ చేతిలోని రివాల్వర్ నిశ్శబ్దంగా తూటాను రిలీజ్ చేసింది. అది అతడి గుండెలోకి దూసుకెళ్ళటంతో క్షణాల్లో వాల్‌చంద్ ప్రాణాలు గాల్లో కలిసిపోయాయి.

దివాకర్ రివాల్వర్ రంధ్రాన్ని నోటితో ఊదుతూ ఆర్యావైపు చూశాడు.

"అతడి చర్యను నేను ముందుగానే పసిగట్టాను... పూర్ ఫెలో..."

ఇక గదిలో మిగిలిన హరిహరన్, ఆర్యాలిద్దరూ భయంభయంగా దివాకర్ కేసి చూడసాగారు. అతడు వికృతంగా నవ్వాడు,

కొత్తగాలి...

**నేటి పొలం**
**హలంతో జట్టు నాస్తి**
**కాంక్రీటుతో**
**నేస్తం జాస్తి**

– శ్రీమాన్ శ్రీకాశ్యప,
సింహాచలం

"ఆర్యా... ఇక నీ వంతు? "

★ ★ ★

విలేపార్లే రైల్వేస్టేషన్‌కు ఎదురుగా ఉన్న రోడ్డు మీదికి పోలీస్ జీప్ ఎంటరైంది.

జీపు ముందు భాగాన కూర్చున్న ఎస్సై షిండే, తన సునిశితమైన చూపులతో అక్కడి పరిసరాలను గమనించసాగాడు. వెనక భాగాన నలుగురు కానిస్టేబుళ్ళు లాఠీలతో కూర్చొని ఉన్నారు. జీపు ఒక సన్నటి మలుపులోకి తిరగ్గానే షిండే గట్టిగా అరిచాడు, "స్టాప్!"

జీపు సడెన్ బ్రేక్‌తో ఆగింది.

షిండే కిందికి దిగాడు. వీధిలైటు వెలుగులో ఆ బోర్డు కనిపించింది 'Dragon Karate Training Centre'

'అనిల్‌కుమార్ చెప్పిన కరాటే ట్రైనింగ్ సెంటర్ ఇదే అయి ఉండొచ్చు!'

దానికి ఎదురుగా చూశాడు ఎస్సై.

మూసిన కాంపౌండ్ గేటుతో ఆ బంగళా కనిపించింది. ఒక అద్దాల కిటికీ ద్వారా లోన సన్నటి వెలుగు కనిపించింది.

"కానిస్టేబుల్స్" మెల్లగా పిలిచాడు ఎస్సై.

"ఎస్సార్..."

"జీపు కాస్త చాటునాపి నా వెనకరండి"

"ఎస్సార్."

షిండే కాంపౌండ్ గేటు దగ్గరకు నడిచాడు. దాన్ని మెల్లగా తోసి చూశాడు. అది అంతే మెల్లగా తెరుచుకుంది.

లోపలికి అడుగుపెట్టి పోర్టికోకేసి దారితీశాడు ఎస్సై.

అనుసరించారు పోలీసులు.

★ ★ ★

దివాకర్ రివాల్వర్‌తో ఆర్యాను అణువణువూ కొలిచాడు.

ఆర్యా మరణ భయంతో అలాగే వెనకకు జరగసాగింది.

దివాకర్ నవ్వాడు. "ఏం ప్రయోజనం లేదు ఆర్యా. ఒకట్రెండు నిమిషాలు ఎక్కువ బతకటం వల్ల నీకు ఒరిగేదేమీ లేదు..."

ఆర్యా ఇక వెనక్కు వెళ్ళలేక గోడకు ఆనుకొని అలాగే మోకాళ్ళపై తల ఆనించింది.

"ఇది ఉత్తమం" నవ్వుతూ, ఆర్యావైపు కదలటానికి ప్రయత్నిస్తూ... నిషా పడుకుని ఉన్న స్ట్రెచర్‌ను దాటుతున్నంతలో "ఫట్...." మంటూ దివాకర్ చేతిలోని రివాల్వర్‌ను ఎవరో ఎగరగొట్టారు. అతడు అదిరిపడి వెనక్కు తిరిగాడు. అతడి కంటికి స్ట్రెచర్ నుండి లేచి కూర్చున్న నిషా కనిపించింది. ఆమె చేతిలో రివాల్వర్!

తాను ఎలాగైనా ఈ ప్రమాదం నుండి బయటపడాలన్న మొండి ధైర్యం... ఆమెలో కనిపిస్తోంది.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

# ఎక్కువ వడ్డీ తీసుకోండి!

నిన్నటి నిజం

మోక్షగుండం విశ్వేశ్వరయ్య విదేశీ పర్యటన చేపట్టారు. డబ్బు దగ్గర ఇబ్బందిగా ఉంది. అందుచేత బ్యాంకునుంచి అప్పు తీసుకోవాలనుకున్నాడు. మైసూరు బ్యాంకు మేనేజరు బి.వి.నారాయణరెడ్డిని ఫోనులో సంప్రదించి తమ భేటీకి 11.15గంటలుగా సమయం నిర్ణయించారు. నిర్ణీత సమయానికి కచ్చితంగా బ్యాంకులో అడుగుపెట్టిన విశ్వేశ్వరయ్య సమయపాలనను చూసి బ్యాంకు సిబ్బంది నివ్వెరపోయారు. మేనేజర్ బల్లమీదున్న ఒక ఫైలును తెరచి విశ్వేశ్వరయ్యగారికి చూపించాడు. ఫైలులోని కాగితాలు, రుణ దరఖాస్తులను తను బ్యాంకుకు వచ్చేలోపే అంతా సిద్ధంచేసి ఉంచారని విశ్వేశ్వరయ్య గమనించారు. తాకట్టు పెట్టేందుకని ఇంటినుంచి తెచ్చిన బాండ్లను మేనేజర్ ముందు పెట్టారాయన. వాటిని చూసి మేనేజర్, 'మీకు అప్పిచ్చేందుకు వేరే తాకట్టు అవసరమా? మీ పేరు చాలదా? మాకు అదే పెద్ద బాండు. నిజానికి ఈ బ్యాంకును స్థాపించింది మీరే కదా?' అని బాండ్లను తిరస్కరించాడు.



'వీటిని బ్యాంకులోనే ఉంచండి. రుణం చెల్లించి తీసుకుంటాను' అని విశ్వేశ్వరయ్య అన్నారు.

రుణ దరఖాస్తుపై సంతకం చేసేటప్పుడు వడ్డీ ఎంత అని చూశారు. అది మూడున్నర శాతంగా ఉంది. 'ఇతరులనుండి కూడ ఇంతే వడ్డీ వసూలు చేస్తారా?' అన్నారు. బ్యాంకు మేనేజర్, 'వ్యక్తులను బట్టి వడ్డీ ఉంటుంది' అన్నాడు. 'నాకు మాత్రమే ఈ ప్రత్యేక వ్యవహారమెందుకు? మీరు అందరితోనూ ఒకే రకంగా వ్యవహరించాలి' అని దానిని కూడా మార్పించారు.

'నా సుదీర్ఘ ఉద్యోగజీవితంలో ఎక్కువ వడ్డీ ఇస్తానన్న వ్యక్తి విశ్వేశ్వరయ్యగారు ఒక్కరే!' అని బ్యాంకు మేనేజరు విస్మయం చెందాడు.

ప్రజాధనం దోచుకోవచ్చుని పదవులనాశించే నేటి నాయకులకు ఈ సంఘటన ఓ కనువిప్పు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

ఆర్యా సంభ్రమంగా నిషాను చూస్తూ 'రెండోసారి ఆమెకు మత్తుమందు ఇవ్వకపోవటం ఎంత మంచిదయింది' అనుకుంది.

దివాకర్ ఆశ్చర్యపోతూ నిషాను చూస్తుంటే...

ఆమె రివాల్వర్‌ను కదిలిస్తూ... "ఊс... తల వెనక చేతుల్ని పెట్టుకుని అలాగే మోకాళ్ళపై కూర్చో..."

నిషాను కోపంగా చూస్తూ తన తల వెనుక రెండు చేతుల్నీ పెట్టుకుని మోకాళ్ళపై కూర్చున్నాడు దివాకర్.

"ఎలా ఈ ప్రమాదం నుండి బయటపడాలా?" అని అతడి బుర్ర చురుగ్గా ఆలోచించసాగింది.

దివాకర్ మీద తన చూపుల్ని పక్కకు తిప్పకుండా ఆర్యాను పిలిచింది నిషా.

"ఆర్యా..."

"ఊс..." ఆమె తడబడుతూ నిషా దగ్గరికి వెళ్ళింది.

"ముందు హరిహరన్ కట్లు విప్పు..."

ఆర్యా భయం భయంగా వెళ్ళి హరిహరన్ కట్లు విప్పింది. అతడు లేచి పరుగెత్తుకొచ్చి నిషా చేతిలో ఉన్న రివాల్వర్‌ను అందుకొని దివాకర్‌కేసి గురిపెట్టాడు.

"రమణిని ఎక్కడ దాచావ్?"

దివాకర్ మౌనం వహించటంతో హరిహరన్ పిచ్చి పట్టిన వాడిలా అరిచాడు, "ఊс... చెప్పు... రమణి ఎక్కడున్నాడు?"

దివాకర్ బదులిచ్చేంతలో బయటి నుండి కాలింగ్ బెల్ శబ్దం వినిపించింది.

నిషా గొంతు విప్పింది, "ఆర్యా... మునుపటి విశ్వాసం ఇక నీకు పనికిరాదు. వచ్చింది ఎవరో వెళ్ళి చూడు. మనకు కావలసిన వాళ్ళైతే లోపలికి పిలుచుకురా..."

ఆర్యా తలాడించి గుమ్మం తలుపుకేసి వెళ్ళింది. ఒక్క నిమిషం తేడాతో ఖాకీ

యూనిఫామ్ ధరించిన పోలీసులతో లోపలికి వచ్చింది.

ఎస్సై షిండే పదినిమిషాల్లో అక్కడ జరిగిన విషయాలన్నింటినీ హరిహరన్, నిషాల ద్వారా తెలుసుకున్నాడు.

దివాకర్ వద్దకు నడిచి అతడి జుట్టు పట్టుకుని ఊపాడు. "నీ మనుషులు రమణిని ఎక్కడికి తీసుకెళ్ళారో చెప్పరా? "

"నా... నాకు తెలియదు..."

అంతే, షిండే పిడికిలి బిగించి దివాకర్ ముక్కుపై ఒక గుద్దు గుద్దాడు. ముక్కులో నుండి రక్తం బొటబొటమంటూ బయటికి రాసాగింది.

"ఇప్పుడు చెప్పు... రమణి ఎక్కడ? "

## కొత్తగాలి... 

**నీటి కోతలు**
**ఎరువుల కోతలు**
**కరెంటు కోతలు**
**అయినా, దేశం సుభిక్షం**
**అంటూ నాయకుల కోతలు**

– *ప్రభాకర్ తల్లాప్రగడ, హైదరాబాద్*

రక్తం కారుతున్నా లెక్కచెయ్యకుండా నవ్వుతూ, "తెలిసినా ప్రయోజనం ఉండదు ఇన్‌స్పెక్టర్... ఈపాటికే అతడి కథ ముగిసిపోయి ఉంటుంది..."

"యూ... రాస్కెల్!" హరిహరన్ అరుస్తూ అతణ్ణి కొట్టడానికి లేచాడు.

ఇంతలో పక్కగదిలో ఉన్న టెలిఫోన్ మోగింది. దివాకర్‌ను కానిస్టేబుళ్ళకు అప్పగించి, ఆర్యాకేసి చూశాడు షిండే. "ఈ సమయంలో ఎవరు చేసి ఉంటారు? "

"బహుశా జోషి అయ్యుండొచ్చు సార్."

"రా... నాతో..."

ఇద్దరూ టెలిఫోన్ ఉన్న గదిలోకి వెళ్ళారు. ఆర్యా రిసీవర్‌ను ఎత్తుకునే ముందు షిండే అన్నాడు, "ఇదిగో చూడు ఆర్యా... ఈ కేసు కోర్టుకు వెళ్ళినప్పుడు నువ్వే అప్రూవర్‌వి. నీకు జైలుశిక్ష పడకుండా నేను చూసుకుంటాను. ఫోన్‌లో మాట్లాడేది జోషి అయితే... ఇక్కడి విషయాలను గురించి ఏమీ చెప్పకుండా ఎలాగోలా అతణ్ణి ఇక్కడికి రప్పించాలి..."

ఆర్యా అలాగేనంటూ తలాడించి రిసీవర్‌ను అందుకుంది: "హలో..."

"ఆర్యా! నేను జోషీని మాట్లాడుతున్నాను..."

వెంటనే ఆర్యా ఎడమచేత్తో రిసీవర్ మౌత్‌ను మూసిపెట్టి షిండేతో అంది, "జోషీనే..."

"సరే.. మాట్లాడి ఇక్కడికి రప్పించు..."

ఆర్యా ఫోన్‌లో మాట్లాడుతూ.. "చెప్పండి సార్..."

"డాక్టర్ పక్కనున్నారా ఆర్యా? "

"లేరు సార్.. ఆయనకు మళ్ళీ తేలికపాటి గుండెపోటు వచ్చింది. గదిలో విశ్రాంతి తీసుకుంటున్నారు..."

"ఆర్యా, నేనిప్పుడు చెప్పబోయే విషయాన్ని డాక్టర్ విన్నారంటే ఆనందంతో లేచి కూర్చుంటారు."

"ఏం చెప్పబోతున్నారు సార్ ? "

"ఇక్కడ మూడు ఎలుకలు చిక్కాయి"

"మూడు ఎలుకలా? "

"ఔను... మూడూ మగవే. చిక్కిన ఒక ఎలుక పేరు... హరిహరన్ తమ్ముడు..."

"ఎ.. ఎలా సార్? "

"సాధ్యమైందని అడుగుతున్నావా? కాసేపటి క్రితం నా గది కిటికీ నుండి యాదృచ్ఛికంగా బయటికి చూసినప్పుడు, మనింటి దగ్గరున్న ట్రాన్స్‌ఫార్మర్ వెనక రమణి తొంగి తొంగి చూస్తూ కనిపించాడు. మన వాచ్‌మెన్‌ను వెంటపెట్టుకొని, తుపాకీ చేతబట్టుకుని, బంగళా వెనకున్న ట్రాన్స్‌ఫార్మర్

వద్దకు వెళ్లాను... ఆ సమయంలోనే మరెవరో ఇద్దరు వ్యక్తులు రమణిని కొట్టి ఓ వ్యాన్‌లో అపహరించుకుపోవడానికి ప్రయత్నించారు. నేనూ వాచ్‌మెన్ తుపాకీతో వాళ్లని బెదిరించి, బంగళాలోకి తీసుకొచ్చి, కూల్‌డ్రింక్స్ తాగించి, ఇంకో నాలుగు గంటలపాటు లేవకుండా చేశాం"

"ఈజిట్? ఒక్క నిమిషం లైన్‌లో ఉండండి సార్... డాక్టర్‌తో చెప్పి ఆయన ఏమంటారో చెప్తాను"

"వెళ్లి అడిగిరా... లైన్‌లోనే ఉంటాను.."

ఆర్యా రిసీవర్‌ను అక్కడ పెట్టి ఎస్సై షిండేకు సైగచేసి బయటికి రమ్మని విషయమంతా చెప్పింది.

ఆయన కొద్దిక్షణాలు ఆలోచించి ఆర్యాకు చెప్పాడు. "మత్తులో ఉన్న ఆ ముగ్గురిని ఆయన కారు వెనుక సీట్లో వేసుకుని ఇక్కడికి తీసుకొచ్చేయమని చెప్పు... కారు ఇక్కడికి రాగానే వాళ్లను పట్టుకొందాం..."

ఆర్యా అలాగేనని తలాడించి టెలిఫోన్ కేసి నడిచింది. రిసీవర్‌ను చెవికి ఆనించుకుని, షిండే చెప్పిన మాటలను డాక్టర్ చతుర్వేది చెప్పినట్లుగా చెప్పింది.

జోషి ఉత్సాహంగా- "ఇదిగో ఇప్పుడే బయలుదేరుతున్నాను..." అన్నాడు.

సరిగ్గా ఇరవై నిమిషాల తర్వాత...

జోషి కారు చతుర్వేది బంగళాకు చేరుకుంది. జోషి కిందికి దిగాడు.

పోర్టికో మెట్లమీద ఆర్యా కనిపించింది.

"ఆర్యా! మూడు ఎలుకల్ని పట్టుకొచ్చేశాను. వాల్‌చంద్ లోపలుంటే పంపించు.. ఒక్కో ఎలుకను తీసుకెళ్తాడు"

ఆర్యా మౌనంగా ఆయన్ని చూస్తుండగా... మూడు వైపుల నుండీ పోలీసులు ఆయన్ను చుట్టుముట్టారు.

"ఆ... ఆర్యా... వీ... వీళ్లు...?"

"వెల్‌కమ్ మిస్టర్ జోషీ! లోపలికెళ్లి కూర్చుని తీరిగ్గా మాట్లాడుకుందాం రండి."

జోషీ మెడమీద షిండే చెయ్యి పడింది.

★ ★ ★

చెన్నై...

కాలింగ్‌బెల్ శబ్దం వినగానే అప్పటి వరకూ నిద్రపోకుండా ఉన్న మాసిలామణి లేచి గోడగడియారంకేసి చూశాడు.

ఉదయం ఐదు గంటలైంది.

లేచి వెళ్లి తలుపు తీశాడు.

బయట... మసక వెలుగులో హరిహరన్, రమణీ నిలబడి ఉన్నారు.

"నా... నాన్నా..."

ఒక్క ఉదుటున వెళ్లి వాళ్లను అక్కున చేర్చుకున్నాడు మాసిలామణి.

ఆయన కళ్లల్లో ఆనందబాష్పాలు..

"హ... హరీ... నిన్ను మళ్లీ ప్రాణాలతో చూస్తున్నాను... ఇది కల కాదుకదా?"

హరిహరన్ కళ్లలోనూ నీళ్లు...

"కల కాదు నిజమే నాన్నా! ముంబయి నుండి మీకు ఫోన్ చేయడానికి సమయం లేకుండా పోయింది. కారణం... ఎలాగైనా మిడ్‌నైట్ ఫ్లైట్‌లో ఇక్కడికి తొందరగా వచ్చేయాలన్న ఆత్రుత"

"సరే... దివాకర్ ఎక్కడ?"

"నేను ముందు గీతాంబరిని చూడాలి... రండి నాన్నా. కార్లో వెళుతూ మాట్లాడుకుందాం. దివాకర్‌కు సంబంధించిన కొన్ని చేదునిజాలు ఇప్పుడెందుకు?"

"హరీ... ఏమిట్రా నువ్వంటున్నది?"

రమణి నీకు కాసేపాగాక అన్నీ వివరంగా చెబుతాడు... పదండి నాన్నా...గీతాంబరిని చూద్దాం"

ఇంటికి తాళం పెట్టి కార్లో ఎక్కుతున్నప్పుడు.. హరిహరన్ మాసిలామణితో సన్నని గొంతుతో అడిగాడు.

"నాన్నా... నా బిడ్డ ఎవరిలా ఉన్నాడు? నాలాగానా.. గీతాంబరిలాగానా?"

మాసిలామణి చిరునవ్వుతో అన్నాడు

"నాలా ఉన్నాడు"

C



బీరేంద్రకుమార్ భట్టాచార్య

రచయితగా సమాజాన్ని చైతన్యోద్దీప్తం చేయడంలో తన బాధ్యతను స్పష్టంగా నిర్దేశించుకుని, మొక్కవోని దీక్షతో ఆ దిశలోనే పోరాటం జరుపుతూ ప్రస్థానం సాగించిన కలం యోధుడు బీరేంద్రకుమార్ భట్టాచార్య. స్వాతంత్ర్య సమరంలో పాల్గొనడంతో పాటు పాత్రికేయుడిగా, పత్రికా సంపాదకుడిగా, కవిగా, నవలాకారుడిగా, కథకుడిగా, వ్యాసకర్తగా, అనువాదకుడిగా, విమర్శకుడిగా భట్టాచార్య అస్సామీ సాహితీరంగానికి విస్తృత సేవలందించాడు. 'మృత్యుంజయమ్' నవల ఆయనకు 1979లో జ్ఞానపీఠ్ పురస్కారాన్ని తెచ్చిపెట్టింది.

# అస్సామీ మణిపూస బీరేన్

అస్సాం రాష్ట్రం తూర్పు ప్రాంతంలోని శివసాగర్ జిల్లా ఢేకియాబోవా గ్రామ పరిసరాల్లో ఉన్న తేయాకు తోటల్లో భట్టాచార్య 1924 అక్టోబరు 14న జన్మించాడు. వారిది నిరుపేద కుటుంబం. పనులు దొరకని రోజుల్లో పస్తులుండవలసిన దైన్యస్థితి వారిది. తేయాకు తోటల్లోనే వున్న స్త్రీ ప్రాథమిక పాఠశాలలో విద్యాభ్యాసం ఆరంభమయింది. ఢేకియాభోవా సమీపంలో వున్న కాకాజోన్ ఆంగ్ల మాధ్యమిక పాఠశాలలో చేరి చదువు కొనసాగించాడు. జోర్హాట్ ప్రభుత్వోన్నత పాఠశాలలో చదివి మెట్రిక్యులేషన్ ఉత్తీర్ణుడయ్యాడు. విద్యార్థిగానే తన రచనాశక్తిని నిరూపించుకున్నాడు. గౌహతీలోని కాటన్ కళాశాలలో బీఎస్సీలో చేరినప్పటికీ, క్విట్ ఇండియా ఉద్యమంలో కారాగారవాసం కారణంగా భట్టాచార్య ఉన్నత విద్యకు అంతరాయం ఏర్పడింది. ఆనాటి రైతుల బాధలు, డిగ్బోయ్ పెట్రోలియం కార్మికుల సమస్యలు ఆయన మనస్సులో చెరగని ముద్ర వేశాయి. తర్వాత చదువు కొనసాగించి 1945లో గౌహతీ విశ్వవిద్యాలయం నుంచి బీఎస్సీ పట్టా అందుకున్నాడు. కోల్‌కతా వెళ్ళి అక్కడ 'వహ్నీ', 'అడ్వాన్స్' పత్రికల్లో పనిచేసి తిరిగి గౌహతి వచ్చి 'దైనిక్ అసమియా' పత్రికలో చేరాడు. పిమ్మట 'జనత' పత్రికకు సంపాదకత్వం వహించాడు. కొన్ని సంవత్సరాలు బర్మా సరిహద్దుల్లోని ఉఖరుల్ నాగా గ్రామంలో విజ్ఞాన శాస్త్రోపాధ్యాయుడిగా పనిచేశాడు. గౌహతీ తిరిగివచ్చి 'రామధేను', 'నవయుగ్' పత్రికల సంపాదకుడిగా పనిచేశాడు. ఎన్ని బాధ్యతలు వహించినా రచనా వ్యాసంగం నిరంతరం సాగుతూనే వుంది. ఉన్నత విద్యార్హ




తలు కూడా సాధించుకోగలిగాడు. పట్టభద్రానంతర విద్య పూర్తిచేసి 'అస్సామీ సాహిత్యంలో హాస్యం, వ్యంగ్యం' అనే అంశంపై పరిశోధన చేసి డాక్టరేటు పొందాడు. కొంతకాలం గౌహతీ విశ్వవిద్యాలయంలో రీడరుగా పనిచేసి, అటు పిమ్మట జీవితాన్ని సాహిత్యానికే అంకితం చేశాడు. అయిదు సంవత్సరాలు కేంద్ర సాహిత్య అకాడమీ

అధ్యక్షులుగా ఉన్నారు. రష్యా, పోలెండు దేశాలను సందర్శించాడు. విద్యార్థి దశలోనే బీరేన్ రచనలు పత్రికల్లో ప్రచురితమయ్యేవి. లిఖిత పత్రికల్లో ఆయన రచనలు ప్రత్యే క ఆకర్షణగా ఉండేవి. చంద్రకాంత బారువా, గణేశ్ గోగొయ్, నీలమణిఫూకన్, రామనోర్ తహియా, ఆనంద్ బారువా, గాంధీజీ, దోస్తోయేవ్‌స్కీ, ఠాగూర్, టాల్‌స్టాయ్, థామస్ హార్డీ, శరత్‌చంద్ర ఛటర్జీ ప్రభృతుల భావజాల ప్రభావం ఆయనపై వుండేది. ఆయన రచనలకు ఉద్యమాలు ఊపిరిగా నిలిచాయి. 1955లో వెలువడిన భట్టాచార్య నవల 'రాజపది రిండియామ్' అస్సామీ సాహిత్యంలో కొత్త గొంతును వినిపించింది. సంఘంలోని దురాచారాలను నిరసిస్తూ కర్తవ్యోన్ముఖుడైన యువకుని జీవితగాథ దీని ఇతివృత్తం. 1960లో ప్రచురితమైన ఆయన మూడో నవల 'ఇయారు యింగమ్' పాఠకలోకాన్ని ఆశ్చర్యపరిచింది. నాగాలాండ్‌లో ద్విముఖంగా సాగే పోరాటం దీని కథావస్తువు. అక్కడి పరిస్థితులపై భట్టాచార్యకున్న లోతైన అవగాహన వ్యక్తమవుతుంది. కొండజాతి జనుల్లో పెల్లుబికిన రాజకీయ చైతన్యానికి నవల అద్దం పడుతుంది. ఈ నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. నూనెశుద్ధి కర్మాగారం కార్మికుల నేపథ్యంలో నడిచిన నవల 'ప్రతిపద్' ప్రజాస్వామ్య విధానంపై బీరేంద్ర భట్టాచార్యకున్న విశ్వాసం దీనిలో ఆవిష్కృతమయింది. శతఘ్ని, అయి (తల్లి), మృత్యుంజయ్, భారతి, పరివ్రాజక్, వల్లరి, రంగమేఘ్, మునిచరిపహర్, ఏటినిషా మొదలైన ఇరవై నవలలు ఆయన కలం నుంచి జాలువారాయి. 'రామధేను'కు సంపాదకుడిగా ఉన్న కాలాన్ని విమర్శకులు 'రామధేను యుగం'గా పరిగణించారు. కొలాంగ్ ఆజీబొయ్, సాత్సోరి తదితర ఆయన కథాసంపుటాలు శిల్పనైపుణితో నిండి వున్నాయి. తేజ్ మిలా, జనత, ఘర్, భూమి, అంతర్ తమ్ వంటి పన్నెండు కవితా సంపుటాలు భట్టాచార్య కావ్య నిర్మాణ దక్షతకు తార్కాణాలు. 'సీమాయ్ అమానీకరే' చక్కటి యాత్ర కథనం. ఇంకా ఆరు గద్య కృతులు, నూటేభై రేడియో నాటకాలు, ఏభై వ్యాసాలు, ఆరు అనువాదాలు, నూటేభై కవితలు రచించాడు. ఒక కవితలో శాంతి మార్గాన్ని ప్రతిపాదిస్తూ ఇలా అంటాడు. 'ఎక్కడ శాంతి వుందో మిత్రమా/ అక్కడ ప్రేమ కూడా వుంది. హఠాత్తుగా పాతాళపు పొరల్ని చీల్చుకుని మందాకినిలా పొంగి వచ్చి ప్రవహిస్తుంది'.

జ్ఞానపీఠ పురస్కారానికి పాత్రమైన 'మృత్యుంజయ్' నవల బీరేంద్రకుమార్ భట్టాచార్య జనహిత నిబద్ధతకు నిదర్శనం. ఆయన సృజనశీలం ఎంత సమున్నతమో ఇది చాటి చెబుతుంది. 1963-72 మధ్య భారతీయ భాషల్లో వెలువడిన రచనల్లో ఇది అత్యుత్తమమైనదిగా ఎంపిక అయింది. యథార్థ పరిస్థితుల్ని ప్రతిభావంతంగా నవలలో పొందుపరిచాడు. 'తన కాలంనాటి సామూహిక భావావేశాలతో విసిగిపోయి, సారహీనమైన కల్పనాజగత్తులో నివసించడం రచయిత ధర్మం కాదు. తన యుగం నాటి ఆవేశాల నుండి ఏర్పడిన దుర్మార్గాన్ని రచయిత ఎదుర్కోవాలి. నా మూడు నవలలు ఇయార్ యింగమ్, ప్రతిపథ్, మృత్యుంజయ్ ఇందుకు సాక్ష్యాలు' అని ఆయన వివరించాడు. 'మృత్యుంజయ్' నవలలో ప్రత్యేకంగా ఒక కథానాయకుడు లేడు. ప్రజలే ముఖ్యపాత్రలు. క్విట్ ఇండియా కాలంలో అస్సాంలో చెలరేగిన పరిస్థితులను ఈ నవల చిత్రిస్తోంది. ఈ నవలలోని పాత్రలు సమాజంలో పాతుకుపోయిన వికృత విలువలను నిర్మూలించేందుకు కృషి చేస్తాయి. సమాజాన్ని మార్చే యత్నం వారిది. ఈ నవలకు నౌగాంగ్ జిల్లా క్షేత్రంగా ఉంది. ధైపారాకు చెందిన గోసాయి నేతృత్వంలో స్వాతంత్ర్య సమరయోధులు రైలు పట్టాలు తొలగించే ఘటన చుట్టూ అల్లిన కథ ఇది. ఈ రైలులో సైనికులు ప్రయాణిస్తున్నారు. పాత్ర చిత్రణ, సన్నివేశ కల్పన ఆశ్చర్యం కలిగిస్తాయి. చాలావరకు ప్రతీకాత్మకంగా భావావిష్కరణ ఉంటుంది. ఉద్యమస్ఫూర్తి అడుగడుగునా చోటు చేసుకుంటుంది. బ్రిటిష్ పాలనపై తిరుగుబాటు కనిపిస్తుంది. 1960లో వెలువడిన ఈ నవల స్వల్పకాలంలోనే రెండుసార్లు ముద్రణకు నోచుకుంది. మానవీయ మూల్యాలకు పట్టంకట్టే 'మృత్యుంజయ్' అస్సామీ సాహిత్యంలో మణిపూసగా భాసిస్తోంది.

డా. బీరేంద్రకుమార్ భట్టాచార్య యాభై ఆరు సంవత్సరాల వయస్సులోనే జ్ఞానపీఠ పురస్కారం అందుకోవడం గమనార్హం. ఆయన 1997 ఆగస్టు ఆరోతేదీన దివంగతుడయ్యాడు. అస్సామీ సాహిత్యంతో సహా భారతీయ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన అగ్రశ్రేణి రచయితగా ఆయన యశోనామం సాహితీలోకంలో చిరస్థాయిగా నిలుస్తుంది.

–గోవిందరాజు రామకృష్ణారావు



# చతుర ప్రవేశిక



జూన్ - 2010

జూన్ 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. గీతాంబరి మరిది పేరేమిటి?
2. హరిహరన్ తండ్రి?
3. నిషాను ప్రేమించిన వ్యక్తి?
4. డాక్టర్ చతుర్వేది అసిస్టెంట్?
5. మాసిలామణి వియ్యపురాలు?
6. గాంధీజీ హిందీలో రాస్తే తమిళంలో జవాబు ఇచ్చిందెవరు?
7. బీరేంద్ర కుమార్ భట్టాచార్య ఏ రచనకు జ్ఞానపీఠం వచ్చింది?
8. ఓ కుక్కను చంపబోతున్నారని కంప్లయింట్ ఇచ్చిందెవరు?
9. 'ఓ వర్షం కురిసిన రాత్రి' మూల రచయిత ?
10. బాపూజీ సతీమణి?

పంపినవారి పేరు: ---------------------------- వయసు (   )

చిరునామా: ----------------------------------------

----------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

ప్రవేశికలకు చివరి తేదీ 19

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 18



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 18

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

---

## ఉత్తమ వ్యాఖ్య :

ఈ సీసాని కనిపెట్టిన వాడెవడో..
ముందు వాడి పని పట్టాలి!

–కోపూరి రవికుమార్,
తెనాలి, గుంటూరు జిల్లా





## కాప్షన్ మీదే -17

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

ప్రభుత్వ ఇందిరమ్మ ఇల్లు వచ్చింది
ఇక సీసా కాపురానికి స్వస్తి!
– గాయత్రీదేవి , ఈ-మెయిల్

భూత(ం) దయ అంటే ఇదేనా?
– ఎన్. సుభాష్‌చంద్రబోస్,
శ్రీకాకుళం

ఇక నేనూ జనజీవన స్రవంతిలో
కలిసిపోతాను
– టి.ప్రసాద్, టి.నగర్, చెన్నై

వీసా లేదు, సీసా లేదు
పట్టి తెచ్చే అల్లావుద్దీన్ లేదు
ఏక్ నిరంజన్.. పోవే గొట్టాం పో!
– కొంగర ఉమామహేశ్వరరావు,
చెంచుపేట, తెనాలి

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78